# కిన్నెర

## ఏప్రిల్ 1953

విషయసూచిక




ఎడిటర్ — పందిరి మల్లికార్జునరావు
అసిస్టెంట్ ఎడిటర్ — పందిరి మీరాబాయి

సంపుటము 5 | ఏప్రిల్ 1953 | సంచిక 4

# ఆంధ్ర రాష్ట్రం

గత నాలుగు దశాబ్దాలుగా ఆంధ్రజాతి చేస్తున్న తపస్సు నేటికి ఫలించింది సరిగా నలభై సంవత్సరాలకు పూర్వం కీర్తిశేషులయిన బయ్యా నరసింహేశ్వర శర్మగారి అధ్యక్షతను బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగినది ఆంధ్రరాష్ట్ర నిర్మాణవాంఛ నాడు వ్యక్తంచేయబడినది తదాది ఆంధ్రజాతి స్వరాష్ట్రప్రాప్తికై ఆందోళన చేసింది అది నేటికి పరిపాకాన్ని పొందినది అక్టోబరు ఒకటవ తేదీని రాష్ట్రనిర్మాణం కానున్నది ఇది సంతోషింపదగిన విషయమే

కోస్తా జిల్లాలు, రాయలసీమలోని కర్నూలు, అనంతపురం, కడప, చిత్తూరు జిల్లాలు, బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు మూడును చేర్చి ప్రత్యేకాంధ్రరాష్ట్రంగా నిర్మింపబడగలదని ప్రధాని నెహ్రూ క్రిందటి నెల ఇరువదిఅయిదవ తేదీని ప్రకటించారు

ఆంధ్రరాష్ట్ర రాజధాని నూతనరాష్ట్రం సరిహద్దులలోనే ఉండవలెననీ, రాజధానీ నిర్ణయం ఆంధ్రప్రజలే తమ అసెంబ్లీద్వారా తేల్చుకోవాలనీ, తాత్కాలికంగానైనా మద్రాసు ఆంధ్రరాష్ట్ర రాజధాని కాజాలదనీ,ప్రధాని ప్రకటన స్పష్టంచేస్తున్నది అవసరమైన ఏర్పాట్లు కొత్త రాష్ట్ర లో జరిగేవరకు దానికి సంబంధించిన కొన్ని కార్యాలయాలు మద్రాసు నగరంలో ఉండవచ్చుననీ,నూతనరాష్ట్రం సరిహద్దుల లోపల ఆంధ్ర హైకోర్టు స్థాపనకు అనువైన ప్రాంతం గురించి ఆంధ్ర శాసనసభ నిర్ణయించేవరకు మద్రాసు హైకోర్టు ఆంధ్రరాష్ట్రపు హైకోర్టుగ వ్యవహరిస్తూ వుండగలదనికూడా పేర్కొనబడినది

ఆంధ్రరాష్ట్ర నిర్మాణసందర్భంలో ఉత్పన్నంకాగల సమస్యల పరిష్కారానికి సూచనలు కావించుటకు న్యాయమూర్తి శ్రీ వాంఛూ నియోగింపబడినారు శ్రీ వాంఛూ

తమ నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించారు దానిని ఆధారంగా చేసికొని, ఆ సూచనలను మన్నించి ప్రధాని నెహ్రూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రకటన చేయవలసిఉన్నది కాని,న్యాయమూర్తి శ్రీవాంఛూ నివేదికను కేంద్ర ప్రభుత్వం పరిశీలించినట్లుగాని, పరిశీలించినా పరిగణించినట్లుగాని తోచదు రాష్ట్రనిర్మాణవిషయంలో ఆంధ్రుల న్యాయమైన కోర్కెలుగాని, హక్కులుగాని ఎంతమాత్రం పరిగణింప బడలేదని చెప్పవలసిఉన్నది ప్రధాని నెహ్రూ ప్రకటనలో శ్రీ రాజగోపాలాచార్యులగారి అభిప్రాయాలకే ప్రాధాన్యం ఒసగబడి,ఆంధ్రుల న్యాయోచితమైన హక్కులు త్రోసిరాజు చేయబడినవి ఇందువల్ల ఆంధ్రజాతికి ఆశాభంగం, నిరుత్సాహం జనించినదంటే ఆశ్చర్య పడనక్కర లేదు

ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచార్యులుగారు ఆంధ్ర రాష్ట్ర విభజనపట్ల చూపిన ప్రవృత్తి హర్షింపతగినదిగా లేదు ముఖ్యమంత్రి అవలంబించిన విధానం ఆయన రాజకీయ వివేకం లోపించినదని రుజువు చేస్తున్నది రాజనీతి విజ్ఞులని భావింపబడే శ్రీ రాజగోపాలాచార్యులుగారివంటి పెద్దలనుండి ఇది ఎంతమాత్రం ఆశింపదగిన విషయం కాదు తమిళులను, ఆంధ్రులను సన్నిహితంగా చేకూర్చుటకు బదులు మరింత దూరంచేయుటకే శ్రీ రాజగోపాలాచారిగారి విధానం తోడ్పడగలదు

భారతప్రధాని శ్రీ నెహ్రూ స్వతంత్రంగాను, ధైర్యంగాను వ్యవహరించుటకు బదులు శ్రీ రాజగోపాలాచారి ఒత్తిడికి అనుగుణంగా అనుసరించడం శ్రీ నెహ్రూవంటి పూచీగల వ్యక్తికి తగదు భారతప్రధానిగా శ్రీ నెహ్రూ కావించిన ఏర్పాటు ఆంధ్రులకు తీరని ఆశాభంగం కలిగించింది ఆంధ్రుల దృష్టిలో శ్రీ నెహ్రూ తన ఉన్నతపథము నుంచి దిగజారినారు రాజకీయవేత్తగ శ్రీ నెహ్రూ గొప్ప పొరబాటును చేశారు ఇది తన జీవితచరిత్రలో తుడిచివేయ బడజాలదు , విస్మరింపబడనూ జాలదు

ఆంధ్రరాష్ట్రంలో చేరవలసిన పరిహద్దు తెలుగు ప్రాంతాల విచారణకై ఒక పరిహద్దు నిర్ణాయక సంఘం ఏర్పడగలదు చెంగల్పట్టు జిల్లాలోని పొన్నేరి, సత్యవేడు తాలూకాలు, సేలం జిల్లాలోని కృష్ణగిరి, హోసూరు తాలూకాలు,మైసూరులోని కోలారుజిల్లా, చిత్రదుర్గం తుమ్కూరుల లోని కొన్నిప్రదేశాలు, గంజాం జిల్లాలోని బరంపురం, జయపురంలోని కోరాపుట్టి, మధ్యప్రదేశాలలోని దక్షిణ బస్తరు, చాందా మొదలగు ప్రదేశాలు ఆంధ్రరాష్ట్రంలో చేరవలసినవే ఇవన్నీ నూతన ఆంధ్రరాష్ట్రంలో చేరేటట్లు ఏర్పడనున్న ఆంధ్రప్రభుత్వం జాగరూకత వహించవలసి ఉంటుంది

మద్రాసు నగరం ఆంధ్రరాష్ట్రంలో చేరకపోయినను మద్రాసు భవితవ్యంపట్ల పరిశిష్ట మద్రాసు రాష్ట్రానికి ఎట్టి అధికారం ఉన్నదో అట్లే ఆంధ్రరాష్ట్రానికికూడ అధికారం ఉండగలదు మద్రాసు నగరం ప్రత్యేకరాష్ట్రం అయ్యేటట్లు ప్రయత్నం చేయవలసిఉన్నది

ఆర్థికసంబంధమైన లావాదేవీలలో న్యాయంగా మనకు రావలసినవి రాబట్టుటకు రాబోవు ఆంధ్రప్రభుత్వం చూడగలదని ఆశింపవచ్చును

తాత్కాలికంగానైనా మద్రాసులో రాజధానిని పెట్టుకొనుటకు అంగీకరించని సందర్భంలో తాత్కాలికంగా హైకోర్టును, ఇతర కార్యాలయాలను మద్రాసులో ఉంచడం ఎంతమాత్రం సమంజసంకాదు కాబట్టి రాష్ట్రావతరణంతోనే ఇవన్నీకూడ ఆంధ్రరాష్ట్రంలోనే ఉండవచ్చును

అన్నిటికంటె ప్రధానమైనదీ, ముఖ్యమైనదీ, రాజధానీ నిర్ణయం పార్టీ భేదాలు, కులతత్వం, ప్రాంతిక విభేదాలు విస్మరించి ఆంధ్రజాతి పురోభివృద్ధినే లక్ష్యంలో ఉంచుకొని ఈ సమస్యను పరిష్కరించవలెను ఆంధ్రులలో విభేదాలకు, మనస్తాపాలకు తావుని కలుగనీయరాదు సుస్థిరప్రభుత్వం నెలకొల్పి ఆంధ్రరాష్ట్రం సుదృఢం కాగలుగుటకువీలుగా మన సమస్యలను పరిష్కారం చేసుకో

వాలి కాబట్టి, రాజధానీనిర్ణయంలో సాధకబాధకాలన్నీ చక్కగ ఆలోచించి మరీ నిర్ణయించవలసి ఉంటుంది.

తాత్కాలిక రాజధానిని ఇప్పుడు ఏర్పాటుచేసికొని, ఆటుపిమ్మట స్థిరమైన రాజధానికి తరలివెళ్లడం అంత ఉచితం కాజాలదు తాత్కాలిక రాజధానిలోని భవనాలకు కోట్లకొలది రూపాయలు ఖర్చుచేసి, స్థిరమైన రాజధాని ఏర్పడినపిమ్మట వీటిని వదలివెళ్ళడం వృథా ఖర్చులూ, ప్రయాస. కాబట్టి, ఇప్పుడే స్థిరమైన రాజధానికి ఏర్పాట్లు కావించడం సమంజసం

రాజధాని, హైకోర్టు, విశ్వవిద్యాలయం మొదలైనవన్నీ ఒకేచోట ఉన్నయెడల జాతిపురోభివృద్ధికి, ప్రభుత్వం సుస్థిరత్వానికీ, ప్రజల సౌకర్యానికీ వీలుగా ఉంటుంది ఇవి వేరువేరు ప్రదేశాలలో చెదరిపోయినయెడల ఆంధ్రజాతి తీరని దెబ్బ తగులగలదు

ప్రధాని నెహ్రూ ప్రకటనలో ఒకవిషయం గమనింపవలసి ఉన్నది ప్రధాని తాత్కాలికపు రాజధాని ప్రసక్తినే తీసికొనివచ్చారుకాని, స్థిరమైన రాజధాని ఏర్పాట్లనుగూర్చి ప్రసంగించి ఉండలేదు హైదరాబాదు రాష్ట్రం భాషా ప్రయుక్తంగా విడివడినానరు హైదరాబాదునగరం రాజధానిగా విశాలాంధ్రరాష్ట్రం ఏర్పాటుచేసికొనవచ్చునను ఊహకు శ్రీ నెహ్రూ ప్రకటనను ఆధారంచేసికోవచ్చునా? శ్రీ నెహ్రూ మనస్సులోని విషయం అదే అయినయెడల దానిని ఇప్పుడే వెల్లడించి తదనుగుణమైన ఏర్పాట్లుచేయడం ఉచితం

ఆంధ్రరాష్ట్రనిర్మాణంతోబాటు భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం బలం పోసుకోగలదు కన్నడిగులు తమ రాష్ట్రం ఏర్పడవలెనని అంటున్నారు, మహారాష్ట్రులు కూడ ఆందోళన చేస్తున్నారు. తెలంగాణాలోని మన తెలుగు సోదరులు ఆంధ్రరాష్ట్రంలో చేరవలెనని కోరుతున్నారు ఈ ప్రజాఉద్యమం ఒత్తిడికి హైదరాబాదు త్వరలో విభజన కాకుండఉండలేదు తెలంగాణంలోని ఎనిమిది జిల్లాలు, రాయలసీమ, కోస్తా జిల్లాలు కలసి మహాంధ్రం ఏర్పడగలదు అనాడు హైదరాబాదు నగరమే ఆంధ్ర రాజధాని కాగలదు కావున, తాత్కాలిక రాజధానిగాగాని, అశిథి రూపంగాగాని, అర్ధరూపంగాగాని హైదరాబాదునే నేటి నుంచి రాజధానిగా ఎందుకు చేసికొనకూడదు?

హైదరాబాదు నగరం ఆంధ్రరాష్ట్రంలో చేరడానికి కేంద్రం అంత సుముఖంగా ఉండకపోవచ్చును యుద్ధ ప్రమాదంవల్లగాని, మరి ఏయితర కారణాలవల్లనైతేగాని ఢిల్లీనగరంనుంచి భారతప్రభుత్వ రాజధాని హైదరాబాదు నగరానికి తరలింపబడవచ్చును కావున, హైదరాబాదు నగరం ఆంధ్రరాజధాని అగుటకు కేంద్రం విముఖత్వం చూపవచ్చును

హైదరాబాదు ఆంధ్రరాజధానిగ ఉన్నను యుద్ధ ప్రమాదం సంభవించి, భారతరాజధానీ నగరం తరలింపబడవలసినయెడల హైదరాబాదును సైనికకేంద్రంగా ఉపయోగించుకొనుటకు ఎట్టి అభ్యంతరము ఉండజాలదు కావున, ఆంధ్ర రాజధాని హైదరాబాదులోనే ఉండుటకు ఎట్టి అభ్యంతరం ఉండకూడదు హైదరాబాదు ఆంధ్ర రాజధానిగా ఏర్పాటుచేయడం అన్నివిధాలా శ్రేయస్కరం

దుర్గమపర్వతాలను అధిగమించి, మహాసామ్రాజ్యాలను స్థాపించినది ఆంధ్రజాతి సముద్రాలను దాటి తన విజ్ఞానాన్ని, శిల్పాన్ని, సంస్కృతిని దేశదేశాల వెదజల్లినది తెలుగుజాతి ఆంధ్రుల ప్రాభవం ఆంధ్రుల తేజస్సు, ఆంధ్రుల పరిభవం దేశదేశాల వ్యాప్తిగాంచినది అట్టి ఆంధ్రులు నేడు తమ రాజకీయ విజ్ఞతను కోల్పోవజాలరు దూరదృష్టితోను, వివేకంతోను, ఏకాభిప్రాయంతోను మనలను ఎదుర్కొన్న సమస్యలను పరిష్కరించి ఆంధ్రప్రభుత్వాన్ని సుసంపన్నం చేయాలి ఇందులకు ప్రజలూ, నాయకులూకూడ పూనుకోవాలి తిరిగి ఆంధ్రజాతి యథోచిత గౌరవాన్ని సంపాదించుకోవాలి

—•••—

# శ్రీ గురజాల మాధవరావు

వాసిరెడ్డి రాధాకృష్ణ

కళాకారుడు ఈనాడు కడగంటిచూపుకు కూడ హీనమైనాడు సంవత్సరాలతరబడి కృషిచేసి పాండిత్యము సంపాదించినా, ఆదరించువారు ఒక్కరు కనిపించ దీనాడు ఈ కారణముచే కళాకారుల జీవయాత్ర బహా దుర్భరమై చివరకా కళానవి ఎండిపోవు స్థితియు వచ్చుచున్నది ఇట్టి సందర్భములో కర్తవ్యధర్మ మెఱిగి కళాకారునికి సమ్మానోత్సవ మొక్కటి జరుగుచున్నదనగా ప్రశంసింపని వ్యక్తి యుండదుగదా।

నాడు 14-2-68 "కిన్నెర" పత్రికా కార్యాలంలో ఆబాలగోపాలం మూగిపోయింది శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారి శిష్యులు శ్రీ గురజాల మాధవరావుగారు తన బృందముతో సంగీత కచ్చేరీ జరుపుచున్నారని తెలిసింది నేనుకూడ కుతూహలంగా వినడానికి నా మిత్రులతో పోయియుంటిని

శ్రీ పందిరి మల్లికార్జునరావు గారిని ఆంధ్రలోకం గుర్తించి ఈనాటికి దాదాపు పాతిక సంవత్సరాలయింది ముఖ్యంగా కిన్నెర పత్రిక ప్రారంభించినప్పటినుండి పత్రికాలోకంలో వన్నెకెక్కినారు వీరు చిన్ననాట జరిపిన "సుభాషి" పత్రికను చదివినవారికి ఆనాడే వీరికుండిన కళాసంస్కృతి వీరిలో ఉబికెత్తిన సంఘసంస్కారణ లీనమైపోయియుండిన సాహిత్యసేవ చక్కగా బోధపడగలదు—అట్టివారు ఈనాటి దుర్భరస్థితిని గుర్తించి సంగీతముయొక్క విలువను శ్లాఘించి మాధవరావుగారిని సమ్మానింప ముందంజ వేసినారు వీరికి ఈ కచ్చేరీ విషయంలో చేదోడువాదోడుగా శ్రీ పి వి సుబ్బారావుగారు (కార్యదర్శి ఆంధ్రజిల్లా కాంగ్రెసు కమిటి) ఎంతో సాయపడిరి

సంఘమునకు మార్గదర్శకులై ఇట్టి సమ్మానములు జరుపు మల్లికార్జునరావుగారి పందిరిలో ఆనాడు ఒక్క కళాకారులేగాక వ్యాపారులు రచయితలు కవులు గాయకులు, స్త్రీలు పురుషులు ఎన్నో వృత్తులకు సంబంధించినవారు మూగిపోయినారు శ్రీ మాధవరావుగారికి ప్రక్క వాద్యములు వాయించిన శ్రీ చిత్తూరి సుబ్రహ్మణ్యంగారు (వయొలిన్) శ్రీ ఏ వి జానకిరామన్‌గారు (మృదంగం) శ్రుతి లయల పోషణతో సహకరించడం ప్రశంసనీయం

సంగీతం మానసిక ప్రపంచానికి చైతన్య లోకానికి మధ్యవర్తి పడలిపోయిన జీవకణాలను పురిగొల్పి జీవకళను ప్రసాదించు అమృతతుల్యం సంగీతం వేసారిపోయిన హృదయపంజరంలో నూతనోద్రేకాన్ని సృష్టింపజేయు విద్యుచ్ఛక్తి సంగీతం దేవతలకు, మానవులకు రాయబారి ఈ సంగీతం ఇట్టి ఉత్కృష్ట కళ గురజాల వారి ద్వారా సాంప్రదాయసిద్ధంగా ప్రథమంలో మధ్యకాలంలో బేగడ రాగవర్ణంతో ప్రారంభమైంది

సంగీతమే సృష్టిమూలం "శబ్దమే" ప్రపంచపు స్వాగత వినాదం జగత్తుకు మానవునికి సంబంధం తెచ్చిపెట్టి సర్వవిధాల జీవితాంధకారాన్ని పోగొట్టే సంగీతపు కాగడా ప్రణవస్వరూపుడైన ఓంకారనాథుని శాంతింపజేసే ప్రణవశబ్దం ప్రప్రథమంలో వాసుదేవాచారి విరచితమగు గౌళరాగంలోని "ప్రణమామ్యహం"అను కీర్తన ద్వారా వెలువడి సభాసదుల సమ్మోహనములో ముంచివేసింది ఈ సందర్భంలో పాశ్చాత్య విజ్ఞాని యొకడు పేర్కొన్న ఈ క్రింది వాక్యాలు జ్ఞాపకమునకు వస్తున్నవి—"ప్రకృతిసిద్ధంగా మానవుడు కోరే నాల్గవ ముఖ్యపదార్థం సంగీతం—మొదటిది ఆహారం రెండవది దుస్తులు మూడవది నివాసస్థలం నాల్గవది హృదయ శాంతి కలిగించే సంగీతం"

నరాకు జీవితంలో చికాకు వాతావరణంలో చితికిపోయి అంతుబొంతుగానక అఘోరించే మానవాళి హృదయవేదనటకవైపు అభం శుభం ఎఱుగని అబలలపై అధికారబలప్రయోగం మరొకవైపు యుద్ధవినాదాలతో శాంతిఘోష వేరొకవైపు నాశకారుల సృష్టి వేషములలో పడి ఆశకళలను మఱచిపోవు వైఖరి మరియొకవైపు ఇట్టి క్లిష్ట పరిస్థితులను గమనించి గుండె కరగి ఒక కళాకారుడు విలపించుచున్నాడు—అదే తిరుపతి నారాయణస్వామి గారి రచనయగు "నరాశేల సరస్వతి—నాటకురంజి" కీర్తన

ఈనాడు ప్రపంచ రంగంలో శాంతియుతంగా పోషింపబడే హృదయం కలిగినవారు ఒక కళాకారులే కారణం వారి కెన్ని అవాంతరాలు కల్గినా అన్నీ మఱచి నాదస్వరూపాన్ని చూడగోరి చవిచూచేవేళ వారిలో ఒక విధమైన చైతన్యం కలిగి అమరత్వం ప్రాకిపోతుంటుంది ఈ స్వేచ్ఛావిహార హృదయ స్వాతంత్ర్యం పేరెవ్వరికి కలుగదు ఆనాదోపాసనను త్యాగయ్యగారు "నాదతను

మోహితం" అనే కీర్తన ద్వారా చిత్రరంజనిలో చిత్రకాంతి చేకూర్చి నారని మన గాయకులు అందకేనేవరికి ఎంతో ఆనందదాయకంగా ఉండెను అందులో ముఖ్యంగా సామవేదజనితమై సరిగమపద నిసలతో వచ్చే సంగీతమ్మని త్యాగయ్యగారు తెలియజేసిన పట్టాలు వినడానికి ఎంతో హాయిగానుండెను

పల్లవి గోపాలయ్యగారి "శ్రీరమామణి మనోహర" అను కీర్తన మోహన రాగంలోను, "నేనెందు వెదకుదురా" అనే త్యాగయ్యగారి కృతి కర్ణాటక బేహాగలోను రామదాసు కృత మగు "ఎన్నగాను రామభజన" పంతువరాళిలోను పాడుచుండగా ఎంతో హృదయరంజకముగా నుండెను భావగర్భితముతో సాహిత్య పోషణంచేసి గాయకుడు తన్మయత్వమున పాడుచుండగా నిజంగా కర్ణాటక సంగీతంలో ఉట్టిపడే జీవకళ ఎంత విలువకలదో వర్ణింపతరముగాకుండెను

చిత్రకళ ఒక కళాభాగాన్ని పూర్తిగా వివరింపలేదు కాని సంగీత కళ అట్లుగాదు—మరిగియుండి మహాత్తర రహస్యములను సూద కేటతెల్లముగా విశదీకరించగలదు హృదయ చలనమును ఒక సంగీతం తప్ప వేరేదియు ప్రతిబింబింపచేయదు ప్రకృతిలో పుట్టిన ప్రేమకు కాంతానికి తోబుట్టువు సంగీతం గోళబాహ్యాళ్యము లీనాదు ఓంకారనాదముతో నిండిపోయి ఆ శబ్దముతోనే భ్రమణము చేయుచున్నదని ఈనా దోంకార జనిత స్వరూపముల గ్రోలుటకు ఆనందించుటకు, అందిద్చుటకు అనుభవించుటకు మానవాళికి సాధ్యమా? ఇట్టి నాదము అహోరాత్రములు మనకు ప్రక్కనే నిలబడియుండుటచేతనే మనము జీవింపకలుగుచున్నాము ఈ శబ్దమును మానవుడు వాని బుద్ధికౌష్ఠవమునకు తగినట్టు సరాళ్ళరుని గను, ప్రాణవాయువుగను పోషించుచున్నాడు త్యాగయ్యగారు ఈ సూక్తిని చక్కగా తెలిసి "ప్రక్కన నిలబడి" అనే కీర్తనను కరహరప్రియలో హరిహరప్రియముగా పాడియున్నారు—దీనిని మన గాయకులు రాగ ఆలాపనాలు చేసి "తనువుచే వందనమొన రించుచున్నాను" అనుచోట నిలపెట్టి, నెరవు జేసి అన్నిటికిమించిన శ్రుతి లయ పోషణచేసి పాడుచుండగా సంగీతము అవ్యయశక్తి ఆనందమూర్తి రెంటితో కలిసి కౌలకరించి నట్టుట్టిపడుచుండెను

విశ్వకళ్యాణము కోరు జీవకోటికి గల ఒక్క ఉమ్మడి సొత్తు ఈ సంగీతమే క్రిమికీటకములు మొదలు ఘోరారణ్యము లలో విచ్చలవిడిగా విహరించు మృగరాజములవరకు నిలిచి నైమలచి వినువస్తువు ఈ సంగీత మొక్కటే మానవుని నిత్య జీవితంలో, హృదయంలో చేరే దుమ్ము ధూళిని ఊడ్చివేయు పరికరం ఈ సంగీతం చచ్చిపోయే ఆశయాలకు ప్రాణదానమివ్వ దానికి మానవుడు ప్రేమించే కళ ఈ సంగీతం భగ్నహృదయు లకు సంజీవివంటిది సంగీతం మానవుని భావనాదృశ్యంతంలో పన్నగిల్లిపోయే కాంతి కుసుమములను రాలిపోకుండ నిలబెట్టే సంజీవి ఈ సంగీతం విషయలోలుడై నవానిని మనస్సులో అంకు రించే భావం ఒక గీతంగా తయారవుచున్నది అట్టి భావ గీతమాలి కలో ఒక్కటే ఈ "ఓ విభావరి" ఆనే హిందూస్థాన్ తోడిరాగం లో మాధవరావుగారు పాడిన గీతి ఆవెంటనే జయదేవులవారి చిత్రవీధి సంచారం చూచినాము నిజంగా రాధామాధవుల నెచ్చి రకములుగా తన మానసిక ముకురంలో చూచినాడో, అన్నియు సక్యతి దిశదిశ అను సింధుభైరవి రాగకీర్తనము రాగమాలికలో "రాధికాకృష్ణా" అను కీర్తనము చాల మధురముగా తెలియజేసెను. దేవుడు సంగీతంలో ఎట్లు లీనమైపోయి యున్నాడో ఈ అష్ట పదులు చక్కగా వివరించెను దేవునికేరు సోపానయాత్రకు ఈ సంగీతపు మెట్లు ఎట్ల పనికివచ్చుచున్నవో ఈమూలంగా చక్కగా తెలియుచున్నది

హృదయవికాసం మానవుని సంతోషానికి మూలకారణం నూతన చైతన్య దీప్తి హృదయరంగంలో వెలుగుచున్నంతకాలం, ఆ దివ్వె వెలుగులో భావనా నృష్టిమూర్తిలు నృత్యము చేయుచున్నంత సేపు ఆ నృత్యమునకు బుద్ధిప్రయోగం ప్రక్కవాద్యముల వాయించు నంతదాక వ్యక్తిగతంగా ఉబుకెత్తి ఉద్రిక్తుడై ఉత్సవారూఢునివలె ఉత్తేజముతో కనిపించుచున్నాడు మానవుడు ఆ సమయంలో వానికి కనిపించునదెల్ల ప్రణయస్వరూపం ప్రణయదేవతలు మన్మథ—రతీదేవుల ఉపాసనా నిమగ్నుడై ప్రశాంతంగా గంభీరంగా కనబడుతున్నాడు అప్పుడు కోరిన వస్తువు ఎదురైనపుడు హృదయ కవాటమును చీల్చుకువచ్చే కొంగ్రొత్తనాదమే జావళీగీతికలు మాధవరావుగారు పాడిన మధురానగరిలో అను ఆనందభైరవి రాగ జావళియు అపుడు మనసు నిలచునదే అను ఖమాస్ రాగజావ ళియు ఎంతో వీనుల విందుగా నుండెను మానవ భావనా ప్రపం చంలోని కళావనిలో ఇట్టి కుసుమావళి ఎంతో పడియున్నదియు, ఏర్పికూర్పుటకు కన్నియలు నోచుకొని ప్రియుని రాకకై నిరీక్షించు చున్నారనియు భావతరంగంలో ఎన్నో ఊహలు ప్రవహించు చుండెను

పరజ రాగంలో తిల్లానా "తధింధింత"—పేర్కొనతగి నది గాయకులు ఇంకా ఎన్నో పద్యాలు, పాటలు పాడి చివరికి మంగళంతో నాటి కచ్చేరిని ఇంపుగా ముగించినారు వారికి నా ధన్య వాదాలు

దేశంలోని కళాపోషణ ప్రభుత్వం నిర్వహించినపుడే దాని పూర్వ చరిత్ర నిలబెట్టుకోగలదు లేనిచో ఆదరించు సంస్థానాధీశులు లేని ఈనాడు కళాకవ్య నామరూపాలు లేకుండ అంతరించిపోవును

అట్టి దుస్థితికి మన జీవకళలు పాల్పడక రక్షించడం మన మల్లికార్జునరావుగారి వంటి పత్రికా సంపాదకుల కర్తవ్యం

ఏనాటికిని ప్రపంచంలో నూతనశక నిర్మాతలు పత్రికా సంపాదకులు కాబట్టి "కళ–ప్రభుత్వ పోషణ" అను విషయాన్ని మల్లికార్జున రావుగారు నాయకత్వము వహించి కళాకారులకు నీడ నిచ్చు మహా వటవృక్షమై వెలుగొంద దేవు డనుగ్రహించుగాక

ఈ చిన్నవయసులో ఇంత నేర్పుగా సంగీత ప్రదర్శనము గావించిన గురజాల మాధవరావుగారికి సంఘము సర్వవిధాల తోడ్పడ కోరుచున్నాను శ్రీమాధవరావుగారు వెంకటగిరివాస్తవ్యులు ఇప్పుడు చెన్నపురిలోనే ఉంటున్నారు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వద్ద 1943–1948 వరకు శిష్యులై విజయనగరం కళాశాలలో విద్య నభ్యసించి ఆంధ్రదేశమంతటా కచ్చేరీలు చేసి 1951 లో చెన్నపురికి వచ్చినారు ప్రప్రథమములో చెన్నపురిలో ఆంధ్రవిజ్ఞాన పరిషత్తులో న్యాయమూర్తులు శ్రీ డబ్ల్యు ఎస్ కృష్ణ స్వామి నాయుడుగారి ఆధ్వర్యమున ఒక సన్మాన సభ జరిపి తంబురా ఒకటి బహూకరించడమైనది తదుపరి 1952లో ఆస్తిక మహాజన సభలో ఒక సన్మానసభ జరుపబడెను సంగీత సాహిత్య విద్వాన్, ఇసైఅరసు, ఇసై చెల్వర్ శ్రీ కవకూర్ మీనాక్షి సుందరం పిళ్లైగారు ఆధ్వర్యం వహించారు

ఈమధ్యనే మాధవరావుగారు మైసూరు, ఆంధ్రలలో ముఖ్య స్థానములలో సంగీత సేవచేసి చెన్నపురి తిరిగివచ్చినారు ఎప్పుడూ కళాకారుల పోషణయందే నిమగ్నులైన సందిరి మల్లికార్జున రావు గారు ఆదమదలంచి కర్తవ్యమును అందరికీ ముందు నెంవేర్చుటకు సన్మానసభ జరిపి నూతనవదహార్లు బహూకరించారనగా వీరి సేవ అపారము

నాదోపాసన చేయువారికి అన్నసౌఖ్యములు సమకూర్చు సర్వశక్తి ప్రపంచ శాంతిని చేకూర్చి కళాపోషణను నిలబెట్టవలసి నదిగా ప్రార్థించుచున్నాను

---

# తేటతెలుగు; తెలుగువారిలో విద్యావ్యాప్తి

వారి ఆదిశేషువు, ఎమ్ ఎస్‌సి

ఇంగ్లీషు భాషలో సుమారు కనీసం 850 మాటలతో మనం మన వ్యవహారాలన్నీ సాగించుకోవచ్చునట। ఆ పదాలతోటే ఒక వ్యాసం వ్రాసి ఈ విషయాన్ని సి కె ఆగ్డెన్ దొరగారు ఉదాహరణతో రుజువుచేశారు వారి సూచన ఒక మంచిరోజున మంచి ముహూర్తంలో దేవుణ్ని ప్రార్థించి చేసినటువంటిదికాదు ఒక భాషాసంఘమువారు ఎన్నో ఏళ్ళు సాధనచేసి ఇంగ్లీషులో ఎక్కువ తరచుగా వాడబడుతోన్న మాటలని ఏరి కూర్చారు అలా కూర్చిన వాటిలో మనకి మామూలుగా అన్ని సందర్భాల్లోనూ వాడుకొనేటందుకు కనీసం ఎన్నిమాటలైతే సరిపోతాయో వాటినే తీసుకున్నారు ఈలా ఏరి కూర్చిన పదాల్నే వారు వ్యవహారానికి సరిపోయే ఇంగ్లీషు భాష అని తేల్చారు, కేవలం కొన్ని పదాలు తెలిసినంతమాత్రంచేత ఏ భాషనీ స్వంతంచేసుకోలేముగదా। వాటిని భాషాశాస్త్రాన్ని ఉపయోగించి వాక్యాలుగా వాడుకోవాలి ఆ పదాలూ భాషాశాస్త్ర నియమాలూ మన మనస్సుకి హత్తుకొనేలా వాటిని చాలామార్లు ఎన్నివిధాల వీలైతే అన్నివిధాలుగా వాడాలి ఈ రెండు పనుల్నీ సాధించేటందుకు ఆ భాషాసంఘంవారు మాటల పట్టికనీ, వాటిని వాక్యాలలో ఉపయోగించేటందుకు అవసరమైన కనీసపు భాషానియమాల్నీ ఏర్పాటుచేశారు అవి అన్నీ కలిపి అచ్చువేసినట్లయితే ఒక పేజీ దాటదు వ్యావహారిక ఇంగ్లీషులో ఒకటిరెండు వాచకపుస్తకాల్నీ, ఆ వాచకాలు చదివినతర్వాత తిరిగి త్వరగా ఇంగ్లీషుని మరచిపోయి మళ్ళీ ఎప్పటి ఆటే ఆదే కోటన్నలా అయిపోకుండా వచ్చిన ఇంగ్లీషుని నిలబెట్టుకొనేటందుకు ఉపయోగించే కథావాచకాలూ శాస్త్రవిషయాలున్న పుస్తకాలూ ఎన్నోకూడా తయారయాయి పీటికిసాయిరం ఇంగ్లీషు భాషలోఉన్న మాటల్లో ఇరవైవేల మాటల్ని వ్యావహారిక ఇంగ్లీషులోకి అంటే ఈ 850 మాటలలోకి మార్చేటందుకు ఉపయోగించే నిఘంటువుకూడా తయారైంది ఇంగ్లీషుభాషా సంఘంవారి కృషివల్ల ఇతరులు ఇంగ్లీషుని సులభంగా నేర్చుకొనేటందుకు అవకాశాలు కలిగేయి

వ్యావహారిక ఇంగ్లీషుకి లోకులలో కలిగిన ఆమోదాన్ని గమనించి దాని ప్రాముఖ్యాన్ని చాలామంది గుర్తించారు మన దేశంలోని భాషాసమస్యల నన్నింటినీ మొదటినుంచి చివరవరకూ ఏదీ వదలకుండా చర్చించి పండిత జవహర్‌లాల్ నెహ్రూగా మన దేశంలో వ్యావహారిక ఇంగ్లీషుకి ఇవ్వదగిన ప్రాముఖ్యాన్ని గురించి ఈలా అన్నారు

"ఎంతోమంది పండితులు ఎన్నో ఏళ్ళు కృషిచేసి వ్యవహారానికి సరిపోయే ఇంగ్లీషుని తీర్చిదిద్దారు అది ఇంగ్లీషుభాషే మామూలు ఇంగ్లీషుకీ దానికీ ఏమీ ఎక్కువ తేడా కనపడదు కానీ దాన్ని నేర్చుకోవడంమాత్రం చాలా సులభము వ్యావహారిక ఇంగ్లీషుయొక్క ముఖ్యమైన లక్షణమే అది వ్యవహారానికి అవసరమైన ఈ కనీసపు ఇంగ్లీషు పదాల్నీ వాటిని వాడేటందుకు సరిపోయే భాషానియమాల్నీ ఒక పేజీలో అచ్చుకొట్టవచ్చు వాటిని కొంచెం తెలివికలవారు రెండు మూడువారాల్లో నేర్చుకొని స్వంతం చేసుకోవచ్చు ఆతర్వాత వారు రోజూ దాన్ని వాడుతూ తాము నేర్చుకొన్న భాషని మరచిపోకుండా చూసుకొనడంమాత్రమే అవసరమౌతుంది ఈ విషయం వివరానికి వింతగాఉన్నా నిజం అవడంలో ఏమీ సందేహంలేదు

వ్యావహారిక ఇంగ్లీషుని బాగా సాధనచేసినవారు తమ అభిప్రాయా లన్నింటినీ ఇంగ్లీషులో తెలియజేయగలుగుతారు వారు ఇతరులతో మాట్లాడే ధోరణి అతిసులభముగా ఉంటుంది అందుచేత ఇంగ్లీషువారికీ ఇతరులికీకూడా వ్యావహారిక ఇంగ్లీషు అవసరమే వ్యావహారిక ఇంగ్లీషు తెలిసినవారు ఇంగ్లీషు భాషాభవనంలోకి గుమ్మందాటి హాలులోకి ప్రవేశించారనవచ్చు వారికి ఇష్టముంటే లోపలికివెళ్ళి ఆ భవనంయొక్క అందచందాలు తొందరపడకుండా మెల్లగా చూడవచ్చు లేకపోతే హాలులోనే హాయిగుండి ఇంటియజమానితో వ్యవహారాలు చూసుకొని బైటికిపోవచ్చు

మనదేశంలో ఇంగ్లీషుభాషని ఇంకా కొంతకాలంపాటు విరివిగా వాడుకోవలసిఉంటుంది అది తప్పదు అందుచేత ఇంగ్లీషు తల్లిభాషకాని మనవారందరికీ ఎవ్వరెవ్వరికి ఇంగ్లీషు నేర్పించవలసిన అవసరమున్నా వ్యావహారిక ఇంగ్లీషునే నేర్పించాలనే నా అభిప్రాయము '

వ్యావహారిక ఇంగ్లీషుయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించింది పండితులూ రాజకీయ నాయకులూ మాత్రమేకాదు ఇంగ్లీషు అక్ష

రాలు తెలియగానే పరేభాషైనా వ్రాయటమూ చదువటమూ తెలిసినవా రంతా తమంతతామే వ్యావహారిక ఇంగ్లీషుని నేర్చుకొనేటందుకు ఉపయోగించే బొమ్మల వాచకపుస్తకాలని ఎక్స్తతవ్యాపారుల్లో కొందరు ప్రకటించారు

వ్యావహారిక ఇంగ్లీషుగురించి ఇంత చెప్పినా ఎన్నో ఏళ్లు బడులలోనూ కాలేజీల్లోనూ ఎంతో శ్రమపడి చదువుకున్నా మనలో చాలామందికి ఇంగ్లీషు సరిగా మాట్లాడటమూ వ్రాయటమూ రాదే 850 మాటలేమిటి అన్నిరకాల గోష్ఠివ్యవహారాలకి సరిపోవడం ఏమిటి? నమ్మడానికి సాధ్యంకాకుండా ఉంది అని మీలో కొందరు సందేహించవచ్చు అందుచేత ఇంగ్లీషుభాషని గురించి మరికొన్ని విషయాల్ని తెలియజేయదలచుకొన్నాను

ఇంగ్లీషుభాషలో మొత్తం అసలు రెండు లక్షల నలభై వేల మాటలరవై ఐదు పదాలున్నాయని వాటిని ఉపయోగించుకొని సుమారు ఐదులక్షల మాటలను కల్పించుకోవచ్చుననీ నిఘంటువు వల్ల తేలింది వాటిలో ఒక లక్ష తొంభైఏడువేల తొమ్మిదివందల తొంభైపూటలు మాత్రమే చెలామణీ అవుతున్నాయి ఏభై రెండు వేల పదాలు మారుమూలపదాలైపోయి వాడుకలోంచి తప్పుకున్నాయి ఇతర భాషలనుంచి తొమ్మిదివేల ఎనుమందల ముప్పై ఒక్క పదాలు వచ్చి కలిశాయి అని జేమ్సు మర్రే అనే పండితుడు ఒక నిఘంటువులో లెక్కకట్టి చెప్పాడు ఇక ఈ భాషలోఉన్న పదాలన్నింటిలోనూ ఎవరెవరు ఎన్నెన్ని వాడారు? కనీసపు వ్యవహారాలకి ఇన్ని పదాలూ అవసరమేనా? కనీసపు వ్యవహారాలకి 850 పదాలు చాలునని సి కె ఆగ్డెన్ దొర ఏ విధానాన్ని బట్టి తేల్చాడు? అన్న ప్రశ్నలకి జవాబు లిస్తాను

ఇంగ్లీషువారికో షేక్స్పియర్ గొప్ప కవి ఆయన 36 నాటకాలూ ఇంకా ఎన్నో మంచి పద్యకావ్యాలూ వ్రాశాడు అవన్నీ చేరి మన రామాయణం భారతాల అంత ఉంటాయి ఇంత గొప్ప వ్రాతగాడు ఎన్ని పదాల్ని వాడాడు? ఏ పదాన్ని ఎన్నెన్నిసార్లు వాడాడు? అని ఇంగ్లీషు భాషలో పండితులు విమర్శకులూ పరిశోధించారు ఆ పరిశోధనలవల్ల షేక్స్పియర్ పదిహేనువేల ఐదువందల మాటల్ని మాత్రమే వాడినట్లు తేలింది నాటకాల్లో రకరకాల సంఘటనలూ సంభాషణలూ వర్ణించవలసిఉంటుందికదా ఎన్నో నాటకాలు వ్రాసిన షేక్స్పియర్ కవి ఇంగ్లీషుభాషలో పదిహేనవ వంతు మాత్రమే ఉపయోగించుకున్నాడు అందుచేత నవలలూ నాటకాలూ వ్రాయడానికికాకుండా కేవలం వ్యవహారాలు మాత్రమే చూడదలచుకొన్నవారు అంతకంటె ఎంతో తక్కువ మాటలతో పని గడుపుకోవచ్చుననడంలో వింత ఏమిటి? ఇదేదో పంతవాటంగా కనుపించే ఉదాహరణ అని మీలో ఎవరైనా బుద్ధిమంతులు అనవచ్చు అటువంటివారికి నమ్మకం కలిగించేటందుకు మరికొందరి సంగతికూడా చెప్పదలచుకొన్నాను

ఇంగ్లీషు కవులలో జాన్ మిల్టన్ మరొక గొప్ప కవి ఆయన కవిమాత్రమేకాకుండా గొప్ప పండితుడు ఆయన పురాణ ధోరణిలో రెండు పుస్తకాల్నీ ఎన్నో పద్యకావ్యాల్నీ వ్రాశాడు అవన్నీ ఆయన పాండిత్యాన్ని వివరంగా తెలిపేవే పాండిత్యంలోనూ పదశిల్పంలోనూ ఆయన్ని మన పోతనతో పోల్చవచ్చును అలాంటి పదశిల్పికూడా షేక్స్పియర్ వాడిన పదాలకంటె తక్కువ మాటలనే వాడాడు

ఇంక కవులను వదలిపెట్టి వచనం వ్రాసినవారిసంగతిని గురించి ఆలోచిద్దాము ఛార్లెస్ లాంబ్ వచనం వ్రాయడంలో పేరుపొందాడు ఆయన వాడిన మాటలు పదివేలుమాత్రమేనట, డేవిడ్ అనే వ్యాసంచయిత షేక్స్పియర్ వాడిన మాటలలో నాలుగోవంతు మాటల్నిమాత్రమే ఉపయోగించాడట

ఇంగ్లీషు తల్లిభాషఐనవారికి పదకొండుఏళ్ళు వయసు వచ్చేటప్పటికి ఎనిమిదివేల ఐదువందల మాటలు వస్తాయనీ పదిహేను ఏళ్ళ వయసు వచ్చేటప్పటికి పన్నెండువేల మాటలు స్వంతం చేసుకుంటారనీకూడా పరిశోధకులు తేల్చారు మరి ఆరు ఏళ్ళు ఎదిగి యువకులైనవారికి సామాన్యంగా ఇరవై ఐదువేల మాటలకంటె ఎక్కువ రావనీ సామాన్యప్రజలలో పదివేల మాటలకంటె ఎక్కువ తెలిసినవారుండరనీ సగటున సామాన్యులకి తెలిసిన మాటలు రెండు మూడువేలు మాత్రమేననీ కూడా తెలుస్తోంది. ఇక ఇంగ్లీషు తల్లిభాషకాకుండా ఇంగ్లీషుని నేర్చుకుంటున్న మనలాంటివారికి ఏ వయసునాటికి ఎన్నెన్ని మాటలు వస్తాయోకూడా పరిశోధకులు లెక్కకట్టారు పదకొండుఏళ్ల వయసు వచ్చేటప్పటికి పదిహేనువందల మాటలూ, పదిహేనేండ్ల వయసునాటికి మూడు వేల మాటలూ, ఇరవై ఒక్కఏళ్ల వయసునాటికి అంటే బి ఏ, అయేటప్పటికి ఎనిమిదివేల ఐదువందల మాటలూ వస్తాయి ఈ వివరాలను కొంచెం పరిశీలించామంటే మనం ఇంగ్లీషుని ఎంత దొర్లి నేర్చుకున్నా సుమారు ఎనిమిదివేల ఐదువందల మాటలకంటె మనసుకి పట్టవనీ, తలచుకోగానే కొటికివచ్చే మాటలన్నీ చేరి అంతకంటె ఎప్పుడూ ఎక్కువఉండవనీ నిశ్చయించవచ్చు.

ఇప్పుడు మరోమాట చెప్పి తర్వాత ఆగ్డెన్ దొరగారు తేట ఇంగ్లీషు మాటల్ని ఎలా ఏరాడో చెపుతాను ఇంగ్లీషు భాషలో ఏయే మాటలు ఎంత తరచుగా వాడబడుతున్నాయి అతి తరచుగా వాడుతున్న మాటలు ఎన్ని, అవి ఏవి అని 1921 ఎడ్వర్డు యల్ థార్న్డైక్ అనే అమెరికన్ విద్యావిధానం బోధించే శాస్త్రజ్ఞుడు కృషిచేశాడు ఆయన చిన్నపిల్లల కథలు, బైబిలు వాచకపుస్తకాలు

మొదలైన రకరకాల పుస్తకాల్లో నలభై ఒక్కరకాల పుస్తకాలలో నలభై ఐదులక్షల మాటలని పరిశీలించారు సామాన్యంగా ఒక్కొక్క నవలలో ఎనభై వేల మాటలుంటాయని అంచనావేయవచ్చు అందు చేత ఆయన పరిశీలించిన మాటలన్నీ ఏభై ఆరు నవలలకు సరిపోతా యన్నమాట ఈ పరిశీలనవల్ల ఇంగ్లీషు భాషలో అతి తరచుగా వాడబడే పదివేల మాటల్ని ఆయన ఏరారు తర్వాత మరికొంత కృషిచేసి రెండువందల రకాల రచనలని పరిశీలించి అతి తరచుగా వాడబడే ఇంగ్లీషు మాటల్ని వాటివివాడే తరచుతనాన్నిబట్టి వరుసగా ఇచ్చారు

ఈ వివరాలనిబట్టి సామాన్యంగా పదివేల మాటలకంటె మనం ఎక్కువ వాడటంలేదని తేలింది ఈ మాటల్నికూడా మనం సుమారు ఒకే అర్థం కలవాటినీ కొద్దితేడాలు మాత్రమే కల మాటల్నీ గుంపులు గుంపులుగా చేర్చామంటే ఎనిమిదివందల ఏభై గుంపులు మాత్రమే ఏర్పడ్డాయి అలాంటి గుంపుల్లోంచి అతి తర చుగా వాడబడుతోన్న మాటలని ఏరి ఓక్కవవాటి అర్థాలు వచ్చేలా ఏరిన మాటల్లోంచి పెద్ద చిన్న కొద్ది గొప్ప అనే మాటలనో, గుణాలను సూచించే ఇతర మాటలనో చేర్చి కొత్తమాటల్ని సృష్టిం చుకోవచ్చు అందుచేత ఈలా ఏరిన మాటలవల్ల ఎనిమిదివేల ఐదువందల మాటలవల్లా సాధించగలిగిన ప్రయోజనాలని సాధించ వచ్చు అందుచేత వ్యావహారిక ఇంగ్లీషు పదాలు స్వతహా కొద్ది సంఖ్యవి మాత్రమేఐనా వాటివల్ల కలిగే ప్రయోజనం మనకి చాలుతుంది

ఈ సందర్భంలో వ్యావహారిక ఇంగ్లీషు తయారుయేటందుకు ఇంకా ఎవరెవరి కృషి ఎలా సహాయపడిందో తెలియజేస్తాను వ్యావహారిక ఇంగ్లీషుని తయారుచేసేటందుకు జరిగిన కృషిలో జాన్ బెన్‌థామ్ దొర యొక్క కృషి మొదటిమెట్టు జాన్ బెన్‌థామ్ ఎంఘసేవకుడు "లోకంలో ఉన్నవారిలో ఎక్కువమందికి ఎక్కువ సౌకర్యం ఎలా కలిగించడమన్న విషయాన్నిగురించే అందరమూ ఆలోచించాలి" అని ఆయన మొదట చెప్పాడు తన అభిప్రాయా లను వివరిస్తూ జాన్ బెన్‌థామ్ 1814 లో ఒక పుస్తకం వ్రాశాడు అందులో తనకుతానే ఆయన ఈ ప్రశ్నలను వేసుకొన్నాడు

1 మాటలవల్ల అంటే భాషవల్ల మనకి కలిగే ప్రయోజనం ఏమిటి ?

2 మనసులో కలిగే అభిప్రాయాలను సరిగ్గా అనుసరించి ఉండే భాషయొక్క లక్షణం ఏమిటి ?

3 హక్కు బాధ్యత అనేవాటిని మాటలతో ఎలా పూర్తిగా వివరించడం ?

4 లోకంలో అన్ని దేశాలవారికీ అన్ని జాతులవారికీ పనికివచ్చే భాషను ఎలా దిద్దితీర్చడానికి వీలవుతుంది ?

5 అనుభవించడమువల్ల మాత్రమే తెలిసే "స్వతంత్రము" "బరువు"లాంటి వాటిని పూర్తిగా ఎలా మాటలతో సూచించడానికి వీలవుతుంది ?

6 భాషయొక్క ప్రయోజనాన్ని ఎలా వృద్ధిచెయ్యడం ?

ఈ ప్రశ్నలకు బెన్‌థామ్ దొర ఏమి జవాబు రీయలేదు కాలం మారింతర్వాత ఏ జవాబులు వస్తాయోకూడా ఆయన ఊహించలేదు

తర్వాత 1923 లో కేవలం అమెరికనులు వాడే మాటల యొక్క అర్థాలు వివరిస్తూ ఒక పుస్తకం వ్రాయమని సి కె ఆగ్డెను దొరని ఒక పుస్తకాలయంవారు కోరారు ఇలా ఆయనను కోరింది అన్నిదేశాలకూ చెందిన మానసికశాస్త్రవేత్తల సంఘంవారు ఈ పనిలో ఆయనకు ఐ ఎ రిచర్డ్సు దొర సహాయంచేశాడు ఆగ్డెన్ దొరకు ఈ పని తగిలినరోజు మన చరిత్రలో మంచిరోజు అని అనాలి ఈ దొరలిద్దరూ కలిసి కృషిచేసి "మాటలయొక్క అర్థంలో ఉన్న అర్థం" అనే పుస్తకం వ్రాశారు ఈలా శాస్త్రీయమైన కృషి చేసి కొన్ని మాటల చివరలని తోకలవంటి ప్రత్యయాలు తగిలిం చడంవల్ల ఎన్నో మాటలవల్ల కలిగే ప్రయోజనాన్ని సాధించవచ్చు నని రుజువుచేశారు ఈ కృషివల్లనే 850 మాటలతో అన్ని వ్యవ హారాలనీ సాగించుకోవడానికి పనికివచ్చే ఇంగ్లీషు తయారైంది అదే వ్యావహారిక ఇంగ్లీషు

ఆగ్డెన్ రిచర్డ్సు దొరలిద్దరికి ముందు మూడువేల మాట లకంటె తక్కువ మాటలతో ఇంగ్లీషులో అన్ని వ్యవహారాలూ జరుపుకోవడం సాధ్యంకాదనే అనుకొనేవారు అందుచేత వీరు చేసిన కృషి సామాన్యులకి నిఘంటువులు వ్రాసేవారికీ భాషని బోధించేవారికీ సులభమైన ధోరణిలో వ్రాయాలనుకొనేవారికీ ఎంతో ఉపయోగకరంగా ఉంది

ఇంగ్లీషులో పుస్తకాలు వ్రాసినవారు వాడిన పదాలను గురించీ వ్యావహారిక ఇంగ్లీషుని గురించీ మాత్రమే కొన్ని వివ రాల్ని ఇచ్చి మన తెలుగులో పుస్తకాలు వ్రాసినవారిలో ఎవరెవరు ఎన్ని పదాలను వాడారో చెప్పనందుకు ఈ వ్యాసం చదివేవారు మన్నించాలి తెలుగు రచయితలను గురించి నాకు అలాంటి వివ రాలు తెలియవు నాకేకాదు నేడు మనలో ఎవరికీకూడా తెలియవు మన పండితులుగాని విమర్శకులుగాని ఈ దృష్టితో తెలుగు రచన లని పరిశోధించనేలేదు ఉజ్జాయింపుగా నన్నయ కవిత్వంలో సంస్కృతపు పాలు ఎక్కువా తిక్కన కవిత్వంలో తెలుగుపాలు ఎక్కువాఅని చెప్పడంతో తృప్తిచెందారేకాని "కచ్చితంగా నన్నయ్యా తిక్కన్నా మారింత ఇన్ని సంస్కృతపు పదాలూ ఇన్ని తెలుగు

పదాలూ వాడారు అందువల్ల వీరి వీరి కవిత్వంలో ఈ భాష పాలు ఎక్కువ అని తేలుతోంది" అని తేల్చిన పాపాన ఎవరూ పోలేదు మొదటి తరహాకు చెందిన కవుల సంగతే ఇలాగుంటే తరువాతి కవుల సంగతి మరిచెప్పేదేమిటి? తల్లికి తిండిపెట్టని రకంవాడే మనిషి పినతల్లికి చీరసారె ఇస్తాడా?

సరే ఇతరులు తెలుగు కవులను గురించి ఏదో ఒరగదోయలేదని తప్పుపట్టేబదులు ఆ పని ఏదో మీరే చేయకూడదా? అని ఎవరైనా అనవచ్చు అది ఒక్కరివల్ల అయ్యేపనికాదు నావంటివాని వల్ల అసలేకాదు అది చాలామంది పండితులు పంచుకొని చెయ్యవలసినపని ఎన్ని ఏళ్లు పడుతుంది అలాగ ఎవరో ఒకరి అధ్యక్షతని ముందుముందు మీవంటివారంచరూ మన కవుల రచనలన్నింటినీ దేన్నీ ఎక్కడా వదలకుండా శోధించి ఎవరెవరు ఎన్నిపదాల్ని వాడుక చేశారో ఏయే పదాల్ని ఎవరెవరు ఎన్నిమార్లు వాడారో కూడా తేల్చవలసి ఉంది ఈరకం పరిశోధన ప్రత్తిపనిలాంటిది ఆకర్షణీయంగా ఉండదు కాని చాలా అవసరం ఇలా శ్రమపడి వస్తైతే పదిమందికీ సులభంగా తెలిసే మాటలేవో తెలుగుభాషని ఓడి వడబోసినట్లు చేసి తేల్చవచ్చు అలా తేలిన పదాలే తేటతెలుగు పదాలు అవే మూడుకోట్ల తెలుగువారిలో ఎక్కువమంది నోళ్లల్లో నలుగుతున్నవి అందుచేత మిగిలినవారందరూ కూడా ఎక్కువగా వాడతగినవి తెలుగు తల్లిభాష కానివారుకూడా కొంచెం శ్రమపడి నేర్చుకొంటే తెలుగులో వ్యవహరించడానికి పనికివచ్చేవి మొత్తం మీద తెలుగు తెలిసినవారికీ తెలియనివారికీ కూడా తేటతెలుగు మాటలు అవసరమైనవే

ఎంతో కష్టపడి తేటతెలుగు మాటలని ఏరడం ఎందుకు? ఇది ఎలకని పట్టడానికి కొండను తవ్వినట్లుంటుంది అని మీలో ఎవరైనా అనవచ్చు అలా తప్పుపట్టడం సులభే కాని దానికి జవాబు ఇయ్యవలసిన బాధ్యత నామీద ఉంది విని దాని మంచిచెడ్డలు తేల్చవలసిన బాధ్యత మీమీద ఉంది నా జవాబు సబబుగా కన్పించిందంటే మీరు నావాదాన్ని ఒప్పుకోవాలి

తెలుగులోని రచనలను అన్నింటినీ చివరికి వెయ్యి తేట తెలుగుమాటలని ఏరామనుకోండి వాటితోటే వాటినే కొంచెం భాషాశాస్త్ర నియమాలని ఉపయోగించి తిరగేసి ఒకదానితో మరొకటి చేర్చి కొత్తపదాల్ని మరికొన్నింటిని సృష్టించగలిగామనుకుందాము వీటన్నింటితోటే మనం ఒకరితో ఒకరం ఇష్టాగోష్ఠిగా కబుర్లు చెప్పుకొనేటప్పుడూ, ఇచ్చిపుచ్చుకొనేటప్పుడూ కొనడం అమ్మడం సాగించేటప్పుడూ కాలక్షేపం చెయ్యడం వీలవుతుందని కూడా అనుకుందాము ఇలాగ వెయ్యి మాటలతోటో కాకపోతే మహాఅయితే మరి ఐదు వందలూ కలిపి మొత్తం పదిహేనువందల మాటలతోటో తెలుగులో వ్యవహారాలన్నీ సాగించుకోవడం వీలైతే ఎంత సులభము ఈ 15 వందల మాటల్నీ, వాటిని ఎన్ని విధాల వీలైతే అన్ని విధాల వాడేటందుకు అవసరమైన వ్యాకరణాన్నీ మూడు నెలల్లోనో లేకపోతే నాలుగు నెలల్లోనో ఎవరైనాసరే సులభంగా స్వంతం చేసేసుకోవచ్చు తెలుగుభాషలో ఉన్న తీపిని రుచి చూడవచ్చు దీన్ని నేర్చుకొనేటందుకు కావలసిన కృషి చాలా తక్కువ అవడంవల్ల ఇతర భాషలు తల్లిభాషలైన సోదరులుకూడా తెలుగు నేర్చుకొనేటందుకు ముందుకురావచ్చు తెలుగు తీపి భరతదేశంలో వాళందరికీ అందుబాటు అవడము తెలుగువారందరూ కోరుకోతగిందేకదా? తెలుగుభాష తూర్పుదేశ భాషలన్నింటిలోనూ రుచికరమైందనీ ఇటాలియను భాషతో సరితూగుతుందనీ కదా పేరు పొందింది దాని రుచికీ అందచందాలకీ ఒదుగుకీ లొంగిపోయే కదా అర్థం తెలియకపోయినా పాటలను ముక్కున పెట్టుకొన్నట్లు నేర్చుకొని కొందరు పాటకులు పాటకచ్చేరీలలో కాలక్షేపం చేస్తూ ఉన్నారు ఆ పాటలలో ఉన్న పదాల అర్థం తెలియక తప్పుచోట తప్పు అర్థం వచ్చేలా విరుపులు విరిచి పాడుతూ ఉండడంకూడా మీకు తెలియందికాదు తెలుగుని కనక తేలికగా నేర్చుకొనేటందుకు వీలైతే పాటకులు పాటమీది మోజుచేత దానిని నేర్చుకొనేటందుకూ సరిగా అర్థం తెలిసి పాడి తాము సంతోషించి ఇతరులను సంతోషించేలా చేసేటందుకూ వెనుకతీయరని నా నమ్మకము తెలుగు భాషని వ్రాయడం చదవడం మాట్లాడడం వచ్చినవారందరూ తెలుగువారే అవుతారుకదా? "ఎవ్వరెవ్వారికైతె కలసిన తెనుగు పలుకులతేనె యూరెడు తెనుగు పలుకుల తేటకౌలికెరు వారివారి నివాసభూముల కేకనామమునిడతగున్ ఆంధ్రరాష్ట్రంబనదగున్" అనికదా కవికొండల కవి అన్నారు తెలుగు భాష వ్యాపించడంతోటే తెలుగు దేశంయొక్క సాంస్కృతికపు ఎల్లలు వ్యాపిస్తాయనడంలో సందేహం ఏమీ ఉండదుకదా?

దేశం అంతటా తెలుగు మీరిపోతుందని అనగానే మిగిలిన భాషలన్నీ అడుగంటిపోతాయనిగాని అలాగు అవాలనిగాని నా ఉద్దేశం ఎంతమాత్రమూ కాదు మన తల్లిమాట మాట్లాడేవారు ఎక్కువవుతారంటే పిన్నతల్లి మాటలు వినేవారుండరనిగాని మనం పిన తల్లి మాటలు వినం అనిగాని అనలేముకదా? మనదేశంలో ఉన్న భాషలన్నింటినీ కనీసం వాటన్నింటిలోనూ ముఖ్యమైన హిందీ, తెలుగూ అరవం బెంగాలీ కన్నడం మలయాళం మొదలైన వాటినైనా చిలికి వెన్నలాంటి రుచికరమైన తేటభాషలను రూపులు దిద్ది తీర్చాలి అప్పుడే మన దేశభాషలన్నింటిలో ఎవరైనా ఏదైనా భాషను నేర్చుకోవాలంటే ఆభాషని కొద్ది శ్రమతో నేర్చుకోవడం వీలవుతుంది ఉత్తరాదికి వెళ్లేవారు హిందీని దక్షిణాదికి వచ్చేవారు తెలుగు అరవాల్నీ నేర్చుకొనేటందుకు వెనుతీయరు తేటతెలుగుని ఇతర తేటభాషల్నీ ఎవరుపడితేవారు స్వయంగా నేర్చుకొనేలాగ

బొమ్మల పుస్తకాలవల్ల అవకాశం కలిగించవచ్చు ఇలాంటి అవకాశాలను కల్పిస్తే తీరిక ఉన్నప్పుడు కృషిచేస్తూ ప్రతివారూ ఏదో మరొక భాషనైనా నేర్చుకుంటారు అలాంటి కృషి దేశం అంతా ఒకటే దేశంలో అందరూ ఒకటే అనే అభిప్రాయం వ్యాపించేందుకు దారి తీస్తుంది

మీరు చెప్పిందంతా పైకి బాగానే కనుపిస్తోందయ్యా కాని, ఆ తేట తెలుగుభాషయొక్క ఉపయోగాన్ని గురించి ఒక సందేహం కలుగుతోంది ఎంతో శ్రమపడి సాధించిన తేటతెలుగు ఎందుకూ అందకుండా ఉంటుందేమోనని అనిపిస్తోంది ఏదో లేకపోతే మన్య అనే 15 వందలో తేటతెలుగు మాటల్ని వాటితో కుస్తీపట్టో ఎలాగో ఒకలాగు స్వంతంచేసుకొన్న అరవసోదరుడు ఒకరు ఉన్నాడనుకుందాము అతనూ తెలుగు ధారాళంగా మాట్లాడే ఒక తెలుగు ఆసామీ కలిశారనుకుందాము అలాంటిసమయంలో తేట తెలుగుమాత్రమే తెలిసిన అరవసోదరుడికి తేటతెలుగు మాత్రమే మాట్లాడాలనే నియమంలేకుండా మాట్లాడే తెలుగుసోదరుడి మాటలు పూర్తిగా అర్థంకాకపోవచ్చు కదా అందుచేత శ్రమపడి నేర్చుకొన్న తేటతెలుగు అరవసోదరుడికి అవసరంవచ్చినప్పుడు ఆపదకి అడ్డుపడనటువంటి కర్ణుని విద్యలాంటిది అవడంలేదా? అందుచేత ఎందుకయ్యా తేటతెలుగు నేర్చుకోండి తేటఅరవం నేర్చుకోండి తేటకన్నడం మొదలైన భాషల్ని నేర్చుకోండి అని ప్రచారం చెయ్యడం అవి అన్నీ అర్ధకుసి భాషలే కాదుటయ్యా! పూర్తిగా పనిజరగని అర్థకుసి భాషల్ని నేర్చుకొనేటందుకు ఎవరికి సరదా ఉంటుందయ్యా మీ వెర్రిగాని ఎవరికైనా సాగితే సరదాఉంటే కుత్రంగా ఏ భాషనైనా గట్టిగా నేర్చుకోవడం లేకపోతే దానిజోలి నాకు వద్దని ఒక్క నమస్కారంచేసి ఊరుకోవడం మంచిది అంతేకాని సగం సగం పాతిక పరకా భాషల్ని నేర్చుకొని ఆ భాషలు వచ్చాయనుకోవడం తీరా మోసి వాటి అవసరం కలిగేటప్పటికి మిణుకడం ఎవరికీ మంచిదికాదు" అని మీలో ఎవరైనా వాదించవచ్చు

ఈ ఎదురుపోటీ వాదానికి అవకాశం లేకపోలేదు కాని ఆ వాదం కొంచెం "ఉఫ్" అని ఊదితే ఎగిరిపోతుందనే అనాలి ఒక సంగతి చెప్పితే మీరే ఈ వాదం నిలబడదని ఒప్పుకొంటారు తేటతెలుగువల్ల "పూర్తిగా" కావలసినంత పని జరగదనికదా మీ సందేహము అందుచేత దీనివల్ల కొంతవరకూ పని జరుగుతుందని మీరేమీ సందేహించకుండా ఒప్పుకొంటున్నారు కదా! అదే పదివేలు అసలు భాష లేనిదానికంటె గుడ్డిదైనా ఉండటం మేలు అనికదా తెలుగువారంటారు అందుచేత తెలుగు అసలు తెలియనివారికంటె తెలుగు కొంచెమైనా తెలిసినవారు తెలుగు గోష్ఠుల్లో పాల్గొనడానికి వీలవుతుందికదా! ఇలాగ అనగానే ఏమిటయ్యా, సామెతలవల్ల వాదం నిలబెట్టుకోచూస్తున్నావు అని మీలో ఎవరైనా మదలకించవచ్చు కేవలం సామెతలవల్ల ఈ వాదం నిలబెట్టడం నా ఉద్దేశం ఎంతమాత్రమూకాదు ఆ సామెతని కేవలం మాటవరసకిమాత్రమే చెప్పాను సామెతలవల్ల విషయం వెంటనే మనసుకి నచ్చుతుంది అందుచేత హృదయానికి బాగా హత్తుకొనేటందుకు అవకాశం ఎక్కువ నిజంగా వాదం వచ్చి మన రక్తంలోకి పట్టాలంటే వాదబలం తప్పకుండా అవసరం అందుచేత ఈ సందర్భంలో ఒక విషయాన్ని తెలియజేస్తున్నాను వేరు తెలుగుదేశంలో ఉన్న బడులలో పిల్లలు చదువుకొంటున్న పుస్తకాలు తేటతెలుగులో వ్రాయబడిఉన్నాయని మీరెవరూ అనరు, అనలేరుకదా! మన విద్యాధికారులు తేటతెలుగు నేర్పాలనే నియమం చేశారనికూడా ఎవ్వరమూ అనముకదా! మన విద్యాధికారులు బడులలో వాడతగిన వాచకపుస్తకాలు ఎలాఉండాలని అన్నారో ఒక సారి పరిశీలించండి చిన్నపిల్లల బడులలో నాలుగు వాచకపుస్తకాలలోనూ మొత్తం రెండువేల మాటలు బోధించాలనీ మూడు ఫారమ్‌లలోనూ కలిపి మొత్తం మరి రెండువేల మాటల్ని బోధించాలనీ వారు నియమం చేశారు ఈ మాటలసంఖ్యల్ని తేటతెలుగు మాటల సంఖ్యతో పోల్చిచూడండి మనదేశంలో ఐదవక్లాసు మాత్రమే చదువుతూ రెండువేల మాటలలోపు మాత్రమే తెలిసిన పసిపిల్లలు తమకంటె ఎక్కువ చదివిన ఎక్కువ మాటలు తెలిసిన తల్లిదండ్రులతో అక్కాఅన్నలతో మాటాడుతూ ఆడేటందుకు వెనుకతీయరుకదా! అలాంటప్పుడు వీరి మాటలు వారికీ, వారి మాటలు వీరికి తెలియక బాధపడుతారన్నది ఎవరమూ కన్నదీ విన్నదీ కాదుకదా! అందుచేత తేటతెలుగు మాత్రమే తెలిసినవారు రూపాయలో పదహారు అణాల తెలుగువారితో మాట్లాడేటప్పుడు మిణుకుమనిపిస్తుందేమోనని భయపడుట అనవసరం వారికి అక్కడక్కడ కొన్ని మాటలు తెలియకపోవచ్చునని వారు విన్న ప్రతి మాటకీ అర్థంచెప్పలేకపోతారని ఒప్పుకొంటాను కాని వారికి అసలు తెలుగువారు మాట్లాడినప్పుడు విషయం బోధపడదంటేమా అదివి మా లోకంలాగుంటుందంటేమా నేను ఒప్పుకోను మరొక్క సంగతి తేటతెలుగు మాత్రమే వచ్చినవారు కొంచెం యాసగా పట్టిపట్టి మాట్లాడినట్లు అనిపిస్తుంది అది వ్యవహారానికి ఏమాత్రమూ అడ్డురాదు బాగా రాపిడిచేస్తే గరుకుగాఉన్న వస్తువులు నునుపు దేరినట్లు కొత్తభాషని పట్టిపట్టి మాట్లాడే అలవాటూ యాసాకూడా కొద్దిరోజుల్లోనే మాయమైపోతాయి

మన దేశభాషలన్నింటిలోనూ ముఖ్యంగా హిందీ తెలుగు, అరవం భాషల్లో తేటభాషలు తయారయాయనుకుందాము మొత్తం ఆరునెలలు కృషిచేసి తెలుగువారు హిందీ అరవాల్నీ అరవవారు హిందీ తెలుగుల్నీ ఉత్తరాదివారు తెలుగు అరవాల్నీ విరివిగా నేర్చుకొన్నారనికూడా అనుకుందాము ఇక మలయాళీ, కన్నడులూ

హిందీనో తెలుగునో అరవాన్నో నేర్చుకున్నారనికూడా అను కుందాము అప్పుడు చప్పన్న దేశాలూ భాషలూ గల భరత ఖండంలో ఏ ఇద్దరు కలిసినా హిందీలోనో తెలుగు అరవముల లోనో మాట్లాడుకోగలుగుతారు వారిలో ఆప్యాయత ఎక్కువవు తుంది అప్పుడు

"ఎల్లరాష్ట్రీయు లొక్కటి ఇల్లై
భాషభేదము లెల్ల కల్లై
ఎల్లరెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియు"

అన్నట్లవుతుంది గురజాడ కవి కన్న కలలు కొంతవరకు నిజ మవుతాయి ఆదేకదా భారతదేశంలో అంతా కోరుకొనేది

సరే ఒప్పుకున్నామయ్యా నువ్వు చెప్పిన వాదం సరిగానే ఉంది మేం ఒప్పుకొన్నందువల్ల ఒలికించేదేముంది తెలుగుభాషని చిలికి తేటతెలుగు వెన్నని తీయడం ఎవరితరం? "తెలుగుపుస్తకా లన్నింటిలోనూ ఉన్న పదాల జనాభా లెక్కలు తయారుచెయ్యాలి ఏ పదానికి ఎన్నిఎన్ని వోట్లుపచ్చాయో చూడాలి ఏ పదాన్ని ఎన్ని అర్థాల్లో వాడవచ్చునో చూసుకోవాలి" అని నీవేకదా సూచించావు ఆతర్వాత నేకదా మనకి మామూలుగా కలిగే అభిప్రాయాలన్నింటినీ ఇతరులకు తెలియజేసేటందుకు కనీసం ఎన్ని మాటలు కావాలో లెక్కతేల్చడం దీనికోసం ఎందరు పండితులు ఎన్ని ఏళ్లు శ్రమ పడాలి మహారాజులూ మహారాజుల ఆదరణా వెనకపట్టిన ఈ కాలంలో వాళ్లందరినీ ఎవరు పోషిస్తారు దేశాన్ని పాలించేవారు పోషిస్తే ఏండ్ల పాటు ఏళ్ళపాటు వేలాది పండితులు చేస్తేనేకాని తేలనిపని నువ్వూ నేనూ ఎంత దొర్లినా పూర్తి అవుతుందటయ్యా మాటలు కోటలు దాటేలా ఉన్నాయికాని కాళ్లుమాత్రం గడపలు దాటే దారి కన్పించడంలేదు అన్నట్లుంది ఈ తేటతెలుగుని సాధిం చడం సంగతి రైతుబిడ్డ తాను కలలో చూసిన పిల్లని పెళ్లిచేసు కొనేటందుకు తయారయాడు కాని పెళ్లికూతురు రాజుగారి కూతు రవడంచేత కోటగొమ్మున దాచ్చుంది అందరాని అందాలబరిణి అయింది తేటభాషల సంగతికూడా అలా కావడంలేదా? లేక వాటిని సాధించేటందుకు వేరే అడ్డదారి ఏదైనా ఉందా?" అని అంటే ఒక దారి ఉందనే అనాలి దానిలోఉన్న సుళువుబరువులూ దానివల్ల పనిజరిగేదీ జరగందీ మీరు నిశ్చయించాలి ఆ దారి ఏదో ఇక వివరించబోతున్నాను

ఈ భాషా ఆ భాషా అనే తేడాలేకుండా ఏ భాషలోఐనాసరే ఒక్కొక్కపదం మన మనసులో కలిగే అభిప్రాయాన్ని సూచించే సాధనం మాత్రమే అని అనుకోవచ్చు ఈలా అనుకోగానే మనం వ్యవహారానికి ఎరిపోయే ఇం షుభాషతో మొదలుపెట్టి తేటతెలుగునీ మిగిలిన దేశభాషల్లో తేటభాషలనీ తయారుచేసుకోవచ్చు మనం సుమారు 850 మాటలతో అంటే 850 అభిప్రాయాలతో మన వ్యవహారాలన్నింటినీ సాగించుకోవచ్చునని ఇంగ్లీషు భాషావేత్తం కృషివల్ల తేలింది ఆ అభిప్రాయాల్ని సూచించే ఇంగ్లీషు మాటలు కూడా మనకి అందుబాటులో ఉన్నాయి అందుచేత మనం ఆ ఇగ్లీంషు మాటల్ని తీసుకొని వాటికి సరియైన తెలుగుమాటల్ని వ్యవహారాలకి వాడుకొంటే సరిపోతుంది ఈ వి ంలో లోపంలేక పో లేదు వ్యావహారిక ఇంగ్లీషుమాటల్లో కొన్నింటికి రెండు మూడు అర్థాలుండవచ్చు వాటికి సరియైన తెలుగుమాటల్లో ఆ అర్థాలన్నీ రాకపోవచ్చు మరొకటికూడా సంభవించవచ్చు ఒకే ఒక అర్థంలో వాడబడుతున్న ఇంగ్లీషుపదానికి రెండు మూడు అర్థాలున్న తెలుగు మాట లభించవచ్చు ఇలా కలిగే అవకాశాలన్నింటినీ కలబోసి చర్చించినట్లైతే 850 ఇంగ్లీషుపదాలవల్ల వ్యక్తంచెయ్యగలిగిన అభి ప్రాయాలన్నింటినీ వెయ్యో మహాఐతే పదిహేనువందలో తేట తెలుగు మాటలతో వ్యక్తంచెయ్యవచ్చు ఇలాగే వ్యావహారిక ఇంగ్లీ షుని ప్రాతిపదికగా తీసుకొని హిందీ అరవం కన్నడం మల యాళం మొదలైన భాషలలోకూడా తేటభాషల్ని తయారుచెయ్య వచ్చును ఇలాంటివిధానాన్ని అనుసరించి ఐ ఎ రిచర్డ్సు దొరగారూ వారి స్నేహితులు కృషిచేసి ఫ్రెంచి ఇటాలియను స్పానిష్ భాషల్ని ఎవరంతట వారు సులభంగా నేర్చుకొనేటందుకు వీలు కలిగించారు ఇతర భాషాసంప్రదాయములను అనుసరించి వాటిని ప్రాతిపదికగా తీసుకొని ఏ ఒకరో ఇద్దరో కృషిచేసి తయారుచేసిన తేటభాషల్లో లోపాలుండవనిగాని సవరణలకు అవకాశం ఉండదని గాని అనలేము ఎటువంటివారెంత గొప్పపేరు పొందినవారైనా లోకంలో అన్నీ తెలిసినవారు అనిగాని ఏ భాషనైనా మొదటినుంచి చివరవరకూ యావత్తూ స్పృశించేసినారనిగాని అనలేముకదా! ఐనా ఇలాంటి కృషి వారు చేస్తారని మీరూ మీరు చెయ్యాలని వారూ ఊరుకొంటే మర్యాదలకోసం మైసూరు మీరు ముందు ఎక్కండి అంటే అహా మీరు ముందెక్కండి అంటూ రైలు దాటబెట్టిన పల్లె టూరిపెద్దల సంగతిలాగ అవుతుంది అంతేకాకుండా పెద్దపెద్ద పండి తుల్ని ఈ పని చెయ్యండి అని కోరుదామంటే ఇది వారి కంటికి పేలాలపిండిలాగుంటుంది లోకవ్యవహారంలో ఉన్న సులభమైన మాటలు వారి పాండిత్యంవెనక దాగుకొని మాటుపడిపోయేటందుకు అవకాశం ఎక్కువ ఈ అభిప్రాయాలవల్ల నేనే వ్యవహారపు ఇంగ్లీషుపదాలకు సరియైన తేటతెలుగు పదాలని ఏరేటందుకు సాహ సించాను ఈ కృషిమాని ఎదిరిబలం తనబలం బేరీజువేసుకొని ఆలోచించి మరీ మీరుడు ముందడుగువేస్తారు కాని మొండివారు ఇవేమీ ఆలోచించకుండానే తెగించి ముందుకు దూకుతారు అని మీలో ఎవరైనా వేళాకోళం చెయ్యవచ్చు అలాంటివారికి ఒక్క మనవి లోకవ్యవహారంలో ఉన్న తెలుగు నాకే తెలుసునవే

గర్వంతో నే నీ పనికి ఒడిగట్టలేదు. కేవలం "తల్లిపూజ కివిగో పూలు నే తెచ్చినవి" అని అందామనే అభిప్రాయంతో మొదలు పెట్టాను. నేను సూచించిన మాటలకంటె ఎక్కువ వాడుకలో ఉన్నవీ, ఎక్కువ ప్రయోజనకరములైనవీ, వీటికంటె ఎక్కువ సులభమైనవీ ఎవరైనా సూచిస్తే వాటిని కళ్లకు అద్దుకొని తలమీద ఉంచుకొంటాను. నేను ఇప్పుడు చేసినకృషి తేటతెలుగుని సాధించడంలో మొదటిమెట్టు అనే అనుకొంటున్నాను. ఈ సందర్భంలో చదువరులకు ఒక సంగతి చెప్పాలిసిఉంది. వ్యావహారిక ఇంగ్లీషు మాటల్ని ఆగ్డెన్‌దొర రూపుతీర్చి దిద్దేటందుకుముందు ఆక్స్‌ఫర్డ్ కళాపరిషత్‌వారు సులభంగా ఇంగ్లీషుని నేర్చుకొనేటందుకు రెండు వేల మాటల్ని సూచించారు. దానివల్ల ఇంగ్లీషుభాషని బోధించడం నేర్చుకొనడం చాలామట్టుకి తేలికైంది. అది మొదటిమెట్టు. తరువాత ఆగ్డెన్‌దొర ఏరిన 850 మాటలూ, అవి సాధించిన ప్రయోజనమూ రెండవమెట్టు. అందుచేత మరి ఆట్టే కాలయాపనకాకుండా తేటతెలుగుని రూపుదిద్ది తీర్చడంలో పండిత పామరులందరినీ ఆసరా ఇవ్వండని కోరుతున్నాను.

కేవలం పదాలవల్ల తేటతెలుగు విజ్ఞానం లోకంలో వ్యాపించదు. ఏ భాషఐనాకూడా కేవలం కొన్నిపదల్ని నేర్చుకొనడంవల్ల మాత్రమే ఎవరికీ స్వంతం అయిపోదుకదా! వీటితో వ్యాకరణాన్ని ఉపయోగించి వాక్యాల్ని తయారుచేయాలి. అప్పుడే అవి అర్థపు కలపై పూర్తిగా ప్రయోజనకారులవుతాయి. అందుచేత తేటతెలుగు మాటల్ని ప్రయోగించేటందుకు వ్యాకరణం కావాలి. ఎలకలు గోచీని కొరికివేయకుండా కాపాడుకొనేటందుకు కామాటం పెంచుకొన్న సన్యాసిలాగుంది తేటతెలుగు పని. అసలు భాషని తీర్చి తేటతెలుగుని తయారుచేసినట్లే అసలు వ్యాకరణాన్నికూడా ఓడి వడపోసి చాలాకొద్దీ కసీసం వ్యాకరణాన్ని చిట్టాలరూపంలో ఇయ్యాలి. ఈ రెండింటికీ సాయం తేటతెలుగుని ఎవరునడితేవారు తమంతటతామే నేర్చుకొనేటందుకు వీలుగా బొమ్మల వాచకపుస్తకాలు కావాలి. ఆ బొమ్మలవాచకం పూర్తిగా చదువుకొని ఆగిపోయినట్లైతే కొత్త వారికి కొత్తగావచ్చిన భాష ఆట్టేకాలం నిలవదు. అది ఎంత త్వరగా వస్తుందో అంత త్వరగా వెంటనే జారిపోతుంది. అది మనసుకి పట్టాలంటే బాగా సాధనచేయాలి. అందుకోసం పుస్తకాలు కావాలి. పాడిందే పాటరా పాచిపళ్ల దాసరీ అన్నట్లు చదివిన వాచకాన్నే తిరిగి తిరిగి చదివేటందుకు ఎవరికీ ఉత్సాహంఉండదు. అందుచేత వాచకపుస్తకం చదివివేయగానే చదువుకొనేటందుకు ఎన్నో తేటతెలుగు పుస్తకాలుండాలి. ఎవరైనా ఏదైనా పుస్తకం చదవాలంటే ముందు వారికి అందులో విషయం రుచించాలికదా! అందుచేత తేటతెలుగులో ఏవో పదిపుస్తకాలుంటే అవి అందరికీ నచ్చకపోవచ్చు. అలాకాకుండా చాలా పుస్తకాలుంటే అందులో కొన్నిఐనా ఎవరుపడితే వారికి నచ్చేవి ఉండేటందుకు అవకాశం ఎక్కువ. అలా ఒక ఏడాదిపాటు చదువుకొనేటందుకు తగినన్ని తేటతెలుగు పుస్తకాలుంటే తేటతెలుగుని నేర్చుకొన్నవారు వాటిని చదువుకొని ఇక ఎప్పటికీ తెలుగు మరచిపోకుండా ఉంటారు. అంతేకాకుండా వారి తెలుగువిజ్ఞానం ఆనాటికంటె ఆరోజు క్రమంగా అభివృద్ధిచెందుతుంది. ఈ సందర్భంలో వ్యావహారిక ఇంగ్లీషులో ఏయిచేశారో చెప్పదలచుకొన్నాను. అందులో కథలూ, నాటకాలూ బైబిలూ వాంటివి మొత్తం సంభైనాలుగు పుస్తకాలు తయారై ఉన్నాయి. ఒక్కొక్కపుస్తకంలో ఇరవైఐదువేల మాటలు ఉంటాయని అంచనావేద్దాము. అప్పుడు సంభై పుస్తకాలలో మొత్తం పదిలక్షల మాటలు దాటాయి. అన్నీ వేరువేరు మాటలు కావు. 850 మాటలే తిరిగి తిరిగి వాడబడ్డాయి. అందుచేత వ్యావహారిక ఇంగ్లీషులో సంభైపుస్తకాలు చదివేటప్పటికి ఒక్కొక్క వ్యావహారిక ఇంగ్లీషుమాటని 1,000,000 అంటే 1170 సార్లు సగటున చదువుతాము. అందుచేత అది మన మనసుకి బాగా హత్తుకుపోయి మరి వదలదు.

తెలుగుభాష వ్యాపించాలంటే తెలుగుతీయని ఇతరులు తెలిసికొనే అవకాశం కల్పించాలంటే తేటతెలుగు పదాలు, తేటతెలుగు వ్యాకరణము, తేటతెలుగు వాచకము, తేటతెలుగులో పుస్తకాలూ సృష్టించాలి. ఇది నేటి తెలుగుభాషయొక్క అవసరాల్లో ముఖ్యమైంది.

తెలుగువారు కానివారికి తెలుగు నేర్చుకొనే అవకాశం కలిగించడం ముఖ్యమైన అవసరమే. కాని అంతకంటె తెలుగు వ్రాయడం చదవడం ఏమీరాని తెలుగువారు ఎందరో ఉన్నారే. అలాంటి వారికి చదువు సులభంగా వచ్చే అవకాశాలు కల్పించడం తేటతెలుగు సృష్టికోసమూ, వ్యాప్తికోసమూ చేయవలసిన కృషికంటె ముందు చెయ్యాలి అని మీలో ఎవరేనా అనవచ్చు. అది నేను కాదనను. ఆకృషికి కూడా తేటతెలుగు పుస్తకాలు సహాయపడతాయి. అదెలాగో చెప్పేముందు వ్రాతకోతలు నేర్చుకోకుండానే పెరిగి పెద్దలైనవారిని విద్యావంతుల్ని చేయడానికి పూర్వం జరిగిన, నేడు జరుగుతున్న ప్రయత్నాలను గురించి తెలియజేస్తాను. ఆతర్వాత తేటతెలుగు వయసు మీరినవారిలో విద్యావ్యాప్తికి ఎలా సాయపడుతుందో వివరిస్తాను.

లోకంలో ఏదో ఒక భాషైనా చదవడం వ్రాయడం రాని వారు చాలామంది ఉన్నారు. అలాంటివారు మన దేశంలో నూటికి 13 5 మంది అనీ, మనరాష్ట్రంలో 16 మంది అనీ లెక్కతేలింది. ఈసంగతి చాలా విచారకరమైందనీ, దాన్ని తొలగించాలని అంతా ఒప్పుకొంటారు. ఫ్రాంక్ సి లాబాక్ దొరగారు లోకంలో ఎక్కడా ఏదో ఒక భాషైనా చదవడం వ్రాయడం రానివారు ఉండ

కూడదనే పట్టుదలతో కృషి చేస్తున్నారు ఆయన భూమి అంతటినీ చుట్టి అన్ని దేశాలవారికి ఆయా దేశభాషల్ని సులభంగా అతి తక్కువ కాలంలో బోధించేవిధానాలను గురించి సలహాలు ఇచ్చేరు ఒక్క అక్షరమైనా తెలియని ఆరవవారికి అరవభాషని ఆరు వారాలలో బోధించవచ్చునని ఆయన సూచించారు ఆయన సూచించిన విధానాన్ని అనుసరించి చెంగం అనేచోట 1938 లో టి జి ఆర్ గోపాల్, ఎ జి విల్వరాయి అనేవారు ఎంతోమంది చదువనూ వ్రాయనూ తెలియని అరవవారిని విద్యావంతులుగా చేశారు

ఇక తెలుగుదేశంలో తెలుగువారు మాటికి నూరుమందీ విద్యావంతులు కావాలనీ కమ్మరీ కుమ్మరీ మంగలీ మాదిగా అనే తేడాలేకుండా అందరికీ కనీసం చదువనూ వ్రాయనూ రావాలనీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు పట్టుదలతో పని చేస్తున్నారు అప్పుడే తెలుగుదేశం బాగుపడుతుందనీ తెలుగువారు తెలివితేటలు కలవారై సుఖంగా జీవించకలుగుతారనీ సందేహం ఏమీలేకుండా నమ్మవచ్చు ఈస్థితి కలిగేటందుకు హరిసర్వోత్తమ రావుగారు ముప్ఫయి ఏళ్లుగా ఊరూరా పుస్తకాలయాలు ఏర్పాటు చేస్తున్నారు చదువురానివారికి సులభంగా చదువు చెప్పేటందుకు ఒక విధానాన్ని తీర్చి దిద్ది వయసుమీరినవారికి చదువుచెప్పే బోధకుల కెందరకో తయారీ ఇస్తున్నారు

మొత్తంమీద వ్రాయడం చదువడం రాని తెలుగువారికి 50 రోజులలో తెలుగుని బోధించేటందుకు ఏర్పడింది ఆ బోధనా విధానాన్ని గురించి చదువురాని వయసుమీరినవారి మనసు ఏయే పరిస్థితుల్లో ఎలా ఉంటుందో అది కనిపెట్టి ఎవాలయిలుగా సమయానికి తగిన టంకంపొడి వేసి ఎలా చదువు చెప్పాలో హరిసర్వోత్తమ రావుగారు వివరించారు ఈ విషయాలను గురించి ఆయన పుస్తకాలు వ్రాశారు ఈ విషయాలు కొంచెం విషయాంతరంగా కప్పించినా టూకీగా చెప్పదలచుకొన్నాను, అవి తెలుగువారూ తెలుగు భాష వ్యాపించేటందుకు కృషి చేస్తున్నవారూ అందరూ కూడా తప్పకుండా తెలుసుకోవలసిందే

చదువుకొనేవయసు దాటినవారికి చదువుకోవాలనే ఉబలాటం ఎంత ఎక్కువగా ఉన్నా వారివి మనసు ముందుకీ సిగ్గు వెనక్కీ లాగుతుంటాయి అందుచేత సామాన్యంగా వారి కోరిక అలా వారి మనసుల్లోనే అణగారిపోతుంది ఈ సిగ్గుకి సాయం వారు ఎవరైనా తాము చిన్నపిల్లలమాదిరిగా "అ ఆ" అని చదువుకోడం చూస్తారేమో నని మరింత వెనకాడుతారు అందుచేతనే వారు "కాకి గుడిస్తే కి" అని గుణింతము చెప్పుకొనడానికీ ఎల్లెపేయడానికీ ఇష్టపడరు అందుచేత వారికి విజంగా అక్షరాలు వచ్చేలా చేయాలంటే పిల్లలకు చెప్పినట్లు కాకుండా మరో కొత్తదారిపట్టి బోధించవలసి ఉంటుంది వారికి అక్షరాలను గుర్తించుకొండని చెప్పితేచాలు వనపిట్టలాగున వర్ణక్రమం వల్లించేలా చెయ్యనక్కరలేదు అంతేకాకుండా వయసుమీరినవారు కాలం కర్మం కుదిరి చదువుకోవడం మొదలు పెట్టగానే ఎంతతొందరగా మాటలూ వాక్యాలూ చదవగల శక్తి గలిగితే అంత వడివడిగా చదువుతుంటారు ఈ ప్రయోజనాన్ని సాధించేటందుకు హరిసర్వోత్తమ రావుగారూ లాబాక్ దొరగారూ కూడా మన దేశభాషల్ని బోధించేటప్పుడు ముందు హల్లుల్ని వాటి గుణింతాలతో క్రమంగా నేర్పి తర్వాత కొంచెం నెమ్మదిగా అచ్చులు చెప్పితే మంచిదని నిర్ణయించారు ఈవిధానం ప్రకారము తెలుగులో ముందుగా "ర" అనే అక్షరాన్నీ దాని గుణింతాన్నీ నేర్పుతున్నారు ఆగుణింతం నేర్పడం మొదలుపెట్టారో లేదో వెంటనే నేర్చుకొనే వారికి "రా! రారా!" అనే మాటలుకూడా చదవడమూ వ్రాయడమూ వస్తాయి తర్వాత "మ" అనే అక్షరాన్నీ దాని గుణింతాన్నీ నేర్చుకోగానే "రాము మాము మర రామా మామా రామి" అనే తెలిసిన మాటలూ, 'రారా మామా, రారా రామా మా రామి, మా మామ రారా మారామా మారామిమామ,' మొదలైన చిన్న వాక్యపు ముక్కలూ చదవడమూ వ్రాయడమూ తెలుస్తుంది దీంతో ఎంత అక్షరాలు రానివాడికైనా "రెండక్షరాలొచ్చాయి, ఇంకలన్నలెన్నో వస్తాయ్" అనే ధైర్యం కలిగి ఉత్సాహంతో పట్టుపట్టి మిగిలిన అక్షరాలన్నీ నేర్చుకోవాలనిపిస్తుంది చదువుకు వెళ్లిన కొద్దీ అతని ఉత్సాహం హెచ్చుతుందేగాని తగ్గదు క్రమంగా మాటలూ పాటలూ, పదాలూ ఇవి అవీ అనే తేడాలేకుండా అన్నింటినీ అతను చదువగలుగుతాడు అక్షరజ్ఞానంలేని వయసుమీరిన వారిలో ఎక్కడో లోపల దాగిఉన్నటువంటి చదువుకోవాలనే రెచ్చగొట్టి వారిశక్తి వారికి తెలిసేలా చేస్తే వారు సాధించలేనిది ఏమీ ఉండదుకదా! ఆంజనేయులవారుకూడా తనశక్తి తనకు తెలియక ఇతర కోతిమూకలాగే తానుకూడా సముద్రం దాటలేనని వెనుకాడ డనీ బూడిదలో మునిగిఉన్న నిప్పులాంటి అతని శక్తిని జాంబవంతుడు అతనికి తెలిసేలాగ మాటలతో ఊది రెచ్చగొట్టాడనీ కదా పురాణ కథ కార్యసాధనకి మనోధైర్యమే ముఖ్యావసరమని శాస్త్రవేత్తలు అందరుకూడా ఒప్పుకొన్నదేకదా!

వయసుమీరినవారికి చదువనూ వ్రాయనూ నేర్పించేటందుకు ఏర్పాటుచేసిన విధానంలో ఈ విషయాలన్నింటినీ గమనించారు తెలుగు అక్షరమాలను 60 రోజులలో నేర్పేటందుకు వీలైన పట్టికనీ, రెండు వాచకాల్నీ వాటిని బోధించే పంతుళ్లకు సూచనలనూ కూడా హరిసర్వోత్తమరావుగారు పుస్తకరూపంలో ప్రకటించారు వారూ వారి స్నేహితులూ, శిష్యులూ ఈ సందర్భంలో చేసిన కృషి ఎంతో మెచ్చుకోతగింది వారి కృషివల్లనే తెలుగు దేశంలో చదువురానివారికి సులభంగా చదువునేర్పాలనే ఉద్యమం నశించిపోకుండా నిలబడి ఉంది

శ్రీ స్నేహ

50 రోజులలో తెలుగు భాష చదవడమూ వ్రాయడమూ నేర్చుకోవడం సాధ్యమైనా ఇంకా తెలుగువారిలో అక్షరాలు రాని వారు ఇంత ఎక్కువగా ఉన్నారేమి? దానికి కారణం ఏమిటి? చదువనూ వ్రాయనూ నేర్చుకోడానికి కావలసిన ఉత్సాహం తెలుగు వారిలో తక్కువ ఉందా? లేకపోతే హరిసర్వోత్తమ రావుగారి విధానం సరియైందికాదా? అక్షరాలు రాని తెలుగువారికి తెలుగు భాషను బోధిద్దామనే ఉత్సాహం విద్యావంతులైన తెలుగువారిలో తగినంత మాత్రం కల్పించటం లేదా? లేకపోతే మరోకారణమేమైనా ఉందా? గదిలో దీపం వెలిగించి ఉంచినా కళ్లు మూసుకొని ఉండి కావలసిన వస్తువుల కోసం తడుముకొంటున్నట్లున్నదే తెలుగువారి స్థితి అక్షరాలురాని తెలుగువారికి చదువుకొనేటందుకు కావలసిన ఉత్సాహానికి కొరతలేదు వారి విషయంలో ఇతరులకు ఏమాత్రం తీసికట్టుకారు ఒక పసరు మించుతారేమోననే అనిపిస్తుంది హరిసర్వోత్తమరావుగారి విధానంలోకూడా ఏమీ లోపాలు లేవు మనదేశంలో పటమట ఉదయగిరి అనేచోట్లా ఇంకా ఎన్నో మరికొన్నిచోట్లా ఆవిధానం ప్రకారం చదువు చెప్పిచూశారు అప్పుడు అది చాలా తృప్తికరమైందనే తేలింది ఇక కాగా పోగా మిగిలింది అక్షరాలురాని తెలుగువారికి తెలుగు బోధించేటందుకు విద్యావంతులైన తెలుగువారిలో ఉండవలసిన ఉత్సాహం 'కొంత వరకు ఇది తక్కువగా ఉండటమే ఈస్థితికి కారణమని నా నమ్మకము దీనికి కారణం వారిలో సేవాసక్తి లోపం ఎంతమాత్రమూ కాదు వారు ఈపని చేయగలరనీ చేయవలసిందనీ వారికి ఎవరూ తెలియచెప్పకపోవడమే కారణము ఇతరులకు బోధించడమనేది కేవలం పంతుళ్లపనే అనీ, ఇతరులు ఎవరూ ఆపని సరిగా చేయలేరనీ అనే అభిప్రాయాదులు మనలో విరివిగా వ్యాపించి ఉన్నాయి

అక్షరాలు రానివారికి అక్షరాలు నేర్పడానికి వారిని దారిలోకి తీసుకొనిరావడానికీ తలపాగాలు ధరించిన పంతుళ్ళే అక్కరలేదు కొంచెం చదువుకొని ఏపని చేసుకొని జీవయాత్ర నడుపుకొంటున్న వారైనాసరే పనికొస్తారు అందుచేత ఈ ఉద్యమంలో పనిచేసేటందుకు పంతుళ్లేకాకుండా ప్లీడర్లూ, డాక్టర్లూ వ్యాపారం చేసేవారూ ఆఫీసుల్లో గుమాస్తాలూ, పత్రికా సంపాదకులూ చదువుకొన్న పెద్దలూ చదువుకొంటున్న పిల్లలూ ఆడామగా దీదాసాదా పీరూ వారూ అనే తేడాలేకుండా పనికివస్తారు దేశంలో చదువువచ్చినవారందరూ తమకి అందుబాటులో ఉన్న చదువురానివారికి 50 రోజులలో అక్షరాలు వచ్చేలా చేసితీరాలి ఇది ఎవరికివారు తమ బాధ్యత అని పట్టుపట్టి పనిచేస్తేగాని మనదేశంలో విద్యావ్యాప్తి కుంటుకుంటూనే నడుస్తోంటుంది ఇంత వివరంగాచెప్పుతూ విరివిగా ప్రచారం చేస్తే మన దేశంలో 50 రోజుల తర్వాత కాకపోతే ఒక ఐదునెలల తర్వాత అక్షరాలేనా రానివారు, వారి పేరైనా వ్రాయలేనివారు, మెల్లిగా అక్షరాలని కూడబలుకుకొని తమ ఉత్తరాలనైనా చదువుకొవలేనివారు ఎందుకు ఉండవలసివస్తుందో నాకు అర్థంకాకుండా ఉంది

దేశంలో ఉన్న విద్యావంతులందరూ అక్షరాలు రానివారు దేశంలో ఉండకూడదని ఒక్కుమ్మడిగా గట్టి ఉద్యమాన్ని లేవదీసి కృషచేసేలా పత్రికలు ప్రోత్సహించాలి కల్లుసారాలు తాగి మత్తెక్కి ఉండడం ఎంత తప్పో చదవనూ వ్రాయనూ తెలియకుండా మరొక రకపు మత్తులో ఉండిపోవడంకూడా అంత తప్పే అందుచేత విద్యావంతులూ పత్రికలూ ఒకరికొకరు తోడ్పడుతూ ఈ ఉద్యమాన్ని నడిపించవలసి ఉంటుంది విద్యావ్యాప్తివల్ల పరిశ్రమలకీ ఆరోగ్యజీవనానికీ దేశంలో అవకాశం ఎక్కువవుతుంది అంతే కాకుండా విద్యావ్యాప్తివల్ల పత్రికలుకూడా దినదినాభివృద్ధి పొందుతాయి తమ లాభం ఆలోచించుకొనైనా విద్యాప్రచార వార్తలకీ ముఖ్యంగా వయసుమీరినవారిలో జరిగే విద్యప్రచార ఫలితాలనీ పత్రికలు తగినంత ప్రాముఖ్యం ఇయ్యాలి ఇలాగననగానే మన పత్రికలు ఈనాడు అక్షరాలు రానివారిలో జరుగుతూన్న విద్యావ్యాప్తిని చిన్నచూపు చూస్తున్నాయని నా అభిప్రాయం కాదు ముందుముందు ఇంకా ఎక్కువ ప్రాముఖ్యం ఇయ్యాలనీ అందువల్ల పత్రికలవారు [illegible] ఎక్కువ పట్టుదలతో పోటీలుపడి పనిచేసినట్లుగా ఈ ఉద్యమంలో పనిచేసేటందుకు అవకాశం కల్పించినవారవుతారనీ నా అభిప్రాయము జంగమయ్య "భంభం" అని ఒకసారిమాత్రమే శంఖం ఊదితే విననివారు అతను వదలకుండా పదేపదే శంఖధ్యానం చేస్తే ఒకసారైనా తప్పకుండా వినగలుగుతారుకదా।

విరివిగా విద్యాప్రచారం జరిపేటందుకు తగిన సాధనసంపత్తి ఉందా లేదా అని ముందు తేల్చుకోవాలి చాలమందితో కూడి పని చేసే ఉన్యమాలు యుద్ధంలో సేనల్ని నడిపించటంలాంటివనే అనాలి సాధనసంపదలో ఏమాత్రం కొరత అయినా ఉందంటే జయం చేజిక్కదు అందుచేత మనం సాధనసంపత్తి ఏమేమి ఉందో ఇంకా ఏమేమికావాలో తేల్చుకుందాము అక్షరాలు రాని వారికి చదువుకొనేటందుకు ఉత్సాహం నిలకడగా ఉండాలి దాన్ని సాధించేటందుకు ప్రత్యేకంగా తయారైన అక్షరములు వాచకాలూ సిద్ధంగా ఉన్నాయి వారిని ఒకచోటికి ఆకర్షించేటందుకూ రోజుకి ఒక గంటసేపైనా విద్యాగోష్ఠి ఏదోరూపంగా జరిగేలాగా ఏర్పాట్లు చెయ్యాలి చదువుకొనేవారికి శ్రమ అని తోచకుండా విద్యాగోష్ఠి జరగాలంటే సినిమా ఫిలిమ్ ప్రదర్శనమూ, నాటకాలూ భజనలూ, పురాణమూ ఊరికీ జిల్లాకీ సంబంధించిన విషయాలని చర్చించడమూ, విజ్ఞానవిషయాల్ని వివరించి చెప్పే ఉపన్యాసాలూ వీలు వెంబడిని ఏర్పాటుచెయ్యాలి వీటిని సాధనసంపత్తి లేకుండా ప్రత్యేకమైన నేర్పులేకుండా ఏర్పాటుచేసి సాగించడం వీలుకాదు అందుచేత

ఏదేని విద్యాకేంద్రాల కొరకు ఫిలిమ్ నడుంతాయూ, ఒక పురాణంచెప్పే పండితుడూ, ఒక భజనమేళమూ, ఒక నాటకంకొట్టి ఇట్టూ చొప్పున సమకూర్చుకోవాలి అప్పుడే 60 రోజులపాటు వదలకుండా జాతర జరిపినట్లు విద్యాప్రచారోద్యమాన్ని జరిపి అక్షరాలు రానివారందరికీ చదువుకోవడం వ్రాయడం వచ్చేలా చెయ్యవచ్చు ఇలాంటి కృషి వల్ల సగంసగం చదవడం వ్రాయడం వచ్చినవారు ఎక్కువవుతారు వీరిని అంటగాగి కనిపెట్టి ఉండటం సాధ్యమైనపని కాదు వారి కాళ్లమీద వారే నిలబడేటట్లు చేయాలి అందుకోసం వారు వారికి వచ్చిన అక్షరాలు బాలుగూ మరిచిపోకుండా నిలబెట్టుకొనే అవకాశం కలిగించాలి చదివిన వాచకాన్నే చదవడంలో ఎవరికీ ఉత్సాహం ఉండదు తడుముకుంటూ అక్షరాల్ని కూడబలుక్కుంటూ చదివే వారు పత్రికల్నిగాని వచన రామాయణాన్నిగాని నవలల్నిగాని చదువలేరు అందుచేత వారికోసం ప్రత్యేకంగా తయారు అయిన పుస్తకాలు కావాలి మరొకమాట వారికి కాకి మాంసపు ముక్క కాబేలు, కుందేలు అనే చిన్న పిల్లల కథలు పనికిరావు వారికి విషయము ముఖ్యమై భాష సులభంగా ఉన్న పుస్తకాలు కావాలి అలాంటి పుస్తకాలు తెలుగులో ఇప్పుడు స్వల్పమాత్రమే ఉన్నాయి అవికూడా హరిసర్వోత్తమరావుగారూ మొదలైనవారి కృషివల్లనే తయారై ప్రకటించబడ్డాయి కాని అవికావలసిన పుస్తకాలసంఖ్య ముందు సముద్రంలో కాకి రెట్టవంటివనే అనాలి అరవంలోకూడా స్థితిగతులు ఇలానే ఉన్నాయి ఈస్థితి చాలా విచారకరము కొత్తగా అక్షరాలు నేర్చుకొన్నవారికి చదువుకొనేటందుకు కావలసినవన్ని చిన్న చిన్న పుస్తకాలు లేకపోవడమే విద్యాప్రచారం జోరుగా సాగకపోవ డానికి ముఖ్యకారణమని నానమ్మకము ఈ సందర్భంలో నా అను భవం ఒకటి చెప్పదలచుకొన్నాను నా ఎరుకలో ఒక వయసు వచ్చినవారు చదువుకొనేచోట కొంచెం నట్టుతూ చదివేవారు తయా రయారు వారికి చదువుకొనేటందుకు అందుబాటులో ఉన్న పది పుస్తకాలూ వరుసగా ఇచ్చాము వారపన్నీ రెండుమూడు వారాల్లో చదివేశారు తర్వాత వారికి చదువుకొనేటందుకు ఇద్దామంటే మరో పుస్తకం లేదు కొంచెం చిన్న అచ్చుఅక్షరాలవీ నాలుగు ఐదూ క్లాసుల పిల్లలు చదువుకొనే పుస్తకాలూ ఇచ్చి చూచాము అవి వారి మనసుకి ఎక్కలేదు అందుచేత వారిపని పాడిందే పాడరా పాచి పళ్లదాసరీ అన్నట్లు అయింది అంతటితో వారు క్రమంగా రావడం మానుకొన్నారు నా అనుభవాన్నిబట్టి ప్రజలు చదువుకొనేటందుకు సామాన్యంగా మనం అనుకొనేటంత వెనుకాడుతారనిగాని, వారు ప్రతిరోజూ ఏదో కాలక్షేపం ఏర్పాటుచేస్తేగాని రారనిగాని అనిపిం చదు వాచకాలూ, అక్షరమాలా అక్షరాలు వచ్చినతర్వాత చదువుకొన డానికి తగినన్ని పుస్తకాలూ చదువువల్ల వెంటనే కాకపోతే ముందు ముందైనా ఏదో ప్రయోజనము ఉంటేచాలు మరీ పెద్దవారి సంగతి వదిలివేసినా ముప్పది ఏళ్ళలోపువారు చదువుకొనేటందుకు ఉత్సా హంగా ముందుకువస్తారు తెలుగులో వాచకాలూ, అక్షరమాలా పది చిన్న పుస్తకాలు ఉన్నాయి ఇంకా మరెన్ని పుస్తకాలు ఉండాలో అవి ఏపద్ధతిలో ఉండాలో చెప్పి తర్వాత చదవనూ వ్రాయనూ నేర్చుకొన్నవారికి విద్యవల్ల ఏప్రయోజనం కలిగించ డానికి వీలవుతుందో సూచిస్తాను

వ్రాయనూ చదవనూ తెలిసినవారి ఉపయోగంకోసం కనీసం ఐదువందల పుస్తకాలైనా తయారుకావాలని నా అభిప్రాయం అప్పుడే ఎవరైనాసరే తనకి నచ్చిన విషయాలమీద ఏవో కొన్ని పుస్తకాలనైనా వాటిలోనుంచి ఏరుకోగలుగుతారు పెద్దలు కూర్చొని ఆలోచించి మనదేశంలో పెద్దలైనవారికి ఏయే విషయాల్ని గురించి తెలుసుకోవాలని ఉంటుంది? వారికి ఏయే విషయాలు తెలియడం అవసరం? అని విషయాలను అన్నింటినీ చేర్చి ఒక పట్టికగా తయారుచేసి అందులో ఐదువందలో అంతకంటె ఎక్కువో పుస్త కాల్ని తయారుచేయిస్తే కొత్తగా అక్షరాలు నేర్చుకొన్నవారికి ఒక ఏడాదిపాటు తడుముకోకుండా చదువుకొనేటందుకు కావలసినన్ని పుస్తకాలుంటాయి ఆతర్వాత నా రేపుస్తకమిచ్చినా దడదడా చదువ గలుగుతారు ఐతే మనకు కావలసిన చిన్న పుస్తకాలు ఎలా ఉండాలి అని పుస్తకాలన్న పేరేగాని ఆయా విషయాలమీద ఇష్టా గోష్ఠి కబుర్లలాగుండాలి రంగురంగులవి కాకపోయినా అందమైన బొమ్మలుండాలి అట్టమీద పేరుచూసి ఎవరైనా పుస్తకాన్ని లోపం బొమ్మలని చూడగానే పుస్తకం చదవాలనిపించాలి దాన్ని చదవడం మొదలుపెట్టగానే వారికి అది చివరిదాకా చదవాలనీ ఆతర్వాత ఆవిషయాన్ని గురించే మరికొంత నేర్చుకోవాలనీ కోరికలు కలగాలి ఇలాంటి పుస్తకాల అవసరాన్ని ఢిల్లీపట్టణంలోని పుస్తకాలయం వారు గుర్తించి హిందీలో వన్నెలుగు విషయాలమీద పుస్తకాలని రచించి పంపించవలసిందని విద్యావంతుల్ని కోరారు వాటిలో మంచి పుస్తకానికి ఒక్కొక్కదానికి నూరో రెండు వూర్లో రూపాయలుకూడా బహుమానము ఇస్తామన్నారు మదరాసు ప్రభు త్వంవారి విద్యాశాఖకూడా ఈ విషయాన్ని గురించి శ్రద్ధతీసుకో వడం మొదలుపెట్టింది అందుచేత కొద్దికాలంలో ఈ లోపం పూర్తి అవుతుందనీ విద్యాప్రచారానికి ముఖ్యమైన అడ్డంకి తొలగి పోతుందనీ ఆశించవచ్చు

కె. వెన్నెల

కోటి విద్యలు కూటికొరకేకదా! అందుచేత నేడు అక్షరాలైనా తెలియకుండా ఉన్నవారికి చదువనూ వ్రాయనూ తెలుసు కొంటే వచ్చే ఎక్కువ లాభం ఏముంది వారికి ఏమి ప్రయోజనం కలిగించవచ్చు అని కొంచెం ఆలోచిద్దాము చంద్రుడిని చూస్తేకదా సముద్రం పొంగుతుంది అలాగే విద్యావంతు లవడంవల్ల ఏదో ఒకటి సాధించగలుగుతారు అనే ఆశనీ అవకాశాన్నీ కల్పిస్తేసరి విద్యాప్రచారం అప్పుడు కుంటినడకలతో కాకుండా కదము తొక్కుతూ పరిగెత్తే గుర్రపునడకలతో సాగిపోతుంది

మన విద్యాశాఖవారు ఎనిమిదవ క్లాసు పరీక్షకి ఆడా మగా, చిన్నా పెద్దా అనే తేడాలేకుండా విద్య నేర్చుకొన్నవారందరూ వెళ్ల వచ్చునన్నారు అందుచేత కొంచెం వయసు మీరినవారికి కొంతవరకు అవకాశం కలిగింది ఇంక విశ్వవిద్యాలయంవారు కూడా మెట్రిక్యులేషన్ పరీక్షకి అందరూ వెళ్ళవచ్చునని అంటేసరి అంతేకాకుండా ఇంగ్లీషుభాషని పూర్తిగా వదలివేసి మన దేశభాషల్లో ఆ పరీక్షలను నడిపితే ఎంతోమంది నేడు చదువురాకుండా ఉన్నవారు మూడునాలుగేళ్ళలో బాగా విద్యావంతులవడం జరుగుతుంది దీనికి కావలసిన అవకాశాలు కల్పించమని అందరూ విశ్వవిద్యాలయాలవారిని కోరడం తగినపని అని నా మనవి

తెలుగు భాషలో ఏవిధాన్నిబట్టి చూసినా వందలాది చిన్న చిన్న పుస్తకాలు అవసరమని తేలింది వాటిలో వాడే భాష చాలా సులభమైన ధోరణిలో ఉండాలి ఇది వేరే ఎవ్వరూ నొక్కిచెప్ప నక్కరలేదుకదా! తేటతెలుగు ధోరణిని మించిన సులభమైన ధోరణి కనుపించదు అందుచేత తేటతెలుగులో విషయ ప్రధానమైన వందలాది పుస్తకాలు తయారైతేసరి తెలుగువారిలో పెద్దల్నీ పిన్నల్నీ ఈపనికి పూనుకోమని కోరుతున్నాను ఒకే దెబ్బతో రెండు పిట్టల్ని కొట్టినట్లవుతుంది తెలుగు రానివారికి సులభంగా తెలుగు నేర్చుకొనేటందుకు అవకాశం కల్పించినట్లవుతుంది తెలుగు భాషకి సేవచేసినట్లవుతుంది

చిన్న కథ:

# దీపావళి

"సమీర"

ప్రతి దీపావళినాడు రాత్రి ఎనిమిది గంటలవుతుంది పండగసంబరంతో అందరూ ఉత్సాహంతో టపాకాయలు కాలుస్తున్నారు ఆ పెద్ద బంగళాకంతా సీతా, నౌకర్లూ తప్ప మరెవ్వరూ లేరు ఆ పెద్ద బంగళా అంతా ఎలక్ట్రిక్ దీపాలతో మెరిసిపోతుంది దూరాన ఎక్కడో పెళ్లి సన్నాయి వినబడుతోంది పట్టుపరుపుమీద పడుకుని ఆలోచిస్తోంది సీత ఆమె వయసు దాదాపు నలభయేళ్లుంటాయి అక్కడక్కడా తెల్లబడిన జుట్టు, ముడతలుపడిన ముఖము ఆమె ఒక్కప్పుడు అందమయినదని వప్పుకు తీరాలి ఎందుకో తనకీబాధ: ఒంటరిగా వున్నప్పుడు మరీ దుర్భరంగా వుంది? ఆ రోజులు మళ్లీ రావు: ఆరోజులు తలుచుకుంటుంటే ఆవేదనతో హృదయం పగిలిపోతోంది రెండు వేడి కన్నీటి బిందువులు పట్టు దిండుపయిన బడ్డాయి దీపావళి వచ్చింది ఆరోజంటే తనకి భయం దిగులు ఆరోజంటే తనకెందుకు భయమో ఎవరికీ చెప్పలేదు, చెప్పినా ఎవరూ అర్థంచేసుకోలేని బాధ అది

చిన్నప్పుడు అమ్మకీ నాన్నకీ తనంటే చెప్పలేనంత ముద్దు "చిట్టీ" అని నాన్న ఎంతో ఆప్యాయంగా పిలిచేవారు అమ్మకి తనకి చిన్నప్పుడే పెళ్లి చేయాలని పట్టుదల నాన్న చదువుకోమని ప్రోత్సాహమిచ్చారు ఆ ఐశ్వర్యానికి, గారాబానికీ తోడు అందటా తనందకత్తెనని అనేవారు రోజుతో చాలా సేపు అద్దం ముందరే గడిపేది

ఆ సంఘటన జరిగి యిరవయేళ్లవుతుంది దాసుతో తనకి మొదట పరిచయమయింది రైల్లో మొదట అతన్ని చూసినప్పుడు వాడు తన జీవితంలో చాలాభాగం ఆక్రమించుకుంటాడనీ, అతనికోసం తను బాధపడుతుందనీ అనుకోలేదు అతను ఎక్కువ అందగాడు కాదు సంపన్నుడంత కంటెకాదు ఒక కాలు కొంచెం కుంటుకో నడుస్తాడు ఎక్కువ పట్టిచూస్తేగానీ ఆ విషయం తెలుసుకోవటం కష్టం ఎవరితోనూ ఎక్కువ మాట్లాడడు అతిగా కలవడు

అతనిలో తనకంత ఆకర్షణ కనపించటం నిజంగా ఆశ్చర్యకరమయిన విషయమే తనకి దాసుమీద యిష్టంవుందని చెపితే అమ్మా నాన్నా తెల్లబోయారు తనకి పిచ్చి ఎక్కిందనుకున్నారు కూడా తన అభిరుచి చాలా తక్కువరకానికి చెందినదని స్నేహితులు చులకన చేశారు బంధువులు ముక్కుమీద వేలేసుకున్నారు అన్నయ్య దాసు వట్టి దద్దమ్మని నిముషంలో తేల్చిచెప్పారు అందరికీ విపరీతంగా తోచి అస్వాభావికమయిన పనేదో చేస్తున్నట్లు, మనసు కలవరపడింది కానీ జీవితంలో తను ఎవర్నయితే మరచిపోవాలని ప్రయత్నించిందో, వారినే విధి దగ్గిరగా తెచ్చింది ఏనాడయితే దాసు తనకి తగిన వరుడు కాదని నిశ్చయించుకుందో ఆనాటినుంచీ తన ఆత్మకి శాంతి అన్నది లేకపోయింది అతన్ని తన ఊహా ప్రపంచంనుండి తొలగించివేయాలని నిర్ణయించుకున్న మరుక్షణం నుంచీ అతన్ని గురించే ఆలోచించేది

కాలేజీలో చదువుతున్న తనకి అనేక మంది స్నేహితులుండేవారు వాళ్లెవరిలో చూడని ఒక ప్రత్యేకత దాసులో కనుపించింది తన అందాన్ని పొగిడి, పార్టీలకు పిలిచి తన ఐశ్వర్యాన్ని అనుభవించాలని ఎంతమంది ప్రయత్నించారో! మొదట్లో దాసు తనమీద ఏవిధమయిన శ్రద్ధ చూపలేదు తనుగూడా అతనిపట్ల నిర్లక్ష్యభావం చూపాలని నిశ్చయించుకుంది కానీ అతని మాటలు చేష్టలు నడవడి తననెంతో ఆకర్షించాయి అతనిమీద గౌరవాభిమానాలు ఎక్కువయాయి

దాసు యింటికి రావటం అమ్మకీ, నాన్నకీ యిష్టం లేదు మొగమాటముకొద్దీ నాన్న పైకి ఏమీ అనలేదు అమ్మమటుకు తరుచూ విసుక్కునేది అన్నయ్య అతన్ని కుంటివాడికింద జమకట్టి హేళన చేసేవాడు దాసు వాళ్లింటికి తననెప్పుడూ ఆహ్వానించలేదు వాళ్లకి తనంటే గిట్టదని తెలుసుకోడానికి ఎక్కువ కాలం పట్టలేదు అతన్ని దొంగతనంగా కలుసుకోవడమనేది తన సంస్కారానికి విరుద్ధమయిన పని అతనింటికి వస్తే అందరూ మూతి ముడుచుకునేవారు 'ఇతరులు అతన్ని ద్వేషించిన కొద్దీ, తన కతనిలో ఏదో మంచితనం కనుపించింది

దాసు మధ్య తరగతి కుటుంబీకుడు అమ్మ, నాన్న తనకతన్ని తగిన వరుడుగా ఎన్నుకోకపోవడానికి మొదట కారణమదే అతనిమీద తనకి మోజు ఎక్కువవుతోందని నాన్న సంబంధాలు వెతకటం ప్రారంభించారు. గెజిటెడ్ ఆఫీసర్లూ మేనత్త కొడుకులు దాసుతో పోటీకొచ్చారు వారి మాట ఎత్తినప్పుడల్లా తను తప్పించుకు తిరిగేది దాసు సామాన్యమయినవాడనీ తన అంతస్తుకు తగడనీ, నాన్న నొక్కిచెప్పారు.

అట్నీ! ఆతని సాంప్రదాయం మంచిదికాదని ఎంతమంది నాన్న మనసు విరిచేశారు

నిజంగా దానుకికూడా తనమీద ప్రేమ వుందా? లేదా? అసలు ప్రేమంటే ఏమిటి? అందరినీ ఎదిరించి వివాహం చేసుకుంటే దాను తనని సుఖపెడతాడా? లేదా? అవి రోజూ తను మథనపడేది ఎన్ని అనుమానాలుంటేనేం ఆతని చిరునవ్వు ముఖం చూడగానే తన ఆలోచనలన్నీ మాయమయేవి అతనిలో వున్న లోకజ్ఞానాన్నీ, శాంతస్వభావాన్నీ, ప్రశాంతతనీ పంచుకోవాలని ఉబలాటపడేది ఆతనితోవున్న కొద్దిసేపట్లోనూ తన గర్వం, కుళ్లు అంతరించి, ఏదో కొత్త వెలుగు, కాంతి మనసుని ఆక్రమించుకునేది తన ఈ జీవితంలోకల్లా గర్వించతగ్గ విషయం దానుయొక్క పవిత్రమయిన స్నేహమే!

ఆది వానాకాలం వాతావరణమంతా చల్లగా, నిశ్శబ్దంగావుంది డాబా మీద కూర్చుని చదువుతుంటూంది దాన్నవచ్చాడు ఆవేళ ఆతని ముఖంచూస్తే తనకి భయమేసింది ఎప్పుడూ దాను అంత విచారంగా కనుపించలేదు నవ్వుతూ, అమాయకంగా ఆతని కళ్ళని విచారం కప్పేస్తున్నది దాను ఆవాళ చెప్పిన విషయంలో తనకేమాత్రం అవసరం కనుపించలేదు హృదయం వున్నవాడు దాను! తనదగ్గిర ఎందుకు అబద్ధమాడుతాడు! అతని తల్లి, మేనకోడలిని చేసుకోమని తొందరచేస్తున్నది అటు తల్లి మాటకాదని, ఆమెను నొప్పించలేక, యిటు తనకి సమాధానం చెప్పలేక అవస్థపడ్డాడు దాను అటువంటి పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుందని తనకీ తెలుసు

దాను వెళ్ళిపోయినతరువాత తనలాగే కూర్చుని చాలాసేపు ఆలోచించింది తన తలితండ్రుల దృష్టిలో దాను ఎటువంటివాడో, ఆతని తల్లికి తనటువంటిదే ఎన్ని బాధలు కోర్చిఅయినా ఆతన్ని వివాహం చేసుకోవాలనే కోరిక ఎక్కువయింది కాని దానికి తగిన ప్రోత్సాహాన్ని దాను ఇవ్వలేకపోయాడు ఆతనికి తల్లిమీద అపూర్వమయిన భక్తిప్రేమలున్నాయి ఆమె మనసుని బాధపెట్టడం ఆతని కిష్టంలేదు అది కూడా త్యాగంచేసి తనకోసరం ఆ పెళ్లి మానుకుంటానన్నాడు విడిగా పెళ్లి రిజిస్ట్రారు మారేజిచేసుకుందాం రమ్మన్నాడు తనకి ధైర్యం లేకపోయింది తను పిరికిది తనమీద పంచప్రాణాలు పెట్టుకున్న తల్లి తండ్రుల్ని ఎదిరించడానికి తనకి ధైర్యం చాలలేదు

వారం రోజులైంది భావిజీవితాన్ని గురించి రాత్రింబగళ్లు ఆలోచించింది ఆ విషయం ఆలోచించినకొద్దీ తన ధైర్యం సన్నగిల్లి దిగజారిపోయాయి దానుని మరచిపోయి, మనసు మార్చుకోవాలని తుది నిర్ణయం చేసుకుంది ఒక సామాన్యమయిన వ్యక్తికోసరం తన కెందుకింత బాధ? ఈలోకంలో ఎంతమంది, ఎంతమందిని మరచిపోవడంలేదు! ఆరునెలలు చూడకుండావుంటే అదే అలవాటయిపోతుంది అనిఅనుకుంది ఉత్తరంద్వారా తన మనసులోనిది తెలియజేసింది ఆతని తల్లికోసరం తన ప్రేమని త్యాగం చేస్తోందని దాను అపోహపడ్డాడు నిజంగా అంతటి ఔన్నత్యం తనలోవుంటే ఎంత బాగుండును?

రాజమండ్రిలో దాను పెళ్లిజరిగింది అందరూ సూటిపోటి మాటలని సంతృప్తిపడ్డారు దానుదగ్గిరనుంచి ఒక శుభలేఖ. స్నేహపూర్వకమయిన ఉత్తరమూవచ్చాయి మొగవాళ్ళందరూ అలాగే మోసంచేస్తారని అమ్మా అతను పెద్దమనిషికాదన్నవిషయం తనకి మొదటే తెలుసునని నాన్న దూషించారు కానీ ఆతనిలోవున్న మంచితనం, తనకీ దానుకీ మధ్య ఎటువంటి పవిత్ర సంబంధం వున్నదో ఎవరికి అర్థమవుతుంది?

పెళ్ళయినతరువాత గూడా దాసు తనకు ఉత్తరాలు వ్రాసుకునేవారు వాటిలో ప్రేమకుగానీ స్వవిషయాలకుగానీ తావుండేదికాదు ఆతను రాసేవంటి ఉత్తరాలు ఎవరూ వ్రాయలేరు ఎంత ప్రయత్నించినా అతని మీద మమకారంపోలేదు అలా యింకా ప్రేమించటంవల్ల దాను భార్య రమకి తీరని అపకారంచేస్తున్నాని మనసు పీడించేది ఆతను దూరమవుతున్నకొద్దీ జీవితంలో మాధుర్యమంతా అంతరించిపోతున్నట్లు దిగులావేసేది తన పిరికితనంవల్లే అతన్ని పోగొట్టుకుంది ఆ పిరికితనంలో స్వార్థం లేకపోలేదు ఒక వ్యక్తికోసం, ఆత్మీయులకి దూరమవడానికి స్వార్థం వప్పుకోలేదు కానీ తనకి జీవితంలో ఆనందమనేది ఎక్కడవుందో అక్కడికి దూరమయిపోయిందని తెలుసుకోడానికి ఎక్కువ రోజులు పట్టలేదు తన సౌఖ్యాన్నంతా ఎవరికోసం ఎందుకు ఆహుతిచేసుకుందో తనకే తెలియలేదు

రెండేళ్ల గడిచాయి ఇంట్లో పెళ్లిచేసుకోమనే పోరు ఎక్కువయింది. అమ్మ తన పెళ్లివిషయమై బెంగపెట్టుకుంది తను అనుభవిస్తున్న దుఃఖాన్ని పంచుకోడానికి తలితండ్రులు ముందుకువచ్చారు కొందరు మన సుఖాన్ని పంచుకోడానికి వెనక్కి తీస్తారు దుఃఖాన్నిమటుకు పంచుకోగలరు ఈరెండిటిలో చాలా తేడావుంది ఆరోజున తను దాసుని గౌరవిస్తే "కుంటివాడు" అన్నారు కొంచెమైనా అతన్ని అర్థంచేసుకుందామని ఎవరూ ప్రయత్నించలేదు కొన్నాళ్ళయిన తరువాత ఇతరులకోసమే తను జీవిస్తున్నట్లు అనిపించింది

సాధారణంగా వివాహమనేది మనుష్యుల్లో మార్పు తెస్తుందంటారు తను ఓసంబంధానికి వప్పుకుంది పిల్లవాడికేం లక్షణాలుండాలని నాన్న అడిగితే తనకి నోట మాటరాలేదు దాసు కాకపోయిన తరువాత మరెవరు తన భర్తయినా ఒకటే అనుకుంది వివాహం తన జీవితాన్ని మరీ దుర్భరంచేసింది తన భర్తకి ఏ లోటూ లేదు కానీ అతన్నిచూస్తే తనకి యిష్టం కలగలేదు పైపెచ్చు అడుగడుక్కి దాసు జ్ఞాపకంవచ్చేవాడు

దాసుకి టి. బి. వచ్చిందన్న వార్త తను మొదట నమ్మలేదు అతన్ని చూడటానికి వెళ్లినప్పుడు తను ఏదో తప్పుచేసినట్లు అనిపించింది చిక్కి శల్యమై పెద్దగడ్డంతో దాసు మంచంమీద పడుకున్నంటే అతని కాళ్ళమీద పడి గొల్లున ఏడవాలనిపించింది రమతోపాటు దాసుకి ఉపచర్యలు చేయాలనిపించింది కానీ భర్త పక్కనే వున్నాడు దాసుని తను వివాహంచేసుకున్నంటే అతని కా దుర్గతి పట్టేదికాదేమోయని అంతరాత్మ ఘోషించింది అతన్నెలాగయినా బ్రతికించమని వెయ్యిదేవుళ్ళకు మ్రొక్కుకుంది "చూశావా! రోడ్డుమీదపోయేవాడిని కట్టుకుంటానన్నావు చివరికి క్షయరోగం వాడికి సేవలుచేయటంతో నీ బ్రతుకు తెల్లారేదే!" అని అమ్మ ఎగతాళిచేసింది బంధువులందరూ వెక్కిరింపుగా చూశారు వాళ్ళందరినీ చంపి దాసుదగ్గరికి పారిపోవాలనిపించింది కానీ అతనికీ, తనకీ ఎన్ని అటంకాలు వున్నాయి

అది దీపావళినాడు తలంటి పోసుకుని కొత్తచీర కట్టుకుంది ప్రమిదలు పెడుతూంటే, దాసుకి ఎక్కువగా వుందని కబురువచ్చింది ఇంట్లో అందరూ వద్దని వారిస్తున్నా అలాగే కారు ఎక్కి ఆస్పత్రికి బయలుదేరింది సాయంత్రం ఆరుగంటలవుతుంది వీధులన్నీ టపాకాయల చప్పుళ్లతో మారుమ్రోగుతున్నాయి తను ఆస్పత్రికి చేరుకునేటప్పటికి ఆలస్యమయిపోయింది అప్పటికే దాసుకి ఇహలోకంతో సంబంధం తీరిపోయింది అతని కళేబరాన్ని యింటికి మోసుకుపోతున్నారు ఎంతో ప్రశాంతంగా అమాయకంగా వుంది ఆ ముఖం రమతోపాటు తనకీ గొల్లున ఏడవాలనిపించింది ఆఖరిఘడియల్లో దాసు తన విషయమేమయినా అడిగాడేమో, రమని కనుక్కుందామనిపించింది కాని ఆ సమయంలో తను ఆ ప్రశ్న ఎలా వేయగలదు?

బరువెక్కిన హృదయంతో యింటికి తిరిగివచ్చింది మంచంమీద పడుకుని ఎంతసేపు ఏడ్చిందో తనకే తెలియదు తను ప్రాణపదంగా దాచుకున్న వస్తువును ఎవరో లాక్కుపోయినట్లు, లోకమంతా చీకటయిపోయినట్లు తల తిరిగిపోయింది చేతులారా అతని పొట్టగొట్టుకుంది. విధిని దైవాన్ని పరిస్థితులనీ దూషించి తృప్తి పొందడానికి తన కవకాశంలేదు తప్పంతా తనదే! పండగనాడు రాత్రుళ సినిమాకి వెళదామని భర్త గోలచేశాడు సినిమా చూస్తున్నంతసేపూ దాసు కళేబరం తన కళ్ల ఎదుట కనుపిస్తోనేవుంది

మొగుడు పెద్ద ఆఫీసరు పెద్ద బంగళా బయటికి చూడటానికి చక్కగా కనుపిస్తాయి కాని తనకేదో చెప్పలేని మనోవ్యథ, అర్థంలేని గుబులు అశాంతి మిగిలాయి జీవితంలో ఇప్పుడు తనకి నలభైయేళ్ల దాసుయింకా తన స్మృతిపథంనుండి తొలగిపోలేదు. అనుక్షణం అతని రూపు, మాటలు, చేష్టలు తనకి జ్ఞప్తికివస్తూనేవున్నాయి మళ్ళీ వచ్చింది దీపావళి! దాసు కళేబరాన్ని సాగనంపిన ఘడియలు మళ్ళీ వచ్చాయి! దీపావళంటే తనకి భయం, దిగులు

దేశ దేశాలలో, వివిధప్రదేశాల్లో దీపావళి పండుగ జరుగుతోంది కొత్తబట్టలు కట్టుకుని, ప్రజలు సంతోషంతో టపాకాయలు కాలుస్తున్నారు సీతకిమటుకు దీపావళి వచ్చిందంటే పాత సంగతులన్నీ జ్ఞప్తికి వచ్చి, దుఃఖం ఒక్కసారి పొంగివస్తుంది

# గురజాడ అప్పారావు

రమణా రెడ్డి

గురజాడ అప్పారావుగారు విశాఖమండలంలో పుట్టారు కాని ఆంధ్రదేశానికంతా చెందిపోయారు నియోగి బ్రాహ్మణ కుటుంబంలో పుట్టారు కాని సమస్తవర్ణాలవారికీ చెందిపోయారు 1861 నవంబరు 30 వ తేదీ జన్మించారు కాని చనిపోలేదు కనుకనే 1952 నవంబరు 30 వ తేదీనకూడా మన మాయనను స్మరిస్తున్నాము మహనీయులకు జన్మతారీఖు మాత్రమే వుంటుంది— యిక వారు యమదూతలకు భయపడవలసిన అగత్యంలేదు— మూడుకోట్ల తెలుగు గుండెలలో స్థిరావాస మేర్పరచుకున్నారు అప్పారావుగారు నశ్వరమైన పంచభూతాల సమ్మిశ్రమమయిన దేహం ఆయనది 1915 నవంబరు 30 వ తేదీని పనికి శాశ్వతంగా సమ్మె కట్టింది కట్టక యేమి చేయగలదు? తెలుగుదేశపు వేడిమికూడా సహించలేని దుర్బలత్వంతో పుట్టిందికదా విజయనగర ప్రభువుల వెంట నీలగిరులెక్కి యేటేటా రెండు మూడు మాసా లక్కడ వుండిందికదా, చొక్కాపై చొక్కా కోటుమీద కోటు వేసుకుంది కదా తిన్న పిడికెడు తిండికూడా హరించుకోలేకపోయిందికదా ఆజన్మమరణాంతమూ అజీర్ణానికి క్రుంగి వంగి పోయిందికదా బ్రతికియుండగా రెండెడ్ల బళ్ళమీద విశాలంగా సుఖంగా బారుగు దూది దిళ్ళకు ఆనుకోవలసివచ్చింది కదా, పైపెచ్చు విజయనగర ప్రభువంశీయుల వారసత్వపు దావాలో పది పూర్తి సంవత్సరాలు నిర్విరామంగా నిర్నిద్రగా ఎలా పని చేయగలదు? కనుకనే ఆనాడు సమ్మెకట్టింది "పెద్దచెవులు, చదకపు చెక్కిళ్లు, సొగసైన యవన నాసం అతి విశాలమైన ఫాలం", "పెద్ద కళ్లు, నిండుగల గడ్డం యింపుగా కొనలుసాగిన మీసం"—యిన్నీ చల్లబడిపోయాయి కాని "కన్యాశుల్కం" "కొండుభట్టీయం" "ముత్యాలసరాలు" ఆయన యొక్క అమరాత్మాగ్ని ప్రభావంభరితాలయ్యాయి దేవులపల్లి కృష్ణ శాస్త్రి అన్నట్టుగా "గురజాడ అప్పారావు 1915 లో చనిపోయినా 1915 తరువాతనే జీవించడం ప్రారంభించాడు"

ఆయన జన్మకాలం విచిత్రమైనదీ విలక్షణమయినదిన్నీ భారతజీవితమంతా క్రొత్తపాతల నడిబొడ్డులో నడివడిచే రోజులవి పాత నడిపోనూ లేదు క్రొత్త పైకొననూ లేదు రాజకీయంగా 1857 ప్రథమ భారతస్వేచ్ఛా సంగ్రామం ఝాన్సీ లక్ష్మీబాయియొక్క అర్ధమూ తెగిన వీర దరహాసాంచిత శాంతవదనంవలె రంగూను చెర కటకటాలనడుమ యావజ్జీవ బందీయైన మొఘల్ సామ్రాజ్య రమ నిలిచి వెలిగే బహదూర్ షా మోముమీది నిరాశనిసపీడవలె మిగిలిపోయి ప్రతీకారవాంఛ ముప్పైకోట్ల గుండెలలో చేరిపోయింది కాని నిరాశ నిస్పృహ సర్వత్రా దుర్భోధిస్తున్నయి బ్రిటిష్ వాడి రైలుదారి దేశం గుండెల కొనలకు తుపాకుల బాటలు వేసింది బ్రిటిషువాడి తంతిదారి దేశం గుండెలలో మెదిలే చిట్టి పొట్టి కోపస్పందనలను ఢిల్లీ మదరాసు కలకత్తా బొంబైల చెవిలో వూదింది, బాకావలె సిద్ధంగా వున్నై సన్నద్ధమైన బ్రిటిష్ పశు బలాలు పైబడను మరి, సంఘమో చింపిరితలలాగు తయారయింది యమశాసనాలు లంచాలు బహిష్కారణాలు, దుర్మదాలు, దుర్మోహాలు నిండి నిబిడీకృతమై ఆముదాల నంచివలె తయారైంది హైందవ సంఘం భూమిని కౌలుకుతీసుకుని సొంతదారయిన బ్రిటిష్‌వాడి చరణాంగుళులకు తలలు చేరవేసే జమీందారులు తమ కౌలుదారులపైని త్రివిక్రము లయ్యారు బ్రిటిష్ సామ్రాజ్యస్వత్వాన్ని ఎవరెవరైతే బేషర్తుగా అంగీకరించారో, ఆ సంస్థానాధీశులు మనగలిగారు ఈ జమీందారుల ఆగాలభోగాలకు వందిమాగధులైన అగ్రవర్ణంవారు భూస్వామ్యవ్యవస్థలో అంతర్భాగమైపోయారు ఇనాములూ, సనదనాలు కృతిభర్తృత్వాలు, అర్చకత్వాలు పౌరోహిత్యాలూ పాండిత్యాలూ —యీవిధంగా స్థానిక ప్రభువర్గమైన జమీందారీ భూస్వామ్య వ్యవస్థకూ బ్రాహ్మణవర్గంవారి భూదేవత్వానికీ లంకె యేర్పడింది భూదేవులు దేవభాషనేకాని దేశభాషలను ముట్టుకోరు సంస్కృతము ద్వారానే బ్రాహ్మణజాతి ప్రత్యేకాధిపత్యముకూడా యేర్పడినది శ్రీ నిడుదవోలు వెంకటరావు అన్నట్లు "క్రీ శ 11 వ శతాబ్దినాటికి ఉత్తమసాహితీ విశిష్టత యేర్పడిన తెనుగున వైదిక మతప్రాధాన్యమువలన సాహిత్యమంతయు సంస్కృత పండితాధీనమైనది సంస్కృత భాషాగౌరవము, బ్రాహ్మణజాతి ప్రత్యేకతయు వ్యాపించినవి మత సంబంధమగు నాధ్యాత్మిక విషయ ముత్తమసాహిత్య ద్వారమునగాని ప్రజాసామా

వ్యమున కందుకాటులోనికి రాకపోయినది కేవల దేశిసాహిత్యకవితల యందాదరము సన్నగిల్లినది దేశియముగాని మార్గకవిత ప్రకృష్ట స్థాన మాక్రమించినది " స్థిరమైపోయిన సంస్కృతభాషా మర్యాదలు జీవద్భాష అయిన తెనుగు మెడమకట్టిన రోకటిబండలయినవి మహాభారతానువాదంతో 11 వ శతాబ్దిలో నన్నయతో మొదలయిన సంస్కృతభాషా దాస్యం 1850 నాటికి ఉక్కుమూతి పిండెలు తాల్చిన పెదేశాలను దాపురించిన చెట్టువంటిదయింది తేలిక నుడి పోయి తెనుగు మణుగు నాటకయింది తిక్కనగారి ఔచిత్యం ఔన్నత్యంపోయి దౌర్జన్యం, దౌర్బల్యం మొదలయింది పెద్దనగారి సౌందర్యం సౌకుమార్యంపోయి తిట్టూ ఒట్టూ మొదలయింది విశిష్టత గద్దెదింపి భ్రష్టత ఎక్కికూర్చుంది వాచస్పతులకు మారు వాణమ్మలు పుట్టారు సామర్థ్యానికి మారు దర్పం పెరిగింది కవిత్రయ మొక్కచై అహర్నిశికాగా యీ అంధయుగ సాహిత్య సమస్తం అనువన ప్రతిబింబించిన వృద్ధదర్పణమయింది సరస్వతి యీ కాకవుల చేతిలో సాని అయింది కవిత్వం వృత్తి అయింది కళ శాస్త్రమయింది పండితులే కవులయ్యారు పరిస్థితి గొప్ప మార్పును పునాదులను కాకగలిగేటంత లోతు మార్పును కోరింది వికృతి అయిన ప్రకృతి అంతా శోకభయ విహ్వలమై మార్పును కోరింది—మార్పును

ఆ మార్పు వచ్చింది రాకతప్పదు స్థితి పురోగతికి ప్రతిబంధకమైపోయినప్పుడు మార్పు వచ్చితీరుతుంది పూర్వం వైకుంఠంనుండి శ్రీమన్నారాయణమూర్తి అవతరించేవాడు కాని యింతటితో అవతారాలు ఆగిపోయి సామాన్యమానవులనుండి అధిరోహణ ప్రారంభమయింది విశ్వాసయుగం గతించి విజ్ఞాన యుగం వచ్చింది ప్రభుయుగంపోయి సామాన్యయుగం వచ్చింది "జనంనుండి జనంకొరకు జనంచేత" జీవితరంగమంతా పరిపాలింపబడాలి అని అబ్రహాం లింకన్ ప్రవచించాడు ఈ జనం పాటక జనంకాదు—అలగా జనం కాదు—"శిష్టులు"—మధ్యవర్గపు పైశ్రేణి వారు నగరసంస్కృతి ప్రారంభమయింది పొలం దేవాలయం దర్బారులనుండి ఒక్కపుడుటున ఆఫీసు, హోటెల్, సమావేశాలకు జీవితం లంఘించింది అచ్చు వచ్చింది సామాన్యులుకూడా విద్య నభ్యసించే అవకాశం కలిగింది ఈ విద్య పాతవిద్యకాదు—వారాణం గీర్వాణాన్ని ఫిటు కొట్టింది మెకాలే బ్రహ్మదేవుడయ్యాడు 1855 ఈ రెండు యుగాల నడిమి సంవత్సరం

గురజాడ అప్పారావూ (1866) గిడుగు రామమూర్తి (1863) వీరేశలింగమూ యీ క్రాంత్తయుగపు తొలిప్రతినిధులు తరువాతి తెలుగు జీవితానికంతా వీరు మూలపురుషులు వీరిని విడదీయడమే తప్పు

"మూట పారెడు రక్త మొక్కటె,
మూట వెలిగెడు తేజ మొక్కటె
మూడమటె తప్పు."

అనవచ్చును ముగ్గురూ మూడు రంగాలలో గొప్ప మార్పు కలిగించారు వీరేశలింగంగారి సంఘసంస్కారమూ గిడుగువారి భాషా సంస్కారమూ గురజాడవారి సాహిత్యసంస్కారమూ ఒక్క బోదెనుండి పుట్టిన శాఖలే గిడుగూ గురజాడా చిననాటినుండి సహాధ్యాయులు వీరేశలింగమూ గిడుగూ మిత్రులు గురజాడా వీరేశలింగమూ పరిచయులు వీరు ముగ్గురూ ఆంగ్లవిద్యనుండి తమ సంస్కారభావాలను గ్రహించారు కాని ఎవ్వరూ ఆంగ్లానికి దాసులుకారు పదహారణాలు తెలుగువారు కనుకనే తెనుగు జీవితాన్ని సర్వతోముఖపరిశుభ్రం చేయపూనుకున్నారు కనుకనే ఆంగ్లవిద్య భారతీయులకు "తలవని వరం" వంటిదయింది

తన సాంఘికసంస్కరణోద్యమంద్వారా వీరేశలింగం పంతులు హైందవమతాచారాలనే సవాలుచేశారు విధవావివాహాలు సానిమేళాల విషేధాలు విధవలనూ సానులనూకూడా మానవుల లోనే చేర్చాయి కనుక మానవవాదం (Humanism) వీరేశలింగోద్యమానికి పునాది తన భాషాసంస్కరణోద్యమంద్వారా గిడుగు సంస్కృత భాషాదారాలనే సవాలుచేశారు వ్యావహారికభాషోద్యమం

సామాన్యుల శ్రేయస్సు నుద్దేశించి జరిగింది కనుక మానవవాదం గిడుగు వుద్యమానికి పునాది తన సాహిత్యసంస్కరణద్వారా గురజాడ సంఘబహిష్కృతులలో ఔన్నత్యం, సంఘాధిపతులలో నైచ్యం చూపారు సాహిత్యానికి సంఘాభ్యున్నతియే ప్రయోజన మని చెప్పారు శ్రీ కిడాంబి రంగాచార్యులన్నట్లు "ప్రజాసామాన్య సారస్వత రక్తధ్వజం ఎత్తబడింది ఈ రక్తధ్వజమే పండిత వృషభములకు రక్తవస్త్రశకలం అయింది ఈ రక్తధ్వజాన్ని ఎత్తినవారిలో నగ్రగణ్యులు గురజాడ వేంకట అప్పారాయకవి" కనుక మానవవాదమే గురజాడ సాహిత్యోద్యమానికి పునాది.

ఈ మూడు వుద్యమాలలో ఏదో ఒకదాని నెదిరించినవారే లేరు ఉంటే మూటినీ ఎదిరించినవా రున్నారు శ్రీ వేదం వేంకట రాయశాస్త్రి వ్యావహారిక భాషోద్యమాన్నేకాక సంఘసంస్కరణో ద్యమాన్నికూడా ప్రతిఘటించారు శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు శ్రీ జయంతి రామయ్యపంతులుకూడ యిందులోనివారే కాని జయంతివారికి పిఠాపురం రాజావారి మద్దతువున్నది జయంతి వారు గురజాడ కావ్యాలనుకూడ దుయ్యబట్టారు కనుక యీ మూడు సంస్కరణోద్యమాల విరోధులు ఎవరయ్యా అంటే (1) సంఘాధిపత్యం కొనసాగింపదలచిన అగ్రవర్ణంవారు (2) సంస్కృతభాషను విరివిగా ప్రయోగించి జానుతెనుగును జాసీచేసి పాండిత్యం చూపి తద్వారా విజ్ఞానాన్ని గుత్తదీసుకో దలచుకున్నవారు (3) యీ సామాన్యుల వుద్యమం మధ్యతరగతి సంస్కరణకర్తలతో ఆగిపోక సమాజపు అట్టడుగున పడివున్న వారివరకూ వేరు తన్నుకొని, వారి కళ్లు తెరచి వారికి నాలుక యిచ్చి తెలివిచేసి దారిచూపి తమ హక్కుల క్రాలను లాగి వేయడానికి పూనుకునే సమగ్ర సాంఘిక విప్లవంగా పరిణమించగల దని కనుపెట్టిన పిఠాపురం రాజావంటి దూరదృష్టులు ("1911 వ సంవత్సరమున శ్రీజయంతి రామయ్యపంతులుగారు "ఆంధ్ర సాహిత్య పరిషత్తు"నుపేర నొక సంఘము స్థాపించిరి. దానికి శ్రీ వెంకటగిరి మహారాజాగారు పిఠాపురపు మహారాజాగారు వుయ్యూరు రాజాగారు మొదలగు మహాపురుషులు ప్రధాన పోష కులై వేలకొలది ధనమును విరాళముగా నిచ్చిరి' అనీ "1914 వ సంవత్సరమున దేశములో గ్రామ్యభాష నుపయోగింప వలెనా, గ్రాంథికభాష నుపయోగింపవలెనా యను సమస్య మిక్కిలి తీవ్రముగానుండెను విశాఖపట్టణము వ్యావహారిక భాషావాదుల కాటపట్టు అక్కడకు వెళ్ళి గ్రాంథికభాషను గురించి గట్టి యుప న్యాసము లీయవలసినదని (పిఠాపురము) మహారాజావారు ఉర్పు లిచ్చి నన్ను పురాణపండ మల్లయశాస్త్రిగారిని పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారిని కూచి నరసింహముగారిని పంపిరి" అనీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు తమ "స్వీయ చరిత్ర"లో రాసుకున్నారు) కాబట్టి సమాజంలో అధికారస్థానాలలో వున్నవారే యీ వుద్యమత్రయానికి అడ్డు తగిలారు కాని వేంకట రాయశాస్త్రిగారి ప్రచండ పరశువు నిరుపయోగమైపోయి. ఆ అఖండ ప్రతిభాశాలి చివరకు శిథిలాలనడుమ ఎడారిలో నిలిచిన బృహచ్ఛిలవలె వుండిపోయాడు కొక్కొండవారి "మచ్చెకంటీ బిచ్చమిచ్చువారు లేరు బొ"మ్మనే చార స్తము నవ్వులపాలయింది ఆంధ్రసాహిత్య పరిషత్తు పేరిట కొద్దిరోజులు చలామణీ అయిన జయంతివారి నాయకత్వంక్రింది పిఠాపురం రాజావారి జేబు సంస్థ నిఘంటు సేకరణ పూనుకోవలసివచ్చింది శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు విలపించినట్లు "వ్యావహారిక" భాషావాదానికి "గ్రామ్య"మని నామకరణము చేసి, గ్రామ్యశబ్దము చెడ్డదికాబట్టి గ్రామ్యభాషా ప్రచారమీ సంస్కర్తల వుద్దేశ్యమని ప్రజలతో చెప్పితే అట్టి చెడ్డభాషను ఎలాగైనా సంహరించడములో వారెంతో తమకు తోడవుతా"రని ఆశపడిన జయంతి రామయ్యపంతులు కడపటికి ఓడిపోయినారని చెప్పవచ్చును గిడుగువారు చూపిన దారి తెలుగు దేశమంతా అనుసరిస్తూ వుంది కాని ఆ నడుమ యీ వుద్యమాన్ని విడిచి వీరేశలింగంగారి వుద్యమపు వేడిమిని తీసివేసేటందుకు ప్రయత్నాలు జరిగినవి పిఠాపురం రాజాగారే దీనికిని పోషకులు కార్యనిర్వాహకులు పానుగంటి లక్ష్మీనరసింహారావు "నవ్యాంధ్ర సాహిత్య వీధులు"లో కురుగంటి సీతారామయ్యగా రన్నట్టుగా, "వీరేశలింగంగారు యువకులలో కలగజేసిన సంప్రదాయ వైర స్యాన్ని ఆపటం కొందరికి అవసరమని తోచింది దానితోబాటు సంఘంలో ఉన్న కొన్ని దురాచారాలు కూడ విమర్శిస్తేగాని పూర్వ సంప్రదాయాలమీద సరియైన ప్రత్యయం కలగడానికి వీలులేదు అంతేగాక పూర్వ సంప్రదాయాలను మూఢవిశ్వాసంతో గాకుండా తర్కమూలంగా నమ్మజెయ్యటంతో వాటిమీద అభినివేశం సకా రణమై చిరస్థాయి అవుతుంది ఈ పనికి పానుగంటివారు పూను కొన్నారు పీఠికాపురాధీశ్వరుడికి ఆస్థానకవి స్త్రీ స్వాతంత్ర్య వాదం గ్రంథ విమర్శనాపద్ధతి గ్రామ్య గ్రాంథికభాషావాదం మొద లైన సాంఘిక సారస్వతాది విషయాలన్నీకూడా యీయన విమ ర్శకు గురైనవి" కొన్ని దురాచారాలను విమర్శించి తద్వారా తామూ సంస్కర్తల జట్టులోని వాడనేననిపించుకుని తర్వాత సంస్కర్తల క్రిందికి నీళ్లు కొనిరావడం—పానుగంటివారు అచ్చ మైన ఆషాఢభూతి; కురుగంటి సీతారామ భట్టాచార్యులు పానుగంటి వారి శిష్యగణములో ఒకరు తనకనే వీరేశలింగంగారికీ గిడుగు వారికీ నడుమ గోడకట్టి చూశారు "వీరేశలింగము పంతులుగారు మత సాంప్రదాయాలను నిరసించి యువకమండలిలో వైరాస్యము ఉత్పత్తిచేసినా భాషా సాంప్రదాయాలను నిరసించలేదు ఈయన భాషాసాంప్రదాయాలకి ఒక్క ఉదాహరణ మిస్తాను "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ"మనే గ్రంథ మొకటి వ్రాసినాడు." అని

యీాయన రాశారు అయితే, వీరేశలింగము పంతులుగారే తమ స్వీయచరిత్రలో రాసుకున్నట్లు "ఇన్ని నిర్బంధములతో కుద ముట్టించిన గ్రంథము యర్థసారస్యతాది యోగ్యతలచేత నెంత మాత్రమును పొగడదగినదిగా యుండనేరదు" వీరేశలింగంగారి సులభశైలికీ, కొక్కొండవారి ప్రబంధశైలికీ జరిగిన భీషణ సంగ్రామంలో "వ్యవహారికభాషాశయమైన సులభశైలి తరపున వీరేశలింగంగారు నాయకత్వం వహించేరు తరువాత వ్యవహారిక భాషా ప్రవర్తకసమాజం అధ్యక్షత నంగీకరించి వీరేశలింగంగారు వ్యవహారిక భాషా ఉద్యమంతో ఏకీభవించి, దానికి నైతికబలాన్ని చేకూర్చారు" ("గురజాడ అప్పారావు మహాకవి మహాపురుషుడు" పెట్టి ఈశ్వరరావు) గిడుగు రామమూర్తి సహకారంతో వ్యవహారిక భాష కొక వ్యాకరణాన్నీ రాయడానికికూడా సిద్ధపడ్డారు "విషయానుగుణముగా తత్తదుచిత రీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చుననికూడ నాయభిప్రాయము"

పెట్టి ఈశ్వరరావుగారు రాసినట్లు "వ్యవహారిక భాషను వీరేశలింగంగారు ప్రహసన రచనకు మాత్రమే వినియోగించేరు ఆయననుండి అప్పారావుగారు రామమూర్తిగారు నైతికదీక్షను అలవరచుకొని, తెలుగు సంస్కృతిని పెంపొందించడానికి, వ్యవహారికభాషను వినియోగించేరు వీరేశలింగంగారు ఉంచిన ఆశాస్త్ర మునుగునుకూడా తొలగించి, వ్యవహారిక భాషకు గౌరవమైన స్థానాన్ని సంపాదించడానికి పూనుకున్నారు

గురజాడ అప్పారావుగా రొక్కరే యీ భాషాసంస్కరణోద్యమపు భావిగతిని చూడకలిగిన మహాద్రష్ట "తెనుగు భాషను పెద్ద నాగరికతా సాధనం చెయ్యాలంటే అనవసరంగా వ్యవహరింపబడుతున్న పదాలనుండీ సంస్కృతపదాలనుండీ తెలుగు భాషకు విముక్తిని కలిగించాలి పరిపూర్ణమైన వ్యవహారిక భాషను ప్రవేశపెట్టాలి చాలా కృత్రిమమైన సారస్వతభాషా నియంతృత్వంవల్లనూ అనుప్రాసముతో కూడుకొని కఠినమైన పద్యరచనా పద్ధతివల్లనూ చాలకాలమై గతించిపోయిన పురాతన సారస్వత పద్ధతులవల్లనూ తెలుగు మేధస్సు ప్రమాదకరమైన కూపంలోపడిపోయింది వ్యవహారిక భాషలో రచించబడిన సారస్వతం మన దేశంలోని రైతులను మేలుకొల్పుతుంది "అని కన్యాశుల్కం రెండవ కూర్పు పీఠికలో ఆయన రాశారు

---

# ఏరిన ముత్యాలు

## వాడుక భాష, వ్యాకరణ దోషములు

డాక్టర్ గిడుగు వెంకట సీతాపతి

గ్రంథాలలో ఉన్న భాషకు గ్రాంథికభాష అనిన్నీ వాడుకలో ఉన్న భాషకు వాడుకభాష అనిన్నీ అంటున్నాము గ్రాంథికభాష సలక్షణమయినది గనుక గ్రాంథికభాషలోనే గ్రంథరచన సాగించాలని గ్రాంథిక భాషావాదులున్నూ వాడుక భాష జీవద్భాష గనుక అందులో రచితములయిన గ్రంథాలు జనసామాన్యానికి ఎక్కువగా ఉపకరించగలవు గనుక వాడుకభాషలోనే గ్రంథరచన ఎక్కువగా సాగించవలసినదని వ్యావహారిక భాషావాదులున్నూ ఇరవై సంవత్సరాలు తీవ్రంగా వాదోపవాదులు సాగించారు నేటికి వాడుకభాషలోనే ఎక్కువగా గ్రంథరచన సాగుతూ ఉన్నది అయితే గ్రాంథిక భాషకున్నూ వాడుకభాషకున్నూ సామాన్య ధర్మాలు, వైషమ్యాలు పరస్పరసంబంధాలు మొదట ఎట్లుండెనో ఇప్పు డెట్లున్నవో కాస్త ముందుగా తెలుసుకుంటేనే కాని వాడుక భాషలో వ్యాకరణ దోషాలంటే ఏమో స్పష్టము కాదు

తెలుగు భాషలో ఏ గ్రంథమున్నూ పుట్టక మునుపు అంతా ఒకటే భాష అది కేవలము వాడుకభాషే. మొదట గ్రంథము వాడుకభాషలోనే రచితమయి ఉండాలి ఆ గ్రంథముతోనే గ్రాంథిక భాష ప్రారంభించిందనాలి మొదట కవుల రచనలతో ప్రారంభించిన గ్రాంథికభాష ఆతర్వాత కవులకు మార్గదర్శకమయినది దీనితోపాటు వాడుక భాషకూడా ఆ భాష మాట్లాడే జనుల జీవితముతో పాటు చలనం, చైతన్యం కలిగి మారుతూ వచ్చింది మొట్టమొదట వాడుకలో ఉన్న శబ్ద రూపాలే గ్రంథాలలో నిలిచివున్నా వాడుకలో మాత్రం మారుతూ వచ్చినవి

కాని, మొత్తంమీద వాడుకభాష మారినంత వేగంగాను, ఎక్కువగాను గ్రాంథికభాష మార లేదు ఇక వ్యాకరణకర్తలు ప్రాచీన శబ్దరూపాలనే ఎక్కువగా కొనియాడుతూవచ్చారు "ప్రయోగమూలం వ్యాకరణం" అనే ధర్మాన్ని అనగా కవి ప్రయోగాలను చూచుకొని వ్యాకరణ సూత్రాలను నిర్మించుకోవలసిన ధర్మాన్ని పాటించవలసిన వైయాకరణులు కొద్దికొద్దిగా మాత్రమే అర్వాచీన ప్రయోగాలను గ్రహించి వ్యాకరణ సూత్రాలను సవరిస్తూ వచ్చారు అప్పకవి కూచిమంచి తిమ్మకవి, అడిదం సూరకవి మొదలయిన లాక్షణికులు ఈ కొద్దిపాటి సవరణలయినా చేస్తూవచ్చారు అందుచేత, కావ్యాలలోని భాష మారినంతవరకయినా వ్యాకరణ సూత్రాలు సవరణ పొందలేదు

కవుల ప్రయోగాలను బట్టి వ్యాకరణ సూత్రాలను సవరించుకోవలసిన ధర్మము పాటించక పోవడమనే దోషము వ్యాకరణకర్తలందుండగా అందుకు విపరీతంగా అసంపూర్ణము అసమగ్రము లోపభూయిష్ఠములయిన వ్యాకరణ సూత్రాలను పాటించలేదన్న దోషము మహాకవులకంట కడుతూ వచ్చారు "నిత్యా ప్రవాహినీ దేశ్యా." "సిద్ధి ర్లోకాద్వ్యక్త్యా." "ప్రయోగమూలం వ్యాకరణం"—ఈ మూడు సూత్రాల యథార్థ్యమును పూర్తిగా గ్రహిస్తేచాలు సంప్రదాయసిద్ధమయిన గ్రాంథిక భాషా స్వరూపము నేటి వాడుకభాషకు కొందరనుకొన్నంత భిన్నంగా లేదనిన్నీ అట్టే దూరంగా లేదనిన్నీ బోధపడుతుంది.

ఇంతకూ, ఈ వ్యాకరణాలన్నీ గ్రాంథికభాష అంతకూ ఉద్దేశించినవి కావు గ్రంథాలలో పద్య రచనలో ఉన్న కావ్యాలలోని — అందులోను కొన్ని శతాబ్దాలకు పూర్వము వెలసియుండిన కావ్యాలలోని—భాషకు సంబంధించినవి వాడుక భాష "నిత్యా ప్రవాహిని" ఎప్పుడూ ఉండవే ఉన్నది ఎప్పుడూ ప్రవాహరూపంగానే ఉంటుంది ఎప్పుడూ మారుతూనే ఉంటుంది ఎప్పుడూ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా చైతన్యంతో జీవకళతో జనుల నాల్కలపై తాండవిస్తూనే ఉంటుంది కవులు తమ కావ్యాలలోనికి ఎక్కువగా తీసుకోకపోయినా పెక్కువిధములయిన వచనరచనలలో సాగుతూ వచ్చింది ప్రజాసాహిత్యంలో. అందులోను ఎక్కువగా జానపదగేయాలలో వికాసిత మగుతూ వచ్చింది. కావ్యాలలోని వ్యావహారిక శబ్దరూపాలనే గ్రహించడానికి సంకోచించిన వ్యాకరణకర్తలు ఈ వచనరచనలలోను జానపద గేయాలలోను గల వాడుకభాషను గ్రహిస్తారా? మొదటి గ్రంథానికి వాడుకభాషే ఆధారం నేటి కిన్నీ శబ్దసిద్ధికి వాడుకభాషే ప్రమాణం అయినా వాడుకభాష వ్యాకరణంలేని భాషండి లక్షణ విరుద్ధమయిన భాష నియమంలేని భాష "అనియమా ద్గ్రామ్యం హి" అన్నారు—అని నిరసనభావంతో ఈసడిస్తారు వాడుకభాషకు వ్యాకరణం అంటూ ఒకటి ఉండడం అసంభవం అనుకొన్నవారికి భాషాతత్వం తెలియదనాలి అడవిమొక్కలకు ఎవరికను వృక్షశాస్త్రం ఉంటుందా? అని అడిగి నట్టే ఉంటుంది వీరి వాదం పంచాంగం పుట్టక పోతే గ్రహచారం తప్పుతుందా?

అసలు వాడుకభాషకు వ్యాకరణం రచించడం సాధ్యంకావచ్చునుగాని, ఇప్పటికింకా చెప్పదగిన వ్యాకరణమొకటి రచితము కాలేదుగదా? వాడుక భాష విషయంలో వ్యాకరణ దోషములంటే ఏవి? ఏ వ్యాకరణదృష్టికి దోషాలు? అని అడగవలసి వుంటుంది కావ్యభాషకు పుట్టిన వ్యాకరణాల దృష్టికి అవి అంటే రూపాయికి మూడు బంగినపల్లి మామిడిపండ్లయితే నాలుగు రూపాయలకెన్ని రుమానీ మామిడిపండ్లు? అని అడిగినట్లుగా ఉంటుంది అసలు గ్రాంథికభాష విషయంలోనే మహాకవి ప్రయోగాలను వ్యాకరణదోషాలుగా

నిరూపించిన ఈ వ్యాకరణాల దృష్టికి వాడుకభాష మొత్తంమీద గ్రామ్యంగా కనబడుతూ ఉంటే వాడుకభాషలో ఇంచుమించు ప్రతిశబ్దరూపం వ్యాకరణదోషం కలదిగానే ఉంటుంది కనుక. ఒక భాష ఉద్దేశించిన వ్యాకరణమునుబట్టి మరియొక భాషలోని వ్యాకరణ దోషముల వెంచుట ధర్మం కాదు

వాడుకభాష కొక వ్యాకరణం నిర్మించినప్పుడు దానినిబట్టి వాడుకభాషలోగల వ్యాకరణదోషాలు నిర్ణయించవచ్చు ఐతే ఈ వ్యాకరణం నిర్మించి నప్పుడు ఎవరివాడుక, ఎక్కడివాడుక ఆధారంగా పెట్టుకొని వ్యాకరణం నిర్మిస్తారో దానినిబట్టి వ్యాకరణదోషమేదో నిర్ణయించవలసి వస్తుంది. "వాడుకభాషలో ఉన్నదంతా వ్యాకరణము గ్రహించి సూత్రాలు నిర్మిస్తూవుంటే వ్యాకరణ దోషాలింకా ఎక్కడుండగలవు." ఇంకా ఇట్టి ప్రశ్న లడగడానికి అవకాశ మేర్పడుతుంది అందుకు తగిన సమాధానం చెప్పడమే ప్రసంగానికి ముఖ్యవిషయం

వాడుకభాష ఎప్పుడూ బహుముఖంగానే ఉంటుంది. జాతులనుబట్టి వృత్తిధర్మాలనుబట్టి, సంస్కృతిలో కల తారతమ్యాలనుబట్టి శబ్దరూపాలలోను, ఉచ్చారణలోను, నుడికారంలోను కొద్దికొద్దిగా తేడాలు కనబడుతూనే ఉంటవి కొంద రుచ్చరించే రూపాలు వింతగా ఉంటవి కొందరు పలికే శబ్దాలలో మొదటిభాగమో నడిమిభాగమో చివరిభాగమో త్రుంచివేసినట్టుగాగాని, మ్రింగివేసి నట్టుగాగాని ఉంటుంది కొందరు వాడే శబ్దరూపాలు తరములనుండి అవ్యాహతంగా వస్తూవుండే రూపాలను దేలుపగా ఉంటవి కొందరు పలికే మాటలు వినేవారికే వెగటుగా ఉంటవి కొందరు సంస్కృతిలేని వెనుకబడిన జాతులవారి సంపర్కంవల్ల అలవరచుకొన్న శబ్దరూపాలే అయినా సంఘంలోగల పెద్దలముందరను సభలోను ప్రసంగిస్తూ ఉన్నప్పుడు తమ అలవాటు చొప్పునవచ్చే శబ్దరూపాలు మళ్లించుకొని పెద్దలు శిష్టులు వాడుకచేసే రూపాలు అనుకరిస్తూ ఉంటారు ఒకేవ్యక్తి పిల్లలతో మాటాడినప్పుడు వాడుకచేసే భాషకు, కూలీలు మొదలయినవారితో మాటాడినప్పుడు విడావంగా మాటాడే భాషకు తేడా ఉంటుంది ముఖాముఖిగా ప్రసంగిస్తూ ఉన్నప్పుడు మాటలు మ్రింగివేసినా అభినయం సహాయంతో అర్థంకాగలదన్న నమ్మకంతో సగం సగంగా మాటాడతాము పరిచితులతో మాటాడి నప్పుడు ఎక్కువ స్పష్టంగా మాటాడతాము. ఈ ఎక్కువతక్కువలు లెస్సగా గ్రహించి వాడుక భాషలోగల శబ్దరూపాలందే కొన్ని మేలయినవి. వింతైనవి, సభ్యమైనవి అనిఎంచి కొన్ని లొత్తిగా గ్రామ్యములనీ, అసభ్యములనీ త్రోసిపుచ్చి కొన్ని ఆయా జాతుల ప్రసంగాల నిరూపణకే కాని ఉత్తమరచనలకు పనికిరావనీ తెలియజేస్తూ వ్యాకరణాలు రచించవచ్చును అయితే. ఇది చాలా చిక్కయిన పని. ఇందులో రెండువిధాల కష్టా లున్నవి వ్యాకరణ రచనకు పూనుకొన్నవారు ఏవి ఈ భాష మాటాడేవారందరికీ సమానముగా ఉండే రూపాలో, ఏవి మండలాలనుబట్టి మారుతూ ఉంటవో, ఏవి తరములనుండి అవ్యాహతంగా వస్తూ ఉన్నవో ఏవి సంస్కృతిగల శిష్టులు పలి కేవో ఏవి కేవలం పామరులు పలికేవో, ఏవి ఇతరభాషల సంపర్కంవల్ల తెలుగు నుడికారము నకు భిన్నంగా ఉన్నవో—ఈ మొదలయిన విష యాలన్నీ లెస్సగా గ్రహించాలి

ప్రజాప్రభుత్వ రాజనీతి వాతావరణంగల ఈ కాలంలో అందరూ సమానులే శిష్టులే గనుక ఎవరి వాడుకను వ్యక్తపరచినా వారికి ఆగ్రహావేశం కలుగుతుంది. అట్టి ఆగ్రహావేశాని కవకాశ మీయకుండా శబ్దరూపాల ఔచిత్యానౌచిత్యములను నిర్ణయిస్తూ వ్యావహారిక భాషావ్యాకరణం రచించవలసి యున్నది ఇంతకూ ముమ్ముందుగా వ్యాకరణ ప్రయోజనమేదో గుర్తించాలి వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, మనశ్శాస్త్రం వంటిదే వ్యాకరణ శాస్త్రం కూడాను ప్రత్యక్షంగా గోచరిస్తూ వున్న విషయాలను క్రోడీకరించి వర్గీకరణం చేసి. వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం నిర్మించినట్లే శ్రవణగోచరమయిన భాష అంతా పరిశీలించి వ్యాకరణ శాస్త్రం నిర్మించాలి శాస్త్రమన్న పేరు కలిగివున్నామేకాని ఈ శాస్త్రాలలో ఏదిన్నీ రాజశాసనంవలె శాసించేది కాదు లేనిది పుట్టించలేదు ఉన్నది కాదన లేదు వ్యాకరణశాస్త్రం చేయగల పనియేమి? నుడికారం ఏలాగున్నదో శబ్దరూపాలు—అనగా నామవాచకాలు, సర్వనామాలు, విశేషణాలు, క్రియా విశేషణాలు, అవ్యయాలు, క్రియారూపాలు, సమాసాలు సంధికార్యాలు కారకాలు మొదలయినవి ఏవిధముగా ఉన్నవో వివరించి తెలియజేయడమే వ్యాకరణం చేయవలసిన పని.

తెలుగుభాష మాతృభాషగా మాటాడేవారితో గ్రంథరచన సాగించడానికి పూనుకొన్నవారు సంస్కృతిగలవారై ఉంటారు. విద్యాసంపన్నులై ఉంటారు. వారికి వారిచెవి. వారివాడుక తెలుగు నుడికారం తెలుసుకొనే విషయంలోను, శబ్ద సౌష్ఠవం గ్రహించే విషయంలోను సహాయకము లుగా ఉంటవి. వారికి రచన విషయంలో ఏ వ్యాకరణ సాహాయ్యం అక్కరలేదు కావ్యపరిజ్ఞానం కోసం కావ్య మర్యాదా జ్ఞానములకోసం మాత్రమే వ్యాకరణశాస్త్ర పరిచయం కావలసివస్తుంది గ్రంథ రచన ఒకకళ కనుక. ఏపదం ఎక్కువ మాటిగాను, ఇంపుగాను ఉంటుందో పెద్దల వ్రాతలను బట్టి స్వానుభవంవల్ల తెలుసుకొంటారు గ్రంథ రచయితలు అయినా వాడుకభాషలో గ్రంథ రచన సాగించినప్పుడు వ్యావహారికభాషా వ్యాకరణ దృష్టికి వ్యాకరణ దోషాలనదగినవి ఎట్టివి కనబడు తున్నవో దిఙ్మాత్రసూచనగా రెండు మూడు తెలియజేస్తాను

"ఐక్యత" "ప్రాముఖ్యత"వంటి దుష్టరూపాలు నేటి వ్రాతలలో కనబడుతున్నవి. సంస్కృత భాషాలక్షణము తెలిసినవా రీతప్పుచేయరు జన సామాన్యవ్యావహారిక భాషలో ఈ శబ్దరూపాలు ప్రయోగించడం జరగదు అయితే, ఎవరి వ్రాతల లోను, మాటలలోను ఈ అపప్రయోగాలు కన బడుతున్నవో వారేమంటారు: "ఏదో వాడుక లోనికి వచ్చింది; తప్పేమిటి: అంతా వాడుకభాషే కదా" అంటారు అస లక్షరాస్యులు నూటికి పది మంది ఆ పదిమందిలోను ఇద్దరు రచయితలు. ఆ ఇద్దరిలోను ఒకరు సంస్కృతభాషా పరిచయం గలవారే కనుక ఈ తప్పు చేయరు పోగా, నూటికి ఒక్కరు అనాలోచితముగా తెచ్చిపెట్టి నప్పుడు వాడుకభాష అనే మిషతో తక్కినవారం దరు ఒప్పుగా గ్రహించాలనడం ధర్మంకాదు ఇటువంటి తప్పులు దిద్దుకోవడం మంచిది.

"అవుతుంది" అనే అర్థంలో కొందరు "బొద్ది", అని వ్రాస్తున్నారు ఎవరో సంఘంలో వెనుక బడిన జాతులవారు ఎక్కడనో పలుకుతున్నారు పాత్రోచితంగా సంభాషణలో చూపించదగిన ప్రయోగమేకాని ఇది ఉత్తమరచనలో చేరవలసి నదికాదు. "మా అన్నాయి క్రిందటిమాసం కలకత్తా వెళ్ళారు నిన్ననే వెళ్ళిపోద్దారు"— అంటారు గంజాం, విశాఖపట్నం జిల్లాలవారు. కొందరు వచ్చేవాడనే అర్థంలో "వాడు రేపు వస్తుదు" అంటారు చెన్నపట్నంలో అరవతెలుగు మాటాడేవారు. ఇటువంటి అపురూపములు హాస్యా స్పదములు అయిన శబ్దరూపాలను వ్యాకరణ దోషాలుగా ఎన్ని చూపించవచ్చును, "మీరవ్వు

డెక్కడుంటిరి" అంటారు కొందరు కోస్తా జిల్లాలవారు "ఎక్కడ ఉంటిరి" అనాలి లేదా, "ఎక్కడ ఉన్నారు" అనాలి రాయలసీమలో బాల వాచికలైనా, వెనుకబడిన జాతులవారయినా ఈ తప్పు చేయరు కొన్ని కర్తరియాపాలు వ్యాకరణ దోషాలు కలవే అయినా వాడుకలో వ్యాప్తిచెంది నిలిచి ఉంటే అవి గ్రాహ్యాలే అవుతవి.

"నేను కాపీ తయారించాను" అని వ్రాస్తున్నారు కొందరు "తయారు చేయించాను" అని ఎక్కువగా పలుకవక్కరలేకుండా సులువుగా "తయారించాను" అంటున్నారు ఇట్టి ప్రయోగాలు నేడు వ్యాకరణ దోషాలుగా కనపడినా మరికొంత కాలానికి సాధురూపములు కావచ్చును అందు చేతనే వ్యాకరణముకూడా భాషతోపాటు మారుతూ ఉంటుంది అనాలి వ్యాకరణదోషమంటే ఏమో తెలుసుకోవలెనంటే భాషాతత్వం ముందుగా తెలుసుకోవాలి

—వాణి (22.2.1953)

## వివాహానికీ, కుటుంబానికీ సంబంధించిన సోవియట్ చట్టాలు

సోవియట్ కుటుంబంలో భార్యాభర్తల మధ్య పూర్తి సమానత్వం వుంది. పరస్పర గౌరవం స్నేహం ప్రేమ అనే పునాదులమీదనే సోవియట్ కుటుంబం నిర్మింపబడింది

కుటుంబ స్థిరత్వాన్ని సోవియట్ ప్రభుత్వం కాపాడుతుంది చట్టరీత్యా భార్యాభర్తలకు తమ హక్కులలోనూ, బాధ్యతలలోనూ పూర్తి సమానత్వముంది స్త్రీల హక్కులకు భంగం కలిగించ కూడదు; పిల్లలను పెంచడంలో భార్యాభర్త లిరువురికీ సమానబాధ్యత వుంది

వివాహానంతరం సంపాదించిన ఆస్తిమీద దంపతులిరువురికీ సమాన హక్కుంటుంది. దంపతులలో ఒకరు అశక్తులైతే రెండవవారికి వారిని పోషించే బాధ్యత వుంటుంది. బాధ్యతారహితంగా ప్రవర్తించడంవల్ల కుటుంబశ్రేయానికి భంగం కలిగించడం, గర్భం పోగొట్టుకోవాలని స్త్రీని బలవంత పెట్టడం, పిల్లలను పోషించకపోవడం సోవియట్ చట్టరీత్యా తీవ్రమైన నేరాలు.

సోవియట్ దేశంలో వివాహం, శ్రామికప్రజా ప్రతినిధుల స్థానిక సోవియట్‌కు చెందిన సివిల్ రిజిస్ట్రేషన్ ఆఫీసుల్లో రిజిస్ట్రేషన్ చేసుకోవడంతో జరుగుతుంది వివాహం జరిగినట్టు వారిద్దరి పాస్‌పోర్టులలోను వ్రాయబడుతుంది

సోవియట్ కుటుంబాన్ని బలపర్చడానికి, తల్లీ పిల్లల శ్రేయస్సును కాపాడడానికి సోవియట్ చట్టం, కోర్టులో కేసుపెట్టడంద్వారా, తీవ్రమైన కారణాలున్నప్పుడు మాత్రమే విడాకులను అనుమతిస్తుంది దంపతులలో ఏ ఒక్కరు కోరినా విడాకుల కేసు విచారణ రహస్యంగా జరుగుతుంది

విడాకులు అనుమతించడం న్యాయమని కోర్టు భావిస్తే తల్లిదండ్రులలో ఎవరు పిల్లలను వుంచుకోవాలో తీర్పులో స్పష్టం చేస్తుంది భార్యాభర్తల మధ్య ఆస్తిని పంపకం చేస్తుంది; వారి పూర్వపు ఇంటిపేర్లను కావాలంటే మళ్లీ పెట్టుకోనిస్తుంది

ఒక వివాహాన్ని రద్దుచేసుకోకుండా పునర్వివాహం, బహుభార్యాత్వం ఒక భర్తకన్నగాని, ఒక భార్యకన్నగాని ఎక్కువమందిని వివాహమాడడం (బైగమీ) చట్టరీత్యా నిషేధింపబడ్డాయి

—సోవియట్ యూనియన్ (22-1953)

## ఆంధ్రకు జరుగుతున్న అన్యాయం

చెన్నపట్నం గురించి జరుగుతున్న ఆందోళన సంరంభంలో ఆంధ్రదేశానికి ఇతరత్రా జరుగుతున్న అన్యాయాలు అంతగా గమనించడం లేదు ముఖ్యంగా ఆస్తి అప్పుల పంపకాలు తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతం వీటిగురించి ఆంధ్రదేశ నాయకులు తగిన జాగ్రత్త తీసుకోవడం లేదు ఈ సందర్భంలో ఆంధ్రదేశానికి వాస్తవంగా ఉపకారం చెయ్యగలిగే స్థితిలో ఉన్న తెలుగుమంత్రులు తమ బాధ్యతను ఎరిగి గుర్తుతెలిసి వ్యవహరించడం లేదు

ఆంధ్రరాష్ట్రం ఆదాయ వ్యయాల విషయంలో మద్రాసు ప్రభుత్వం 1951-52 లెక్కల్ని ఆధారంగా తీసుకుని ఆంధ్ర రాష్ట్రానికి లోటు అంటగట్టి జస్టిస్ వాంఛూగారికి అందజేసింది వాంఛూగారు ఈ లెక్కల్ని ఆధారంగా తీసుకునే ఆంధ్రరాష్ట్రంయొక్క ఆర్థిక స్థితిగతుల్ని భారత ప్రభుత్వానికి నివేదించారని తెలుస్తోంది (ఆంధ్ర రాష్ట్రానికి అయిదుకోట్లు లోటుంటుందని, ఈ లోటు భర్తీచెయ్యడంకోసం మద్యనిషేధాన్ని రద్దు చేయాలని భారత ప్రభుత్వానికి నివేదించినట్లు వాంఛూగారు విజయవాడలో పత్రికా విలేకరులకు చెప్పారు) ఆస్తి అప్పుల పంపకం విషయంలో 1949 పార్టిషన్ కమిటీ నివేదికను ఆధారం చేసుకుని ఆతరువాత నాలుగేళ్ళలో పెరిగిన ధరలమేరకు సవరణలు చేసి, అదేమాదిరిగా పంపకాన్ని భారత ప్రభుత్వానికి వాంఛూగారు సూచించినట్లుకూడా తెలుస్తున్నది

రాజాజీ ప్రభుత్వం తయారుచేసిన అంచనాలలోని గూఢపుజాలీ కొంత కాకపోతే కొంతైనా తెలుగు మంత్రులకు తెలియనిపోదు తమ ప్రతిష్ఠ నిలబెట్టుకోవడంకోసం 1949 పార్టిషన్ కమిటీ పంపకాల పద్ధతే సరైనదని వాదిస్తున్న శ్రీ నీలం సంజీవరెడ్డి శ్రీ కళా వెంకట్రావుగార్లకు ఆనాటి తంత్రాలూ తప్పుడులెక్కలూ తెలియకపోవు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తథ్యమని తెలిసిన తరువాత 1949 నుండీ తమిళ మంత్రులు ఆంధ్రదేశానికి చేస్తున్న అన్యాయం వీరందరికి తెలుసు నిర్మాణం కానున్న ఆంధ్రరాష్ట్రాన్ని వీలైనంత వరకూ బలహీనపరచాలనీ చేజిక్కినంతవరకూ ఆస్తిసంపదల్నీ ద్రవ్యాన్నీ అంకింపుకుపోవాలనీ తమిళమంత్రులు ఎన్నిన ఎన్నాగాన్ని బయటపెట్టి ఆంధ్రదేశానికి న్యాయం చేకూర్చడానికి కృషి చెయ్యడం తెలుగు మంత్రుల కర్తవ్యం తమిళ ఘటా రాజకీయాలకోసం దేశానికి అన్యాయం జరుగుతుంటే ప్రత్యక్షంగానో పరోక్షంగానో మౌనవ్రతంవల్లనో ఈ అన్యాయానికి తోడ్పడే తెలుగునాయకుల నేమనాలి?

వెంటనే రాష్ట్ర నిర్మాణావకాశాన్ని వినియోగించుకోవాలని తరుణం పోకుండా రాష్ట్రం సాధించడమే ప్రధానలక్ష్యమనీ తలంచి సంజీవరెడ్డి వెంకట్రావుగార్లు 1949 పార్టిషన్ కమిటీలో కొన్ని నరిపడని షరతులకు తలొగ్గి ఉండవచ్చు వారు చేసిన చర్యలను సమర్థించలేకపోయినా, ఆనాడు రాష్ట్రనిర్మాణంకోసం కృషిచేసిన వారి చిత్తశుద్ధిని ఎవరూ శంకించరు ఇప్పుడా అన్యాయాలను అరికట్టే అవకాశం లభించినప్పుడు, ఈ తరుణంలోకూడా తమిళుల ఎరిపాలనాధికారాన్ని వినియోగించి మరింత అన్యాయానికి ఒడిగడుతున్నప్పుడు ఈ నాయకులిద్దరూ హృదయం విప్పి సత్యాసత్యాలను దేశానికి ఎరుక పరియ చేయవలసి ఉన్నది.

ప్రజలను విశ్వసించని రాజనీతిలో చిత్తశుద్ధికి స్థానంలేదు. మద్రాసు ప్రభుత్వం ఇచ్చిన తప్పుడు లెక్కల్ని వాంఛూగారు స్వీకరించి భారత ప్రభుత్వానికి నివేదించినట్లు తెలిసిన ఈ సమయంలో తెలుగు మంత్రులూ, కాంగ్రెస్ నాయకులూ మిన్నకుండడం దేశానికి ద్రోహంచేసినట్లవుతుంది.

శ్రీ కెన్నేటి విశ్వనాథంగారు మద్రాసు ప్రభుత్వపు అంచనాలలోని తంత్రాలను బయటపెట్టారు. కరువుకోసం వెచ్చించబడిన మొత్తంలో అత్యధిక భాగం తెలుగుజిల్లాలపేర ఖర్చు వ్రాయబడింది. తమిళ జిల్లాలలో వెచ్చించినదెంతో సరిగ్గా లెక్కలు లేవు. ఇరిగేషన్‌వల్ల రాబడి వసూలుచేసేందుకు ఒక పద్ధతి, విద్యుచ్ఛక్తివల్ల రాబడి వసూలుకు మరొక పద్ధతి పాటించి రెండింటా అధికభాగం తమిళ నాడుకే కలుపుతున్నారు. అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం కేటాయింపులూ భారత ప్రభుత్వమిచ్చే మొత్తాలలో పంపకాలకొక పద్ధతి ఎన్నుకోవడంగా కేంద్రంనుంచి రాష్ట్రానికి వచ్చే వాటా పంపకానికొకపద్ధతి పెట్టి మొత్తంమీద ఆంధ్రదేశానికి రావలసినదాన్ని తగ్గించి చూపారు. బోగాకు పన్నులో రావలసిన వాటాని మరీ తగ్గించి చూపారు.

ఇరిగేషన్ వర్క్సువరంగా వచ్చే ప్రభుత్వపు అప్పులవరంగా వచ్చే పరిశ్రమలు, సివిల్‌వర్క్సు వరంగా ఖర్చులను 1951-52లో తేలిన లెక్కలు కంటె 1952-53 అంచనాలు, పెరిగిన పెరుగుదల మూడుకోట్ల రూపాయలూ, తెలుగు జిల్లాలపై రుద్దినప్పటికీ కాని లోటు అయిదు కోట్లకు తేలదని విశ్వనాథంగారు వివరించారు. అంటే ఈ అదనపు ఖర్చు మూడు కోట్లూ తెలుగు జిల్లాలలో ఎక్కడ కనబడుతోందో రాజాజీ సుబ్రహ్మణ్యం రంగారెడ్డిగార్లకే తెలియాలి. ఈ తప్పుడులెక్కల్ని బయటపెట్టుతూ ఆస్తి అప్పుల పంపకాలనూ ఆదాయ వ్యయాల అంచనాలనూ (ఏనాడిమధ్యలో విభజన జరుగుతుంది కాబట్టి వీటికిగూడా అవసరమే) చూడ్డానికి ప్రత్యేకంగా ఒక కమిషన్ నియమించాలని శ్రీ కెన్నేటి విశ్వనాథంగారు సూచించారు. ఈ సూచనను ఆంధ్రదేశమంతటా బలపరచడం అవసరం.

రెండో అంశం తుంగభద్ర ప్రాజెక్టుకు సంబంధించినది. ఆంధ్రరాష్ట్ర విభజనకు ప్రధానమైన ఆధారం భాషారాష్ట్ర సిద్ధాంతమే. అంతమాత్రాన పరిపాలనా సౌకర్యమూ, ఆర్థికాభివృద్ధికి గల అవకాశాలను కూడా వివరాల పరిశీలనలో విస్మరించకూడదు. రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ ఈ సందర్భంలో చెప్పిన మాటలతో అందరూ ఏకీభవిస్తారు. అయితే అభివృద్ధి అవకాశాలు, పరిపాలనా సౌకర్యాల పేరుతో భాషా రాష్ట్రాల మూలాధారాన్నే కొట్టిపారవేసే తంత్రాలను దక్షిణాదిన ఒక్క ప్రాంతానికి చెందినవారు మినహా మిగిలినవారందరూ ప్రతిఘటిస్తారు. స్థూలంగా భాషారాష్ట్ర విభజన సిద్ధాంతాన్ని అంగీకరిస్తే ఆపైన విభజన జరిపే సమయంలో సరిహద్దుల నిర్ణయాలనూ వైపరీత్యస్థితినీ, ఆర్థికాభివృద్ధి అవకాశాలనూ, పరిపాలనా సౌకర్యాన్నీ గమనించక తప్పదు. ఆంధ్రరాష్ట్ర విషయంలో కూడా ఈ అంశాలను గమనించాలి.

ఈ అంశాలదృష్ట్యా తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో చేరడం అవసరం. పార్టిషన్ కమిటీ నివేదిక ప్రకారం మూడు తెలుగు తాలూకాలు మినహా బళ్ళారి జిల్లా అంతా తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంతోసహా మిగులు రాష్ట్రంలో ఉండాలి. దీనివల్ల బళ్ళారిజిల్లా మిగులు రాష్ట్రానికి దూరమైపోవడమే కాక ప్రాజెక్టు ప్రాంతాన్ని తమిళుల అధీనంలో ఉంచడం ఆంధ్ర రాష్ట్రానికి క్షేమంకాదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తథ్యమని తెలియగానే పరిపాలనా వ్యాసంగాన్ని దాదాపు స్తంభింపచేసి ఆంధ్రదేశంలోని విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని బలహీనపరుస్తున్న తమిళ మంత్రులను విశ్వసించడం మంచిదికాదు. అంచనాలనుమించి ఖర్చు అవుతున్నందువల్ల ఖర్చు తగ్గింపను రాజాజీ ప్రభుత్వానికి ఆంధ్రదేశంలోని విద్యుచ్ఛక్తి కేంద్రాలే కనబడుతున్నాయి. దక్షిణాదిన గత మూడు మాసాల్లో ఖర్చు తగ్గింపు నిమిత్తం 872 మందిని పనినుంచి తొలగిస్తే బెజవాడలో 2500 మందిని తొలగించారు. ఈ అక్రమాన్ని సహించలేకపోయిన శ్రీ కళా వెంకట్రావుగారు ఆంధ్రదేశానికి జరుగుతున్న అక్రమాలవిషయంలో మౌనం వహించడం ఆశ్చర్యకరం.

భారత ప్రభుత్వం వాంఛూ నివేదిక పరిశీలన ముగించి నిర్ణయాలకు రాకముందే కమిషన్ ఏర్పాటు అవసరాన్ని తెలియపరచడం అవసరం. అపకారం జరిగిపోకముందే శ్రీ వెంకట్రావు, శ్రీ సంజీవరెడ్డివంటి నాయకులందరూ వాస్తవ పరిస్థితిని ప్రజలకు నివేదించడం అవసరం.

—స్వతంత్ర, (ఫిబ్రవరి 20 '53)

## వాషింగ్టన్‌లో భారతీయ మతాలకు ప్రాతినిధ్యం

భారతీయ మతాలకు ప్రాతినిధ్యం వహించే వాషింగ్టన్‌లోని ఒక మతసంస్థ నిర్మించిన ఆలయాన్ని గురించి బొమ్మలతోసహా శుక్రవారంనాటి వాషింగ్టన్ స్టార్ పత్రికలో ఒకవ్యాసం ప్రకటించబడింది. ఈ ఆలయ నిర్మాణానికి 75 000 డాలర్లు ఖర్చయినాయి. ఆ వ్యాసంలో ఈ సంస్థకు చెందిన వాషింగ్టన్‌లోని సభ్యుల కృషిచేత ఇది నిర్మించబడినదని, కొద్ది సంవత్సరాల క్రిందట స్వామి యోగానంద భారతదేశంలో నడిపిన సంస్థలో వీరంతా సభ్యులని వ్రాయబడింది. బాస్టన్ నగరంలో 1920 లో జరిగిన కాంగ్రెస్‌లో స్వామి యోగానంద భారతదేశానికి ప్రాతినిధ్యం వహించారు. అది జరిగిన రెండు సంవత్సరాల తరువాత వాషింగ్టన్‌లో కొంతమంది సభ్యులతో ఒక ప్రత్యేక సంస్థను నిర్వహించారు. ఇప్పుడు దాని అధిపతి స్వామి ప్రేమానంద. ఈయన కలకత్తా నివాసి. ఈయన ఇక్కడకు 1925 లో వచ్చారు. కలకత్తా విశ్వవిద్యాలయంలో పట్టభద్రులయారు. వేదాంతంపైన మతంపైన అనేక గ్రంథాలు వ్రాశారు. ఈ ఆలయంలో 200 మంది కూర్చొనే అవకాశముంది. ఒక గ్రంథాలయం కూడా వున్నది.

—అమెరికా వార్తావాహిని. (8 3-1953)

—•—

# సన్నగిలుతూన్న సంస్కృతి

టి వి కమలామణి

క్రన్నుల కగుపడకముందే వలపు వాసనలతో ఆహ్వానించే పుష్ప సముదాయాన్ని చూడడము జీవితపు మధురానుభూతులలోనిదని ఎవ్వరికైనా అనిపించకమానదు చిన్నప్పుడు మా తాతగారి తోటనుంచి వచ్చిన మల్లె గులాబుల్ని పళ్లెంనిండా పోసుకొని దగ్గిర పెట్టుకుని చూస్తూ కూర్చుండే చెక్కిలి కానించుకుండే—ఆ సుగంధపుష్పాలు ఏదో చెప్పలేని సౌఖ్యం సంతోషం కలిగించేవి అటువంటివి ఇంకా ఎన్నెన్నో రకముల పూల మొక్కలతో ప్రదర్శనం నిండియుంటుందనీ ఒక అపురూపపు ఆనందానుభూతి కలుగుతుందనీ ఆశించి మొన్న జరిగిన పుష్ప ప్రదర్శనం చూడబోయాము

ప్రదర్శనంలో పూలమొక్కలకు కొదువ లేదు; బోగన్‌విల్లాలు డేలియాలు,యాస్టర్లు ఇంకా ఇంకా ఏవేవో విదేశీయమైన పుష్పలతాగుల్మాదులూ మధ్యమధ్య మన మెట్ట తామరలలాటి పూలమొక్కలూ—ఏ చిత్రకారుని ఊహాపీఠికి అందని వింతవింత రంగుల కలయికతో మున్నవి ఎన్నెన్నో కోసి కొమ్మల కుండలతో కొమ్మలు పెట్టి ప్రదర్శనారామమంతా నింపారు చిన్న చెంరే లాగున్న వాటన్నిటినీ అల్లంతదూరంలో మందగా చూచి సృష్టికర్త నైపుణ్యానికీ వాటి నంతప్రేమతో పెంచినవారి శ్రద్ధకీ ఆశ్చర్యపడుతూ పూలమొక్కల మధ్యను తిరుగడంవల్ల ఆనందదాయక మేముంటుందనుకుంటూ వాటిని చేరబోయాము కాని ఎంతసేపు తిరిగినా దేనిదగ్గరకు పోయినా కన్నులకు విందేగాని మనసుకు నే నాశతో ఎదురుచూచిన ఆనందంమాత్రం కలుగలేదు ఒక్కదానికైనా సువాసనన్నదే లేదు దగ్గరిగాపోయి ఏది మూచూచినా వగరువాసన కొట్టి ముందుకు మరొకమారు ప్రాణాలన్న కోరికే నశింపజేసే వెనుకకు తగ్గ బుద్ధి పుట్టించేవి ఎంతోసేపు తోటంతా తిరిగి వెతకి జూచాను కాని ఉత్సాహ ముదికించి మైమరపించే వాసనతో విరియబూసిన మల్లె మాలతి విరజాజి తుప్పలుగాని "కో" అని కేకవేసి కనుపడకుండా దాగి నవ్వే కొంటె పిల్లలాగ ఎక్కడనో ఉండగానే తన ఘాటైన వాసనతో దగ్గరకు రమ్మని పిలచి ఆకులసురుగునదాగి దోబూచులాడే సంపెంగ పూబొదలుకాని తేనెలు చిందుతూ సువాసనలు చిమ్ముతూ చూడ సుందరంగా జలజల పువ్వులురాల్చే పొగడ పారిజాతపు గున్నలు గాని అసలు పువ్వులుగూడా అలంకరణ కుపయోగపడుతూ మరురాణి అని పిలుపబడే గోరింటదుబ్బులుగాని ఆకుపోనే రసికత్వమంతా యిముడ్చుకుని సరసాలాడే మరువం దవనం తొట్లుగాని ఎండినా వాడినా సువాసన పీడని అపురూపపు వట్టివేరు కురువేరులు గాని ఒక్కటికూడా అక్కడ కనుపడలేదు పుష్పప్రదర్శనాలు ఇలాగు జరిగితే ప్రజాసామాన్యంలో ఒక ప్రత్యేక కళాభిరుచి సంస్కారం పెరుగుతుందనీ దేశశోభ వృద్ధి జెంది తీరుతుందనీ ఏవేవో ఆలోచనలతో వెళ్లిన నాకీ ప్రదర్శనం జూచేసరికి ఈ విధంగానేనా మనదేశ శోభాసంస్కృతులు పెరుగబోయేది? అనిపించి నిరుత్సాహంతో ప్రాణం చివుకుమంది. దేశీయములైన పరిమళ పుష్పాలనికూడా పుష్పప్రదర్శనలో చేర్చాలని ప్రదర్శకులకు తోచని కారణమేమిటి? ఈ విపరీతపు అభిరుచుల కర్థమేమిటి?

సువాసన లేకున్నా సుందరమైన రంగులతో చూడ సొంపుగానుండే పరదేశపు కుసుమజాతులని కొన్నిటిని ప్రదర్శనంలోనికి తెచ్చిపెట్టవలసినదే కాని ప్రదేశమంతా వాటితోనే నింపి కంటితో చూచినా ముక్కుతో మూచూచినా సురుచిరములై మనసు కాహ్లాదం కలిగించే మనదేశపు పరిమళ పుష్పజాతులకు రవ్వంత స్థానమైనా ఈయనిదానికేమనాలి? ఆ డేలియా, యాస్టరు యిత్యాది కుండ్లపాటు నిండుగా మొగ్గదొడిగిన ఓ నాలుగుబొండుమల్లెలు ఓ రెండు రేరాణులు అంటుగట్టిన ఒక్క గోరింట కుండీలను గూడా చేర్చితే ఆ ప్రదేశమంతాగూడా ఘుమఘుమ వాసనలతో నిండిపోయి ఆ నిర్గంధ కుసుమాలకి కూడా ఒక క్రొత్త విలువతెచ్చి ఉండునే. వాటన్నిటినీ సర్వసాధారణమని నిస్సాకారముతో విసర్జించినారేమో అనుకుందామంటే పచ్చనిగడ్డి కళ్లబడడం అపురూపముగా నుండే పట్టణాలలో అటువంటి పూలమొక్కలు సర్వసాధారణ మెలాగవుతాయి? అంతేగాదు సాధారణపు వాటినైనా అసామాన్య పద్ధతిగా పెంచి విరివిగ పూయించడంలో ఒక విశేషం లేదా? అది కష్టసాధ్య మనుకున్నారేమోనంటే కోరదులుగా అల్లుకునే బోగన్‌విల్లాలలాంటివి కూడ చిన్నచిన్న కుండ్లలో గుబురుగా పెరిగించి విరియబూయించినారే. అయితే, చంద్రిక ఖండాలులాగ మిలమిల మెరుస్తూ మైమరపించే వాసనతో తియ్యటి ఊహలు రే త్తించే మల్లె మాలతి ఇత్యాదుల నావిధంగా

పెంచి ప్రదర్శించడం సంస్కృతిరాహిత్య మనుకున్నారు గాబోలు; కొంతవరకూ విదేశీయములే ఐనా వాసనగలవని ఏయో గులాబీ రేరాణీ లాటివాటిని ఆదరించడం మాని అశ్రద్ధ చేస్తున్నారు; అతుల అంద చందాలలో తక్కువ ఫెరన్స్ కి తీసిపోక పోయినా సుగంధపూరితములన్నీ తప్పకా మరువం, దవనాలను వెలిబెట్టివేశారు; ఒక్క పూతతోనే భ్రతుకాకరై పోయె విదేశీయ నిర్గంధపుష్ప జాతులనేగాని ఒకమాటు నాటితే వరుసకి కొన్ని ఏండ్లు స్థిరముగా నిలిచి కాలం రాకను సూచిస్తూ ఋతుశోభని పెంపొందిస్తూ నయన ఘ్రాణేంద్రియాలను రెండింటికో ఆనందం కలిగించే మల్లె సంపంగి, గులాబి, గోరింట మొదలైన సుగంధ పుష్పజాతులని చిత్రవిచిత్ర పద్ధతులగా పెంచడం విశేషముగా వృద్ధిచేయ డం ఆరామ కోశ కవసరమేలేనట్లనుకుంటు న్నారు; చిత్రమే!

ఈమధ్య దేశనాయకు లనబడేవారంతా సమయం దొరికినప్పుడల్లా అయినదానికీ కానదానికీ "విదేశ వ్యామోహం కూడదు మనదేశ సంపద జాతీయ సంస్కృతి పెంచితీరాలి" అని విధీ విరామములేకుండా ఉపన్యాసాలిస్తూ తల గోరెత్తించేస్తున్నారు అనేక విజ్ఞాన గ్రంథాలతో విలసిల్లే పాశ్చాత్య భాషని వద్దని వెలిపెట్టుతూన్న ఆదేశపు నిర్గంధకుసుమాలని మాత్రం ప్రయాసతో పెంచ ప్రోత్సహిస్తూ మన సభ్యతాసంస్కృతుల నొక వింతదారిని పట్టిస్తున్నారు అదే దేశాభ్యుదయమని వారి ఆశయము గాబోలు;

కాలం జరిగినకొలదీ ప్రాతవానితోపాటు కొన్ని క్రొత్త వస్తుసముదాయాలూ సాంప్రదాయాలూ మిశ్రమై వాడుకలోనికి రావడం అన్ని దేశములలోనూ ఉన్నదే అది అభిలాషణీయమనికూడా చెప్పవచ్చును ఏమంటే వివిధదేశ వస్తువిశేషాలూ ఆచారవ్యవహారాలూ కలగాపులగమైనప్పుడే దేశ సంపదా సభ్యత అభివృద్ధిచెందుతాయి అయితే ఏవిగాని ప్రాతవైనా క్రొత్తవైనా స్వదేశీయమైనా విదేశీయమైనా జీవితాన్ని త్తేజింపచేయ కలిగినవీ కళాపూరిత సంస్కారాన్ని పెంపొందించ కలిగినవీ అయితేనే దేశాభ్యుదయం కలుగుతుంది

పుష్పప్రదర్శనాలు జరుపవలసన్నది విదేశీయపు వేడుక కన్నులకు విందుగానున్నా విరియబూసి ఎదురుగానున్నా మోదుగ తంగేటి పూలను కానని ఎవరి వెతికివేసారియైనా నెత్తాళ్ళు గుప్పే సంపంగినో సున్నితమైన వాసనలతో సొక్కించే మల్లె సన్నజాజాలనో సిగ్గుపైధరించే ఆర్యసంస్కృతి మనది ఈరెంటినీ సరిగా సమన్వయించి సాగిస్తే దేశ సౌభాగ్యం పెంపొంది తీరుతుంది అంతేగాని సుగంధ పుష్పజాతుల నన్నిటినీ త్రోసిరాజని నిర్గంధ కుసుమాలనే ఆదరగౌరవాలతో పెంచి ప్రదర్శింప ప్రోత్సహించడము దేశాభ్యుదయ కారణమైన ఆర్య సంస్కృతి సూచకముకాదు అపారమైన అభిరుచులను పెంచుతున్నారనీ కళామయ సంస్కృతి పన్నగిల్లుతూన్నదనీ అంటే అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు;





# హిరోషిగే
## (ప్రాచీన జపాను ప్రకృతి శిల్పి)

సంజీవ దేవ్

మానవజీవితంయొక్క పవిత్రాశయాల్లో ఒకటి ప్రకృతిని జయించటం భౌతికశక్తిని మానవజాతికి సేవచేసేలాగా వినియోగించటం, మనను చుట్టుముట్టివున్న దేశకాలాలను అతిక్రమించటం అయివుంది ఇలాంటి నిరంతర సాధనాధారస్మరణాతీతకాలంనుంచి సృష్టిలో ప్రవహిస్తూవస్తూన్నా మానవు డింతవరకు ప్రకృతిని సంపూర్ణంగా జయించలేకపోయినాడు అసలు ప్రకృతిని చిన్నచూపు చూడటంవల్లకాని లేక నిర్లక్ష్యపరచటంద్వారాకాని మానవుడు ప్రకృతిని జయించలేడు అందుకనే సర్వకాలాల్లోని ద్రష్టలూ ప్రకృతిని గౌరవించటంలోను ఆరాధించటంలోను ఆనందాన్ని సంధానించారు ప్రకృతిని ద్వేషించటంద్వారాకాక ప్రకృతిని ప్రేమించటంద్వారా మాత్రమే దాన్ని జయించగలం అని వారంతా సమగ్రంగా తెలుసుకోగలిగారు ప్రకృతిని ఆదరించటం ఆరాధించటం దాన్ని జయించటానికీ అతిక్రమించటానికీ సులభమైన కిటుకు దృశ్యప్రకృతియొక్క సౌందర్యం అపార్థివతత్వంయొక్క అదృశ్యశోభను వ్యక్తపరచే శక్తి కలిగివుంది

ప్రకృతి సౌందర్యాన్ని ఆదరించి ఆరాధించేవాళ్లలో చిత్రకారులు ప్రత్యేకజీవులయి వున్నారు ఇలాంటి ప్రకృతిశిల్పుల్లో జపానులో పద్దెనిమిది పందొమ్మిది శతాబ్దాల్లో జీవించిన హిరోషిగే నక్షత్రాల్లో చంద్రునిలాంటివాడు ఆయనకున్న అద్భుతమైన ప్రకృతిప్రేమ, అంతకంటె మించి ప్రకృతిలోని వివిధవర్ణస్థాయిలను చిత్రించటంలో ఆయనకున్న నైపుణ్యం చాల విశేషమయినవి కనుకనే హిరోషిగే 'మంచు వర్షం చంద్రుడు" చిత్రించటంలో సిద్ధహస్తుడని ప్రఖ్యాతిచెందాడు

జపాను శిల్పచరిత్రలో టాకూగవా కాలం (క్రీ శ 1568-1867) పురాతనానికీ నూతనానికీ సంధికాలం ఈ కాలంలోనే జపానువారి జీవితంమీదినుంచీ శిల్పంమీదినుంచీ చీనావారి ప్రాబల్యం దిగజారిపోతొచ్చింది జపాను శిల్పులు పారంపర్యంయొక్క బంధనాలనుంచి తమనుతాము విముక్తపరచుకోజొచ్చారు అడ్డంకులేని స్వచ్ఛందపంథాలో ఆత్మాభివ్యక్తిని స్పష్టపరచుకొనేందుకు కఠిన సాధన ప్రారంభించారు ఇదేకాలంలో జపానుశిల్పంలోని సగం-కల్పనావాదం సగం-వాస్తవవాదంలోకి మారసాగింది ఈ కాలంలోనే జపాను చిత్రరచనలో ఒక నూతన సాంప్రదాయం స్థాపితమయింది ఈ నూతన సాంప్రదాయం పేరు "ఉకియోయీ" అంటే తేలిపోయే జగత్తుయొక్క బొమ్మలని అర్థం యీ "ఉకియోయీ" సాంప్రదాయంయొక్క లక్ష్యం జీవితంలోనీ ప్రకృతిలోనీ వాస్తవస్వరూపాన్ని చిత్రించాలని అంటే దాదాపు డచ్చివారి "genre painting" అనబడే నిత్యజీవిత చిత్రణలాంటిది, పదహారో శతాబ్దంలో ఇవాసా మతాబీ అనే శిల్పి యీ "ఉకియోయీ" సాంప్రదాయాన్ని ప్రతిష్ఠించాడు

"ఉకియోయీ" సాంప్రదాయపు ఆవిర్భావంతో జపానులో శిల్పంయొక్క ప్రజాతంత్రీకరణ ప్రారంభం అయింది అన్ని వర్గాల ప్రజలకు చిత్రాలు అందుబాటులో వుండేలాగా "ఉకియోయీ" శిల్పులు చేతితోవేసే చిత్రరచనకు బదులు మరొక నూతన పద్ధతిని అవలంబించారు ఈ నూతనపద్ధతి సుందర రచనతోనూ సువిశిష్ట వర్ణంతోనూ విరాజిల్లే జపానువారి రంగు అద్దకాల (Japanese Colour prints)ను ప్రపంచానికి ప్రసాదించింది ఈ రంగు అద్దకాలను సృష్టించటానికి మూడురకాల మనుషులు అవసరం మొదటివాడు అసలు శిల్పి ఇతను తన మనోచిత్రాన్ని కాగితంపైన రేఖల్లో గీస్తాడు రెండోవాడు కొయ్యతో అచ్చుల్ని చెక్కే వడ్రంగి మూడోవాడు వీటిని ముద్రించే అచ్చుపనివాడు జపాను రంగు అద్దకం యీ మూడు రకాలవారి శ్రమకు ఫలితం

ఈ రంగు అద్దకం పద్ధతిమూలాన అన్నివర్గాల మనుష్యులకూ తమతమ అభిమాన శిల్పియొక్క చిత్రాల్ని సంపాదించటంలో ఎక్కువ ధనం వెచ్చించాలసిన అవసరంలేకుండా సులభం అయిపోయింది ఈ పద్ధతిమూలాన జపానులో శిల్పం సర్వసామాన్యం అయిపోయింది రంగు అద్దకంవల్ల చిత్రాల్లో మూలానికీ పునర్ముద్రణకూ భేదంలేకుండాపోయింది కారణం, రంగు అద్దకంలోని అన్నిప్రతులూ మూలంక్రిందనే లెక్క అయినా మొదటి ముద్రణకూ తరువాతి ముద్రణలకూ కొంత భేదం వుంటుంది

రంగు అద్దకాల క్షేత్రంలోకి హిరోషిగే ప్రవేశించకపూర్వం ఈ రంగు అద్దకాలు చాల తేలికదృష్టితో చూడబడుతుండేవి :

కారణం ఎంతవరకు వాటిని సృష్టించటంలో ఉపయోగపడుతున్న విషయవస్తువులు చాల చౌకబారుగానూ, సంస్కృతిశూన్యంగానూ వుంటూవుండేయి ప్రసిద్ధశిల్పి అయిన హొకూసైయొక్క ప్రయత్నాలు అదివరకే రంగుఅద్దకాల్లోని యీ చౌకబారుతనాన్ని కొంతవరకు తొలిగించినయి ప్రత్యేకించి హిరోషిగేయొక్క అద్భుత ప్రకృతిరచనలు "ఉకియోయీ"సాంప్రదాయానికీ అందులో కూడ ముఖ్యంగా రంగు అద్దకాలకూ ఒక విశిష్టమహత్తును కలుగ జేసినయి

జపానులోని సంధ్యానమయాల్లో దట్టమవుతూన్న పొగ మంచు చాటున దూరంగా అస్పష్టరూపంలో వెనుక్కుజారిపోతూన్న చెట్లూ ఇండ్లూ కుంభవర్షపు ధారలక్రింద అజగురూపాల్లో నిద్రిస్తున్న గొప్ప కొయ్యవంతెనలూ చంద్రునియొక్క పెరుగుతూన్నా తరుగుతూన్నా వివిధదశలూ మందహాసంచేసే చెర్రీచెట్లూ వికసిస్తూన్న విల్లోవృక్షాలూ జపానునగరాలా వల్లెలా వీధుల్లోనూ చెట్లమీదా ఎడుతూన్న పాలలాంటి తెల్లని మంచూ ఫ్యూజీపర్వతం యొక్క ఎప్పటికప్పుడు మారే స్థాయీలూ ఊగిసలాడే వెల్లి దుబ్బులూ వెదురుపొదలూ ఆలాపిస్తూన్న మిందారీ బాతులూ, సుమీదానదియొక్క నిశ్శబ్దజలాలమీద తేలిపోతూన్న పడవలూ మొదలైనవెన్నో దృశ్యప్రకృతిలోని సుందర దృశ్యాలను హిరోషిగే తన రంగు అద్దకాల్లో వ్యక్తపరిచాడు

ప్రొఫెసర్ నొగూచి మాటల్లో 'హిరోషిగేయొక్క శిల్పం ప్రకృతిచిత్రణకు సంబంధించినంతవరకు శిల్పాన్నిగురించిన మన ప్రాచీనభావాలనే అనుసరిస్తుంది ఆయినా చాలావరకు హిరోషిగే ప్రకృతికీ మానవులకూ తన చిత్రాల్లో (రంగుఅద్దకాల్లో) ఐక్యత చేకూర్చాడు యీ ఐక్యత క్రిందితరగతి ప్రజల్లో బాగా గోచరిస్తుంది జపాను చిత్రరచనలో పర్వతాలూ నదులూ చేతితో చిత్రించే చిత్రకారులు ప్రకృతిని ప్రకృతినిమిత్తమే ప్రశంసిస్తారు కాని హిరోషిగే అలాకాకుండా ప్రకృతికి మానవత్వాన్నిచ్చి దాని చేత మానవభాషను పలికించాడు

చీనా జపానులోని చేత్తో చిత్రించిన సంప్రదాయసిద్ధమైన ప్రకృతిదృశ్యాలు ఏకాంతంయొక్క రాగాన్ని ఆలాపిస్తయి కాని హిరోషిగేయొక్క రంగు అద్దకపు ప్రకృతిదృశ్యాలు జానపదవాతావరణంలో భావగీతాన్ని వినిపిస్తవి హిరోషిగేయొక్క ప్రకృతి దృశ్యాలు ప్రకృతిలోని గంభీరమైన ఏకాంతభావాన్ని కాక మానవమయమైన ప్రకృతిలోని సాంఘికస్వరూపాన్ని వ్యక్తపరుస్తయి మనుష్యనివాసంనుంచి దూరమైపోయిన గంభీర ఆరణ్యాల్నీ పర్వతాల్నీ ఆయనెప్పుడూ చిత్రించలేదు ఇలాంటి గంభీరదృశ్యాల్ని చీనావారూ ఆటుతరువాత జపానులోని చేత్తో చిత్రించే చిత్రకారులూ చిత్రించారు హిరోషిగే చిత్రాలు మానవాత్మక ప్రకృతి దృశ్యాలు

1797 లో యెడో నగరం (నేటి టోకియో)లో హిరోషిగే జన్మించాడు ఆయన తండ్రి చాలా ప్రతిభాశాలి ప్రత్యేకించి విలువిద్యలో సిద్ధహస్తుడు అందువల్ల ఆయన తండ్రి యెడో నగరంలో విలువిద్యనునేర్పే పనిలోనే వుంటుండేవాడు హిరోషిగే బాల్యం నుంచీ శిల్పవిషయాల్లో చాలా ఆసక్తి కనుపరుస్తుండేవాడు ఇంటి ఎద్ద మామూలుశిక్షణ పూర్తిఅయినతరువాత ఒకాజిమా రిన్సాయి అనే చిత్రకారునివద్ద హిరోషిగే చిత్రరచన సాగించాడు పదిహేను సంవత్సరాల వయస్సున హిరోషిగే తన మొదటిగురువు అయిన ఒకాజిమా రిన్సాయిని వదలి సుప్రసిద్ధ "ఉకియోయీ" శిల్పి అయిన టొయొకునియొక్క చిత్రశాలలో ప్రవేశించటానికి ప్రయత్నించాడు కాని అందులో ప్రవేశం లభించలేదు అందువల్ల చివరకు టొయోహిరోదగ్గర శిష్యుడుగా ప్రవేశించాడు

1810 లో తనను పెంచుకొన్న తల్లిదండ్రులు చనిపోవటం వల్ల ఫైర్‌బ్రిగేడ్‌లో తన పెంపుడుతండ్రి ఇదివరలో చేస్తున్న ఉద్యోగంలో ప్రవేశించాడు అటు చిత్రరచనాభ్యాసం ఇటు ఉద్యోగం రెండూ చేయాలవాచ్చింది పది సంవత్సరాలపాటు ఫైర్‌బ్రిగేడ్‌లో పనిచేసి అందులోనుంచి తొలిగి హిరోషిగే తన శిల్పసృష్టిలో నిమగ్నుడయినాడు యెడోనుంచి క్యోటోకు టొకైడో రాస్తావెంట ప్రయాణంచేసి ఆ మార్గంలోవున్న అద్భుత ప్రకృతి దృశ్యాలను "టొకైడోలోని 53 దృశ్యాలు" అనే పేరుతో రచించాడు హిరోషిగే ఒక సమూరాయ్ వంశపు వనితను వివాహం చేసుకొన్నాడు ఒక కొడుకు కలిగినతరువాత ఆమె చనిపోయింది హిరోషిగే మళ్లీ పెళ్లిచేసుకొన్నాడు ఆయన కుటుంబజీవితం అంత సఫలం అయిందని చెప్పటానికి వీలులేదు ఆయన ఆర్థికదశ కూడా అంతే రాబడికంటే ఖర్చు మెండు

హిరోషిగే కవికూడ మధ్యమధ్య కవిత అల్లుతుండేవాడు హిరోషిగేలోని యీ కవితారసమే ఆయన ప్రకృతిచిత్రాన్ని కవిత్వమయం చేసినయి హిరోషిగే ప్రతిభగల సంగీతకారుడు అయితే ఆయన సంగీతం అంతా దృశ్యసంగీతమే శ్రావ్యసంగీతంకాదు ఆయన సంగీతం రంగులమయమేకాని రాగమయంకాదు అసలు, రాగం అంటే రంగు అనే అర్థంగా ఆయన రచించిన "ర్యోగోకూ వంతెనవద్ద సాంధ్యచంద్రుడు' అనే బొమ్మ ఆయనలోని ఉత్తమ సంగీతాన్ని వినిపిస్తుంది। ఈ అర్థంగావున్న బొమ్మ ఆయన చిత్రనైపుణ్యానికి మనోహరమైన తార్కాణం, ఆయన వర్ణసమ్మేళనం వర్ణవైరుధ్యం చాల కమనీయంగా వుంటవి ఈ బొమ్మలో శరత్ సంధ్యయొక్క మృదులకాంతి ఎడోక్కులయొక్క అంతిమగీతాన్ని ఆలాపిస్తుంది వెలవెలలాడే పెద్ద చందమామ క్రమేణ క్షితిజ రేఖదాటి పైకొస్తూంది కొన్ని మబ్బుపింజలు అస్తమించిన సూర్యకిరణాలు తాకి ఇంకా ఎర్రబారే వున్నయి ముందుభాగంలో

విరిచివున్న బ్రహ్మాండమైన నీలిరంగు కొయ్యవంతెనకూ మృదువైన సంధ్యాకాంతిలో దూరంగా అస్పష్టంగా వెనక్కు జరిగిపోతూన్న వెనకభాగంలోని చిన్నచిన్న ఇళ్లూ చెట్లూ మొదలైన వాటికీ ఒక వ్యతిరేక లయ నిర్మించబడింది ఈ బొమ్మలో మొరటుగా సున్నితానికీ వ్యతిరేక సమ్మేళనం ఏర్పరచబడింది నీటి యొక్క నీలానికీ సంధ్యాకాంతియొక్క మీగడరంగుకూ రమ్యమైన సామరస్యం సాధించాడు హిరోషిగే తన యీ బొమ్మలో

హిరోషిగే రచనల్లో అక్కడక్కడ పాశ్చాత్యదృష్టిక్రమం (Prospect've) గోచరిస్తుండటం చాల విచిత్రం తన యవ్వనదశలో రచించిన "ర్యోగూకూ వంతెనవద్ద సాంధ్యచంద్రుడు' అనే బొమ్మలో యీ పాశ్చాత్యదృష్టిక్రమం విశదంగా గోచరిస్తుంది దీని ముందుభాగంలో నిలిచివున్న గొప్ప కొయ్యవంతెన వెనకభాగంలో వున్నదానికంటె పెద్దవస్తువులన్నిటినీ కప్పివేసింది హిరోషిగే ఆవిర్భవించకముందే జపాను చిత్రజగత్తులోకి పాశ్చాత్యదృష్టిక్రమం ప్రవేశించింది కాని జపానులో దానికంతగా పోషణ దొరకలేదు హిరోషిగే యీ పాశ్చాత్యదృష్టిక్రమాన్ని తన బొమ్మల్లో ఏ కొద్దివాటిల్లోనో పరిశోధన నిమిత్తం వాడిచూచాడు అంతేకాని ఆసియాఖండపు చిత్రసాంప్రదాయాలను తన స్వతంత్రఎంతమాత్రంకూడ కాపాడుతూనేవచ్చాడు

హిరోషిగే రచించిన మరొక అద్దంగావున్న చిత్రం "షోనో" అనేది ఇది ఆయన ఉత్తమచిత్రాల్లో ఒకటి ఇందులోని రంగు చాల సున్నితంగావుంటుంది ఆకుపచ్చతోకూడిన బూడిదరంగు దీనిలోని ప్రధానవర్ణం ప్రకృతిలోని శీతలవర్ణంయొక్క ఆధిక్యాన్ని మనుషుల శరీరాలకూ గొడుగులకూవున్న లేతనారింజరంగూ ఎముపురంగులద్వారా పరిచేశాడు ఆపాక గాలివాన రోజా రైతులూ పల్లకీబోయీలూ ఆ పర్వతమార్గంగుండా కదలివెళుతున్నారు ప్రతివాళ్లూ వర్షానికీ గాలివానకూ భయపడివున్నారు మార్గంవెంటవున్న వెదురుపొదలు ప్రకృతియొక్క యీ రౌద్రరూపం చూచి గజగజ వణుకుతూన్నాయి ఏటవాలుగావున్న మార్గానికీ మూలరేఖలుగా పడుతున్న వర్షధారలకూ మధ్య విషాదంతో వూగుతూన్న వెదురుపొదలద్వారా ఒక రమ్యమైన వ్యతిరేక సమైక్యత సాధించబడింది ఈ చిత్రంలోని దృశ్యం వానరోజునవుండే తడి వాతావరణపు సుగంధాన్ని ప్రేక్షకులకు అందిస్తుంది హిరోషిగే ప్రకృతిలోని వాతావరణస్థాయిలను చిత్రించటంలో చాల నేర్పరి అలాంటి లలితమైన వాతావరణస్థాయినే మనం యీ "షోనో" అనే చిత్రంలో అనుభవిస్తాం

హిరోషిగేయొక్క అడ్డంగావున్న చిత్రాలకంటే నిలువుగావున్న చిత్రాలు ఇంకా ఎక్కువ రమ్యంగా వుంటవి ఆయన చిత్రాల అధికసంఖ్య నిలువు చిత్రాలే వీటిలో "నెలవంక" అనేది చాల మనోహరంగా వుంటుంది ఇది సన్నని పొడుగైన చిత్రం రెండు నిటారైన కొండగోడల మధ్యనున్న సన్నని లోయగుండా జలపాతం పడుతూంటుంది వెండివిల్లులాంటి బాలచంద్రుడు ఆ రెండు కొండగోడల మధ్యగా దిగజారిపోతున్నాడు ఆ జలపాతాళం బాలచంద్రుడితో అనుమేళవించబడింది

హిరోషిగేయొక్క ఆఖరిచిత్రాల్లో "కిసోజిసో యమాకవా" (మంచులో కిసో పర్వతాలు) అనేది శిరోమణిలాంటిది ఇది మూడు భాగాలుగా కలిపి రచించిన చిత్రం పందొమ్మిదో శతాబ్దపు ప్రకృతి దృశ్యచిత్రాలన్నిటిలోనూ ఇదే మిన్న అనికూడ ప్రసిద్ధి దీన్ని కళ్లతో చూడాలసిందేకాని మాటలతో చెప్పటం కుదరదు హిరోషిగే సృష్టించిన చిత్రాలు అసంఖ్యాకం

హిరోషిగే మనిషిగాకూడ చాల మంచివాడు ఆయన జీవితం చాలాభాగం కష్టాలగాథగావున్నా ఆయన చిత్రసృష్టిమాత్రం ఆనందధారగానే ప్రవహించింది అప్పటి మిగతా జపాను శిల్పంపనివాళ్ళకు హిరోషిగే మంచి సంస్కృతిసంపన్నుడు తన జీవనసంధ్యలో కన్‌ఫ్యూషియన్ నైతికసిద్ధాంతాన్ననుసరించి తలగొరిగించుకొని సన్యసించాడు

1851 లో హిరోషిగే కలరా తగిలి మరణించాడు ఆయన స్థూలశరీరం చీకటిమాటున దాటయిపోయినా ఆయన సూక్ష్మశరీరంమాత్రం ప్రవహిస్తూన్న సెలయేళ్ళనూ క్రింద రాలుతున్న మంచునూ జోరున కురిసే వర్షధారల్నీ నెలవంకనూ చెర్రీ పూలనూ సదా వెన్నంటివుంటూనే వుంది ।



—***—

# శూన్య హస్తం

వేటపర్ల కామేశ్వరరావు

## 1

"ఏమండోయ్! మీవాడు శృంగారకవి చాలా ప్రయోజకుడనిపించుకున్నాడు చివరికి" అన్నాడు భద్రగిరి శివరూపయ్యతో.

వారిద్దరూ ఒకే రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్నారు.

శివరూపయ్య స్వస్థలమైన కాకినాడకి వెళుతున్నాడు. భద్రగిరికూడ కాకినాడకే సొంత పనిమీద బయలుదేరేడు. వారిద్దరికి అదివరకు కించిత్తు పరిచయముంది. కాని శృంగారకవి కారణంగా అది బలపడింది.

శివరూపయ్య కాకినాడలో పచారీకొట్టు (పాన్సీషాపు) పెట్టుకొన్నాడు. వ్యాపారం చురుకుగా సాగుతూంది. అతని కొడుకు శృంగారకవి ఏవో అల్లిబిల్లి పద్యాలు అల్లుతూంటాడు.

భద్రగిరిది రాజమహేంద్రవరం. పట్ కలెక్టరు కచ్చేరీలో గుమాస్తా. కవిత్వమంటే చెవికోసుకొంటాడు. ఉత్సాహమంతటితో ఆగలేదు. శూన్యంవైపు చూస్తుంటాడు. మధ్యమధ్య ఏవేవో గిలుకుతుంటాడు. తనది కవికులమని చెప్పి జుట్టు ఒత్తుగా పెంచేశాడు. బారెడు పెంట్రుకలూ కావు. గిరజాలూ కావు. జులపాలు! నడివయస్సులో ఉన్నాడు.

"ఏమిటోనండి! ఎంత చెప్పినా విన్నాడు కాదు చివరికి!" అన్నాడు శివరూపయ్య కొడుకైన శృంగారకవిని గురించి.

"దానికేముంది లెండి! కోమటి బిడ్డ! అదీ ఒక వ్యాపారమే! వ్యాపారమనేది ఉగ్గుపాలతో పెట్టిన విద్య!" అని కొంచెం ఒత్తేడు.

శృంగారకవి మదరాసులో ఒక వాఙ్మయ పత్రికను స్థాపించేడు. దానిని గురించి స్నేహితులిద్దరూ ముచ్చటించుకొంటున్నారు.

"తెలిసీతెలియని వ్యాపారమండి పంతులుగారూ! ఇంటపుట్టినది కాదండీ!" అన్నాడు తండ్రి సంశయంతో.

"నేను ఇంతకీ ఆశ్చర్యపోయేదేమంటే —అతనికి కవిత్వపు దృష్టే కాకుండా వ్యాపారదృష్టి కూడ ముక్కుబంటిగా ఉంది. దానిని తలచుకొన్నకొద్దీ ముగ్ధుడనవుతున్నాను" అన్నాడు భద్రగిరి.

"పంతులుగారూ! మీరెన్ని చెప్పండి. అది మనకు అచ్చిరాదండి!" అనేశాడు.

"బంగారువంటి కోమటి
సంగీతమునేర్చి బేరసారములవిగెన్'

అనే నానుడి పూర్వంనుంచి ఉందనుకోండి! అయినా కాలవ్యత్యాసాన్ని కూడ మనం గమనించాలి! బెండులు మునింగి గుండులు తేలెన్ అని మరొక కవి అన్నాడు. ఈ కాలంలో బ్రాహ్మణ యువకులు కాఫీ షాపులు పెట్టుకోటంలేదూ చెన్నపట్టణంలో? అట్లాగే కాలాన్నిబట్టి మారుతూంటాయి! అన్నాడు భద్రగిరి.

"ఏ కిళ్ళీకొట్టో పెట్టుకొని ఇన్ని సోడా కాయలు చల్లగా షీటిలో పడేసుకొని కూర్చుంటే సాయంత్రానికి పెధవ రెండు రూపాయల డబ్బులు రాకపోయేనా! నాగన్న చెప్పితే విన్నాడుకాదు!" అన్నాడు తండ్రి అర్ధవిచారంతో.

"ఇంతకీ దేనిలో అయితే ఏమిటి సెట్టిగారూ బాగుపడడానికి!" అని వ్యవహార విషయంగా మాట్లాడేడు భద్రగిరి.

కాలుతూన్న చుట్టని పళ్ళమధ్య దోర్లిస్తూ శివరూపయ్య "నాకు తెలియక అడుగుతాను కావండి అయ్యగారూ! దాంట్లో లాభం ఉంటదంటారండి!" అన్నాడు.

"రేపే మిద్దెలు మేడలు కట్టాలంటే కుదరదు. నింపాదిగా ఫలిస్తుంది. మొదట నాలుగైదేళ్లపాటు గంగలో పోసినట్లు పోసెయ్యాలి! పొలానికి ఎముకలపొడి వేస్తారు చూశారూ! అలాగు మొదట పోసేస్తే ముందుకి పనిచేస్తుంది!" అన్నాడు భద్రగిరి.

"అయ్యబాబోయ్! అంతకాలమే!" అన్నాడు సెట్టిగారు. నోటిలో చుట్టమాట పరిచిపోయి అది గుడ్డలమీద పడగా గబగబా దులుపుకొని "ఏరోజుకారోజు వచ్చే లాభం పోగొట్టుకొని ఇదెందుకు వచ్చిన పనో చెప్పండి" అని చిరాకు పడ్డారు శివరూపయ్య.

"దీనిలో స్వామి కార్యం స్వకార్యంకూడ తీరతాయి. అక్కన్న పెళ్లిలో మాదన్నకొకపోచ అన్నారు. మొదట మనిషికుండే కవిత్వపు తీట వదలుతుంది. రెండోది పేరు ప్రతిష్ఠలు వస్తాయి. కాకియై కలకాలం బతికేకంటె హంసయై ఆరునెలలు బతికితే మేలు

అన్నారు పెద్దలు ఇంక మూడో లాభం లోకాన్ని ఉద్ధరించడం అదేకాదటండి మనిషి పుట్టుకకి ముఖ్యం! శ్రీకృష్ణుడంతటి వాడే లోకాన్ని ఉద్ధరించడం కోసం మళ్ళీ మళ్ళీ పుడతానన్నాడు" అని భద్రగిరి తన జ్ఞానాన్ని వెలిబుచ్చేడు

వ్యవహారజ్ఞుడైన పెట్టి "వీళ్ళంతా లోకాన్ని ఉద్ధరించేవాళ్ళే నా బొంద! పుట్టిన బిడ్డని ఎన్నెమ్మ కొట్టకుండా ఉంటే చాలా విష్ణాలు గడిస్తే దేవుడు చల్లగాచూస్తే పెళ్లి కావచ్చు పిల్లలు కలుగవచ్చు మనుమల నెత్తవచ్చు ఇంకా ఎన్నెన్నో జరగవచ్చు అయన్నీ జరిగినప్పుడు చూసుకుందాం" అన్నాడు

"మొత్తంమీద మీవాడు చేసగల మనిషే సెండి దేనికదే చెప్పుకోవాలి!" అని భద్రగిరి అతనికి ధైర్యం చెప్పదలచేడు

పంతులుగారూ! చేప ఈ లోకంలో ఎవరికి లేదో చెప్పండి! ఇప్పుడు నాకో లక్ష రూపాయలుంటే వ్యాపారాన్ని పదిరెట్లు పెంచేసెయ్యనూ? మీమట్టుకు మీరు బి ఏ పాసయినారుకదా అరవై రూపాయల ఉద్యోగంలో పాతుకపోవడమేమి వచ్చింది? డిప్టి కలెక్టరీ చేస్తూ ఆరువందల రూపాయలు తెచ్చుకోరాదూ! చేప ఎవరికిలేదండి పంతులు గారూ? ఏపనికైన స్తోమత మొదట అవసరం తమరు సెలవిచ్చినట్లు నాలుగైదేళ్ల పాటు కళ్లు మూసుకొని గంగలో పోసెయ్యమంటే నాతరమా నన్ను పుట్టించిన అమ్మ వారి తరమా?" అన్నాడు సెట్టి

"ఇప్పటికి అమాంబాపతు ఏమాత్రం అయిందంటారు "

"నా ఎరికను అయిదువందలేనా పెట్టుబడుంటుంది!"

"బాగానే ఉంది కాని కొంచెం ఓపిక పట్టాలి తొందరపడితే పనులవవు!" అని సలహా చెప్పాడు భద్రగిరి ఇంతటిలో సామర్లకోట స్టేషన్ వచ్చింది హడావిడిగా లేచేరు ఎవరిదోవ వారిది కాకినాడ ప్లాట్‌ఫారం గేట్‌లో కలుసుకోలేదు

## 2

పెట్టి గారుకైన శృంగారకవి చెన్నపట్టణంలో కైలాసపతిమొక్క ముద్రాశాలలో "వాణీపదం" అనే మాసపత్రికను అచ్చు వేస్తున్నారు దానికోసం పత్రిక ఆఫీసు కోసం ముద్రాశాలకి సమీపంలోనె ఒక చిన్న గది బాడుగకు తీసుకొన్నాడు హోటేలు భోజనం పత్రిక వ్యవహారం బాడుగగది మకాం

చూటకూళ్లయ్య ఇంటిలో సాపాటు ముగించుకొని శృంగారకవి కైలాసపతి ముద్రశాల చేరుకొని కిళ్లీ నములుతూ సిగరెట్టు దమ్ములాగుతూ ఆలోచనా జగత్తులో విలిచిపోయేడు అది కవి లక్షణమని అతని భావం

చేతిలో కాగితాలు కిందపడవేసి కైలాసపతి "అయితే శృంగార కవిగారూ మీ అసలు పేరు సెలవిచ్చేరు కాదు!" అన్నాడు

"అంటే" అని భావం విశదపరచమని కోరేడు శృంగారకవి

"మిమ్మల్ని లోకమంతా శృంగారకవి గారే అంటుంది కాని అసలుపేరు తెలుసుకోలేకపోతూంది శృంగారకవి అనేది మీ ఇంటిపేరని కొందరు మీపేరని కొందరు మీ ఊరిపేరని కొందరు మీ గోత్రమని కొందరు మీ బిరుదని కొందరు ఈలాగు వివిధాభిప్రాయాలుగా పోతున్నారు" అని అంటూండగా శృంగారకవి అడ్డువచ్చి

'ఎవ్వరేమన్న నంద్రు నాకేమి కొదవ
పేరు పెట్టుకొన్నె శృంగార కవిని"

అన్నాడు

అతని ఆశువు విని కైలాసపతి దంగయిపోయి కైలాసాన్ని చేరుకొని తిరిగివచ్చి "మనలో మనమాట! అసలుపే రేమిటంటారు?" అని అంతరంగాన్ని అందుకొన్నవాడిలాగు అభినయించేడు

అందుకు శృంగారకవి—

"అసలు పేరన్నదెవరికి? అసలు వినలు
అన్యదేశ్యాలు కవికులమందె లేవు"

అన్నాడు

ఇతను కస్తూరి కవిని మించి గోరోజన కవిలాగున్నాడని తలంచి కైలాసపతి గప్‌చిప్‌గా కూర్చున్నాడు

శృంగారకవి వ్యవహారకాండలోకి దిగి "కైలాసపతిగారూ! మా పత్రిక పని చివరికి వెనకపెట్టేశారు" అన్నాడు

"అచ్చెచ్చె! ఎంతమాట! సినీమాపాటల బొక్కు రేపటికెల్లా అచ్చంటు అంటూ మెడమీద కూర్చున్నారు మూడు రోజులలో ఫిల్ము రిలీజయిపోతుంది ఆ తొందరమీద ఉన్నాను అంతేకాని మన పత్రిక పని జరగడ మెంతసేపు! పనివాళ్లందరికీ ఒక పూట ఆదేపని అప్పజెప్పేమంటే టక్కున అయిపోతుంది ' అన్నాడు కైలాసపతి

"మనది నకాల మాసపత్రిక అన్నది మరిచిపోకండి! ఎకాలానికి రాకపోతే పలుగురూ నవ్వుతారు" అని లోపలి బాధను కొంత వెళ్ళగక్కేడు శృంగారకవి

"అయితే సకాలంకాని పత్రికంటూ ఒకటుందా యేమిటి నాకు తెలియక అడుగుతున్నాను సకాలానికి రాకపోతే పోస్టల్ అథారిటీసే మొదట ఒప్పుకోరు వాళ్లతోనే పేచీలు వస్తాయి!"

"అట్లాగు ఏవిధమైన చిక్కులూ తెచ్చుకోని పత్రిక అని అనుకొందురూ సరిపోతుంది" అన్నాడు కోపటి బిడ్డ

"అయితే మేటర్ అంతా సిద్ధంగా ఉందా మరి!"

"ఇంకా అడుగుతారు? మేటర్ కెప్పుడూ లోపం ఉండదు ఉండబోదు అని హామీ ఇస్తాను గంగ పొర్లివచ్చినట్లు వస్తూంటుంది మేటరు ప్రోజెక్టులు కట్టినా నిలబడదు పైగా కొట్టిపారేస్తుంది

"అయితే మీరాగండి మొదట ఈ మాట సంపాదకీయం దేనిని గురించి తల పెట్టేరు?" అని ప్రశ్నించేరు ముద్ర శాలాధికారి

"అదే చూస్తున్నా! మనకి రాజకీయాలంటే బొత్తిగా కిట్టవు. ఎవరు కిందపడ్డా ఎవరు మీదపడ్డా ఒక్కటే. వాటిలోపడిపోతే పార్టీ అల్లరులలో పడిపోతాం సాంఘిక ఆర్థిక వాఙ్మయాలలో ఏదో ఒకటి తీసుకొని దంచిపారేస్తా" అన్నాడు సంపాదకుడు

"బానులెండి! రాజకీయాలలో దిగిన దగ్గిరనుంచి ఒకరు మిత్రుడయితే ఇంకొకడు శత్రువవుతాడు కాబట్టి దూరంగా ఉండడమే మంచిది మీరు విడిచిపెట్టడమే మంచిపని చేశారు" అని మెచ్చుకొన్నాడు కైలాసప

శృంగారకవి దేనిని గురించో ఆలోచిస్తుండగా కైలాసపతి "శృంగార కవిగారూ! మీ ఏసూళ్లు సరిగానె ఉంటున్నాయా?" అని యథాలాపనగా అడిగేరు

"అది సరిగాఉంటే వేరే చెప్పవలసినదేముంది పతిగారూ! నిజం చెప్పవలసివస్తే ఇప్పటికి ఒక్క దమ్మిడీ వసూలు కాలేదంటే నమ్మండి!" అని సెట్టిగారు ఉన్నదున్నట్లు వెల్లడిచేశాడు

"శృంగార కవిగారూ! నేను మీకాసంగతి పేపరు ప్రారంభించేటప్పుడే చెప్పేను నా కళ్లతో నేను చూశాను ఎన్నెన్నో పత్రికలు పుట్టడం గిట్టడం! పత్రికాప్రచురణమ నమ్ముకొని పాడైపోయినవాళ్లు ఒకళ్లు ఇద్దరూ కాదు బాబూ! అబ్బబ్బ! మిమ్మల్ని అంటున్నానని అభిప్రాయపడేరు సుమండీ! ఎంత మాత్రమూ కాదు! అదొక ఎండమావులు! ఆఖరికి జూదంకూడ కాదు సుమండీ! జూదంలోకూడ ఇంకా ఛాన్సు ఒకటుంది దీనిలో దిగడమేకాని లేవడమంటూ లేదు చేతిలో ముద్రాశాల ఉండికూడ నేను ఎందుకు పత్రిక పెట్టడానికి వెరస్తున్నాననుకొన్నారు దమ్మిడీ లాభంలేని వ్యాపారం పైగా ఇదొక వ్యసనం సామాన్యులను పైకి తేల్చదు మళ్లీ ప్రార్థిస్తున్నా మిమ్మల్ని అంటున్నానని పొరపాటుపడేరు సుమండీ! నాకదే భయంగా ఉంది! నా మనస్సులో కెర్లుకవస్తున్న అభిప్రాయాలు వాటంతటవే బైటికి వచ్చేస్తున్నాయి!" అంటూ కైలాసపతి శృంగారకవిని చీవాట్లు పెట్టినట్లుగా మానినట్లుగా మాట్లాడేడు ఆదంతా అతను అసలు అడగదలచుకొన్నదానికి ఉపోద్ఘాతం "ఏమండీ శృంగార కవిగారూ! మామాటేమి చెప్పేరు!" అని చల్లగా అడిగేడు కైలాసపతి

"ఏదీ మీకియ్యవలసినదాని సంగతేనా?"

"ఆఁ ఆఁ ఒకటి కాదు రెండు కాదు మూడు నెలలంది అట్టే ఉండిపోయింది!"

"ఎందుకూ! నాకు చేతికి రావలసిన సొమ్ము కొంత ఉంది మరు ఏలాగైనా తొందరలో సర్దుతాను!"

"మాటంటే సరిపోదు కవిగారూ?" అని కొంచెం బిగించేడు

ఏమండోయి! మాట ఒకటీ పని ఒకటీ కాదు అన్నాక అక్షరాల జరిగితీరవలసిందే!"

ఇప్పుడు కనక పత్రికపని సంచికకి చెయ్యకపోతే గత మూడు మాసములదీ చేతిలో పడదనీ, పైగా ప్రెస్ డిక్లరేషన్ తనపేర ఉండడంబట్టి తన బాధ్యత కొంత ఉందనీ కైలాసపతి కొత్త సంచికను అచ్చు వెయ్యదలపెట్టేడు కాని అతను వెంటనే డబ్బు చేతిలో పడేపనికి ప్రథమ తాంబూలం మిచ్చి శృంగారకవి పని తర్వాతదిగా చేసేడు

శృంగారకవి చాల డబ్బు ఇబ్బందులు పడుతున్నాడు ఇంటికి రాసిన ఉత్తరాలకు సమాధానం లేదు పత్రికలో కొన్ని సినిమా ప్రకటనలు వేసేడు వాటితాలూకూ డబ్బు నాలుగువందలు రావాలి ఆ మొత్తం ఎప్పటిలో వస్తుందో చెప్పలేము పైగా వస్తుందో రాదో కూడ చెప్పలేము ముందే పైకమిచ్చి సినిమా ప్రకటనలు వేయించుకోరు పత్రిక అదృష్టం బాగుంది, సినిమా చిత్రం జయప్రదం కావాలి దాని జయం కోసం ప్రొడ్యూసరుకంటె పత్రికా సంపాదకుడే చాల బాగా ప్రార్థిస్తాడు "వాణీపదం"లో ఎడ్డ మామ్మోలు ప్రకటనం సంగతేమిటంటే —అప్రకటనల పెద్దమనుష్యులలో ఒక్కరూ సకాలానికి ఇచ్చేవాడులేడు పైగా తృణమో ఎణమో విదుపుతారు కాని ఇయ్యవలసినది ఇయ్యరు అన్నీ అలాంటివే దొరికేయి ఆ పత్రిక ఏజంట్లు సంగతేమిటంటే—వారి దగ్గిరనుంచి ఇప్పటికొక్క దమ్మిడీ ముట్టలేదు జాబులు రాస్తే ఇదిగో అదిగో అంటారు ఏజెంట్లమీద శృంగారకవికి బలే కోపం వచ్చింది "మా ఏజంట్లకు" అని పేరు పెట్టి పత్రికలో అచ్చువెయ్యడాని కీలాగు తయారుచేసేడు "పత్రికలమీద బతికే ఎరాశ్రయులారా! పరభృతములారా! మీరు ఎప్పటికప్పుడు సక్రమంగా డబ్బు పంపితేనే సరి, లేకపోతే మీ ఆటోరు దక్కదు మిమ్మల్ని గురించి పత్రికద్వారా ఏకిపారేస్తాము దానితో సరిపోదు తగువిధంగా కోర్టుద్వారా చర్య గైకొనబడును మరే వ్యాపారనీతి గలవారైతే, మానముగలవారైతే యీ కమీషన్ డబ్బులు మినహాయించుకొని తక్కిన సొమ్ము తక్షణం ఎమ్. ఒ. చెయ్యండి ఇది అల్టిమేటమ్‌గా గణింతురు గాక!" అంటూ మనస్సులో బాధని మాటలలో పెట్టేడు

శృంగారకవి తాలూకు సొంత ఖర్చులట్లా గుంచి పత్రిక తాలూకు పనులు కొన్ని కొన్ని డబ్బు అప్పటికప్పుడు చెల్లిస్తేకాని అవవు ఆఖరికి ఒక కాగితం ముక్కైనారాదు ఈసారి అట్టమీద అసలు బొమ్మే వెయ్యడం మాని వేశాడు ఎందుచేతంటే బ్లాక్‌మేకరు పాత బాకీ చెల్లిస్తేకాని బ్లాక్ తయారు చెయ్యనని ఖచ్చితంగా చెప్పేశాడు

ఆనెల పత్రికను ఏదో మొత్తరుగా బైటికి ఈడ్చేరు, పాతబాకీల తోపాటు కొత్తబాకీలు

ఏర్పడ్డాయి వాటిని చెల్లిస్తేకాని ఏ రకమైన వరవతి వుట్టేటట్లు కనబడలేదు అతను కంగారుపడుతూ ఉన్నపాటున రైలెక్కాడు

## 3

కొడుకు ఇంటికి వచ్చేడని శివరూపయ్య కి సంతోషంలేదు అతను డబ్బుకోసమే వచ్చి ఉంటాడని గ్రహించుకొన్నాడు ఇంటి దగ్గిర తల్లి మొట్టమొదటే కొడుక్కి తండ్రి మండిపడుతున్నాడని తెలియజేసింది దానితో అతని ఆశలు కుప్పకూలినట్లయేయి

శివరూపయ్య చాపమీద చార్చుని ఏవో వ్యవహారం ఉత్తరాలు తిరగవేస్తున్నాడు

శృంగారకవి కాఫీ హోటేలు నుంచి వచ్చి తండ్రి ఎదుట సిగరెట్టు ముట్టించడానికి జంకుతున్నాడు పైగా అది కారణంగా వ్యవహారం చెడుతుందేమో అని భయం మంచిమాట చెవిని పడడం కోసం నిరాశలో ఆశగా ఎదురుచూస్తున్నాడు తండ్రి కాబట్టి తానె సంభాషణ కదుపుతూ "ఎట్లాగుంది నీ వ్యాపారం" అన్నాడు

"ఒక మోస్తరుగా ఉంది."

"డబ్బు తిరిగి వస్తుందా?"

"ఏజెంట్లు కొంత సొమ్ము ఇయ్యాలి సినిమా ప్రకటనవాళ్లు కొంత సొమ్ము ఇయ్యాలి ఇతర ప్రకటనలవాళ్లు కొంత సొమ్ము ఇయ్యాలి.—"

"అవి ఇప్పటిలో వస్తాయా?"

"క్రమంగా వస్తాయి "

"ఇప్పటికి పెట్టిన పెట్టుబడే నాతలకి మించిపవని ఇక దాని విషయమై ఒక గవ్వ ఖర్చుపెట్టదలచుకోలేదు "

"మరి దేనివిషయమై ఖర్చు పెట్టదలచు కొన్నావు?' అని వ్యవహారంలో మొహ మాటమెందుకని అడిగేడు కొడుకు

చక్కగా కిళ్ళీల దుకాణం పెట్టుకో. ఏదో కాస్త మదుపుపెడతాను అదైనా కొంచెమే.

'ఆ డబ్బే పోనీ దీనికి పెట్టరాదూ?'

"ఇదివరకు పెట్టిన డబ్బెక్కడికి పోయింది ఇదీ అక్కడికే పోతుంది." అన్నాడు తండ్రి నిర్వివాదంగా

"మళ్ళీ సొమ్ము పెట్టుబడి పెడితేనే వెనకటి సొమ్మయినా తిరిగి రావడం."

"ఇహ ఆవిషయమై నాదగ్గిర ఎత్తవద్దు"

శృంగారకవికి అన్ని ఆశలూ తీరిపో యేయి

తండ్రి మంచితనంగానే "కావలిస్తే ఆ షాపుకే రకరకాల పత్రికలు తగిలించుకో. నీ సరదా తీర్చుకో. దానివల్ల వస్తే రెండు డబ్బుల సొమ్ము వస్తుందికాని నష్టంలేదు" అంటూ చుట్ట ముట్టించేడు

తిరిగి చెన్నపట్టణం వెళ్లే యోగం ఏలాగు లేదని శృంగారకవికి నిశ్చయ మయింది కళ్ల ఎదుట అసహ్యమైన కిళ్లీ దుకాణం సోడాబుడ్ల బుసబుసలు రూపొం దేయి ఇంకెందుకు మొహమాటమని జేప లోంచి సిగరెట్టు తీసి ముట్టించేడు

శివరూపయ్య ఆశ్చర్యపోతూ నోరు తెరి చేడు చుట్ట కిందపడింది

# రూపకోత్పత్తి

భూపతి లక్ష్మీనారాయణ రావు

రూపకము ఉత్తమసాహితీస్వరూపమని ప్రాక్పశ్చిమసాహిత్యవేత్తల అభిప్రాయము. ఏజాతి సారస్వతవికాసమును పరిశీలించినను తత్పరిణతదశయందు రూపకరచన జరిగినదని వ్యక్తము కాగలదు. సద్యఃపరనిర్వృతి నిశ్శ్రేయములనెడు ఉదాత్తసాహితీప్రయోజనములను సాధించుటలో మిక్కిలి సమర్థమైనదియగుటచే రూపకములకు అందును నాటకమునకు కిట్టి ప్రాధాన్యము కలిగినది.

బుద్ధివికాస మెక్కువగలేని మానవజీవిత ప్రాథమికదశలో నుత్పన్నమగు సారస్వతము గేయసారస్వతము. ప్రకృతిసౌందర్యాదులకు ముగ్ధుడైన మానవుని హృదయచైతన్యము అప్రయత్నముగనే గేయరూపమును గైకొనుచున్నది. కనుక గేయరచనయే సారస్వతచరిత్రయందు ప్రథమఘట్టము. మానవుని హృదయావేశ ఆవేగాదుల ననుసరించి ఉత్పన్నమైన గేయసారస్వతము క్రమముగ వికసించి గాథారూపమును గైకొన్నది. వీరశృంగారరస ప్రధానములగు దీర్ఘరచనలన్నియు నీ మార్గముననే వృద్ధికి వచ్చినవి. వీని నాంగ్లమున Ballads అని వ్యవహరింతురు. భారతదేశమున కూడ అన్నిభాషల యందును నిట్టి గాథలనేకములు ప్రాచీనకాలమున వ్యాప్తికి వచ్చినవి. వేదబుక్కుల రచనాకాలమునాటికిని భారతరచననాటికిని మధ్యకాలమున ఇట్టిగాథలు కొన్నియైనను వ్యవహారభాషలలో నుండియుండునని విశ్వసింపవలసియున్నది. వ్యాసుని జయేతిహాసము సంస్కృతమున రచితమైన ప్రప్రథమగాథ కావచ్చును. కాని ఆకాలపు వ్యవహారభాషలగుప్రాకృతాదులందు గాథారూపమగు సారస్వతము వ్యాప్తియందుండిన కారణముననే వ్యాసుడు ఆసారస్వతరూపము నాలంబనముగొని భారతేతిహాసమును (జయ) రచించినాడని చెప్పవలయును. ప్రచారమార్గమున సంఘమును సంస్కరించుట అతని యుద్దేశమగుటచే గేయరూపమునమన్న గాథారచన నతడవలంబించినాడు. పారలౌకికకల్యాణము నుద్దేశించిన వ్యాసమహర్షి సులభమగుభాషను ప్రచారమునకనువగు గాథారూపమును అవలంబించి జయగాథను రచించినాడు. రామాయణరచనయు నిట్టిదే. ఇతివృత్తవిషయమున నీరెండును భిన్నములైనను కావ్యస్వరూపము విషయమున వీనికి సంపూర్ణమగు సామ్యమున్నది. ప్రచారకులు దేశమున పర్యటనము గావించుచు నీగాథలను ప్రజాసంఘముల సమక్షమున పాడి విజ్ఞానవ్యాప్తి గావించుటయే ప్రయోజనముగా నివి రచితములైనవి. అట్లు ప్రచారముగావించువారిని సూతులని వ్యవహరించినట్లు తెలియుచున్నది. సూత శబ్దమునకు రథకార రథసారథీ త్యాద్యర్థములు మాత్రమే కలవనియు గాథాపాఠకులనెడు నర్థము లేదనియు దాసుగుప్తాగారి అభిప్రాయము. కాని మొదట నీ సూతులనువారు పాఠకులు మాత్రమేకాక పండితులు కవులు కూడ నైయుండిరని భారతమువల్లనే తెలియుచున్నది. వైశంపాయన రోమహర్షణాదులట్టివారే. కాలక్రమమున ఈ సూతసంప్రదాయమే పౌరాణికసంప్రదాయముగ దేశమున నెలకొన్నది. సారస్వతము బహుముఖముల విస్తృతిచెందినను భారతరామాయణాది గాథారూపకావ్యములను పురాణములుగ చెప్పించి వినెడివాడుక నేటికిని సంఘమున నిలిచియున్నది. ఈ పురాణపఠనము మధ్యమసంఘమువారి ప్రయోజనమునే యెక్కువగ సాధించుచుండుటచే పామరజనములలో వ్యావహారికభాషారచితములైన గాథలు వ్యాప్తికివచ్చినవి. దేశింగరాజుకథ బాలనాగమ్మకథ బాలవీరునికథ మున్నగునవియన్నియు నిట్టివే. ఈగాథాసారస్వతపరిణామమున, పండితకవులతో నారంభమైన సూతసంప్రదాయ మెట్లు రానురాను విద్యావిహీనులగు గాయకులకు వృత్తిగ నేర్పడినదో గమనింపతగిన విషయము. భారతరచనాకాలమున ఇతివృత్తమునకును దానిననుసరించిన న్యాయధర్మప్రతిపాదనమునకును ఎక్కువ ప్రాధాన్యముండినట్లు తోచుచున్నది. కాని రానురాను గాథలయందు రసపోషణ కెక్కువ అవకాశమేర్పడి తత్పోషకములగు సంగీతనృత్యములకు కూడ ప్రాధాన్యమేర్పడినది. గాథాపాఠకులెల్లరును గాథలను వచనము వలె చదివి అర్థమును వివరించుటకు మారుగ రాగయుక్తముగ పాడుచు నృత్యమునుగూడ సాహాయ్యముగగొని, శ్రోతలను రసపరవశులుగ చేయుట పరిపాటియైనది. పాఠకుడు తొలిరోజులలో ఒక్కడే యైయుండినను కాలక్రమమున నతనికి సహాయకవర్గము కూడ నేర్పడినట్లు తెలియుచున్నది. సంగీతమునను, సంభాషణలందును, ప్రధానపాఠకునకు వీరు సహాయులై కథను రసవంతముగ నడపుటకు తోడ్పడినారు. కొంతకాలమునకు ఈ గాథాపాఠకవర్గమున స్త్రీలకుకూడ ప్రవేశము కలిగినది. ఈ స్త్రీలు సాధారణముగ పాఠకుల కుటుంబవర్గములోనివారే యై యుందురు. ఇట్లు, ఈ వీరగాథలను పాడుట ఒకవృత్తిగా నేర్పడినెడి ఇతివృత్త మూకర్ష

జీయమగుటకును. అది రమణీయమగు మార్గమున ప్రజలయందు వ్యాపించుటకును సంగీతనృత్య స్త్రీపాత్రలు దోహదమొనర్చినవి నాటకరంగము కూడ ఈపరిణామమునే అనుసరించినదని యూహించుటకు వీలున్నది భారతరామాయణాది మహాగాథల అంశములు అనేకములు రూపకములయందు అందును ముఖ్యముగ నాటకముల యందు, చెలకొనియుండుటను గమనింపవచ్చును భారతరామాయణాది మహాగాథలను ప్రచారము చేయుచుండిన సూతబృందమే కాలక్రమమున రంగప్రవర్తకులగు భరతబృందముగ నేర్పడి రూపకప్రదర్శనలు గావించిరా? యని యూహించుట కవకాశ మున్నది

భారతీయ రూపకముల యుత్పత్తినిగూర్చి తెలియజేయు గ్రంథము భరతముని ప్రణీతమని వ్యవహరింపబడు నాట్యశాస్త్రము భరతుడెవ్వడో ఏకాలమువాడో అతనివృత్తి యేదో అసలీ పేరు పెట్టబడెయుండినదో ఇదమిత్థమని తేల్చుట కాధారములు లేవు ముని యను బిరుదు సంప్రదాయసిద్ధముగ నితనినిగూర్చి ప్రయుక్త మగుచున్నను విశ్వామిత్ర వసిష్ఠాదులవంటి మునివంశమునకు చెందినవాడా యితడు? అను సందేహముకూడ కలుగకపోదు అతి ప్రాచీనములు ప్రధానములు నగు విషయములకన్నిటికిని దివ్యత్వము నారోపించుటయు బ్రహ్మాదులనుండి వ్యుత్పత్తిని పొందించుటయు మన ప్రాచీనుల అలవాటు ఉత్తమసంప్రదాయములన్నియు వేద ప్రతిపాదితములని చెప్పి తద్ద్వారా వానికి గౌరవము నాపాదించుట పూర్వపద్ధతి అట్లే నాట్యశాస్త్రమునకుకూడ మన ప్రాచీనులు దివ్యత్వము నారోపించినారు త్రేతాయుగమున జంబూద్వీపమందలి ప్రజలు రజోగుణప్రధానులై వేదోక్తకర్మలను పాటింపక ధర్మపథ దూరులై ప్రవర్తించుచున్నారనియు వారిని ధర్మోన్ముఖులుగా చేయుటకు ఆకరణీయమగు రచన వేదిమైనను గావింపవలెననియు ఇంద్రాదులు బ్రహ్మను ప్రార్థింప బ్రహ్మ నాట్యవేదమును సృష్టించెనని నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమున వర్ణితము జనులు పాపలోభ పరంగతులై గ్రామ్యధర్మప్రవృత్తులైరని ఇంద్రాదులు ఘోషింపగా బ్రహ్మ లోకము నుద్ధరించుటకును ప్రజలను ధర్మమార్గమున ధర్మోన్ముఖులం గావించుటకు నీ నాట్యవేదమును రచించెనని గలము ఆనాటికి వేదగాహ్యులగు బాలవణాదివారి సంఖ్య వృద్ధియైనది వీరికి వేదోక్తములగు విషయములను విపులము బోధింపవలసిన యావశ్యక మేర్పడినది కనుక బ్రహ్మ ఋగ్వేదమునుండి యితి వృత్తమును సామవేదమునుండి సంగీతమును యజుర్వేదము నుండి అభినయమును అథర్వమునుండి రసమును గ్రహించి, వాని సంయోగముచే నాట్యవేదము కల్పించెనని వర్ణితమైయున్నది

> "జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీతమేవచ
> యజుర్వేదాదభినయాన్ రసానాథర్వణాదపి
> వేదోపవేదైః సంబద్ధో నాట్యవేదో మహాత్మనా
> ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా లలితాత్మకమ్ "

ఈకారణముననే నాట్యశాస్త్రమునకు వేద మనెడు వ్యవహారము ఏర్పడినది

> "న వేదవ్యవహారోఽయం సంశ్రావ్యః శూద్రజాతిషు
> తస్మాత్ సృజాపరంవేదం పంచమం సార్వవర్ణికమ్ "

బోధ్యములగు విషయములు వేదోక్తములే యైనను బోధనవిధానము సరసము మనోహరము నగుటచే నది ప్రజల నెక్కువగ నాకర్షించినది

> "ఇదమస్మాకం గుడప్రచ్ఛన్నకటుకౌషధకల్పమ్
> క్షీరమధ్వాద్యుపస్థిలౌషధోపయోగవత్ "

బ్రహ్మరచిత ప్రథమరూపకమగు "ఇతిహాసమును" ప్రదర్శింపవలసినదిగ బ్రహ్మ భరతునాదేశింప భరతుడు తన నూర్గురుకుమారులకు నారూపకప్రదర్శనమున శిక్షణ నొసంగెననియు అప్సరసలు కూడ ప్రదర్శనమున పాల్గొనిరనియు తెలియుచున్నది భరతుడు ప్రదర్శించిన "అసుర పరాజయ" మనెడి వ్యాయోగము తమ కవమానకరముగ నుండుటచే రాక్షసులు ప్రతిఘటింపగా బ్రహ్మ వారి నసున యించెననికూడ వివరింపబడియున్నది రాక్షసులు కలిగించు విఘ్నములనుండి ప్రదర్శనమును రక్షించుటకై నాట్యవేశ్మమును కూడ ఏర్పరుపవలసివచ్చినది ప్రథమప్రదర్శన సందర్భమున రాక్షసులు విఘ్నములు కలిగింపగా ఇంద్రుడు ధ్వజదండమును సాధనముగా గొని వారిని పారద్రోలెననియు నాకారణమున నింద్రధ్వజ ప్రతిష్ఠ తరువాతి ప్రదర్శనల సందర్భమున సంప్రదాయమయ్యెననియు తెలియుచున్నది భరతుడు తరువాత ప్రదర్శించిన రూపకము "అమృతమంథన"మను సమవాకారము పిమ్మట నతడు "త్రిపురదాహ" మను డిమమును శివుని సమక్షమున ప్రయోగింపగా శివుడు సంతుష్టుడై సంగీతనృత్యములనుకూడ రూపకప్రదర్శనమున ప్రవేశింపజేసెననియు తెలియుచున్నది ప్రథమరూపకప్రదర్శనమును పురస్కరించుకొని బ్రహ్మ ప్రదర్శనమును చతుర్విధములుగా విభజించెననియు అవియే భారతి సాత్త్వతి కైశికి, ఆరభటి యను వృత్తులనియు వివరింపబడియున్నది ఈవృత్తుల లక్షణములను బట్టి రూపకపరిణామము కొంతవరకు బోధపడగలదు

> "యా వాక్ప్రధానా పురుషప్రయోజ్యా
> స్త్రీవర్జితా సంస్కృతవాక్యయుక్తా
> స్వనామధేయైః భరతైః ప్రయుక్తా
> సా భారతీ నామ భవేత్తు వృత్తిః "

పురుషప్రయోజ్యము సంస్కృతపదయుక్తము వాక్ప్రధానము నైనది యితివృత్తము స్త్రీల కిందు ప్రవేశములేదు ఈప్రదర్శన

మన పాల్గొను నటకులు (భరతులు) తమతమ నామధేయముల తోనే వర్తింతురు ఈలక్షణమును బట్టి చూడగా ఈ భారతీవృత్తి యందు రూపధారణాదులును, సంగీతనృత్యాదులును లేనియు భరతులు ఇతివృత్తభాగములను అర్థయుక్తముగ పలుకుటయే ప్రధానమైనదనియు వ్యక్తమగుచున్నది అనగా వాచికాభినయమే యందు ప్రధానముగ గన్పట్టుచున్నది రూపకప్రదర్శనమునం దిది ప్రథమ దశ [ఇతివృత్తము సంభాషణాత్మకమై యుండుటయు నా సంభాషణలు నటప్రయుక్తమగుటయు—నను లక్షణములనుబట్టి యీదశ గాథాపఠనమునకు తరువాతిదని చెప్పవచ్చును ] తరువాతిది సాత్త్వతీవృత్తి

"వాగంగాభినయవతీ సత్త్వోత్థానవచనప్రకరణేషు
సత్త్వాధికారయుక్తా విజ్ఞేయా సాత్త్వతీవృత్తిః

భావప్రధానమైన సందర్భము వాక్కుచేతను అంగికాభినయము చేతను అనుసరింపబడుచున్నది సత్త్వమను కింది ప్రాధాన్యము కలదు రసభావముల కాశ్రయమైనదియు అవ్యక్తరూపమునను న్నదియు సత్త్వమని భరతుడే వేరొకచోట వివరించినాడు

అవ్యక్తరూపం సత్త్వం హి జ్ఞేయం భావరసాశ్రయం
యథాస్థానరసోపేతం రోమాంచాస్రాదిభిర్గుణైః"

దీనినిబట్టి సాత్త్వతీవృత్తియందు కథాపఠనము మాత్రమే కాక అభినయముకూడ కలదని వ్యక్తమగుచున్నది నటకులు తమ వాచి కాంగికాభినయములచే భావోత్పత్తి రసోత్పత్తులను కలిగింపవలెనని "రసాశ్రయ" మను ప్రయోగమువలన గమ్యమానమగుచున్నది భారతీదశయందు పఠనమాత్రమైయుండిన ప్రదర్శనము సాత్త్వతీ దశయందు అభినయాత్మకమైనది అనగా రూపకప్రదర్శనము యొక్క ప్రయోజనము రసోత్పత్తియని గ్రహింపబడినది మూడ వది కైశికీవృత్తి

"కైశికీ శ్లక్ష్ణనేపథ్యా శృంగారరససంభవా
అశక్యా పురుషైః సాధు ప్రయోక్తుం స్త్రీజనాదృతే"
"యా శ్లక్ష్ణనేపథ్యవిశేషచిత్రా
స్త్రీసంయుతా యా బహునృత్తగీతా
కామోపభోగప్రభవోపచారా
తాం కైశికీం వృత్తిం ఉదాహరంతి"

ఈ లక్షణమునుబట్టి విషయము శృంగారప్రధానము బహుస్త్రీ పాత్రప్రయుక్తము నృత్తగీతాతిశయవ్యాప్తము నేపథ్యరచనాసం యుక్తము నని తెలియుచున్నది నృత్తగీతముల యుపయోగము, వేషధారణము స్త్రీపాత్రలను స్త్రీలుధరించుట—అనునవి కైశికీవృత్తి నాటి కేర్పడినవి ఇతివృత్తము శృంగారప్రాయమైనది స్త్రీ సహాయ ములగు అనేకభావముల ప్రదర్శనము స్త్రీలకు మాత్రమే సాధ్యమని గుర్తింపబడినది కావున స్త్రీలకు రంగమున ప్రాధాన్యమేర్పడినది

"యావ న్నిజహృదయ రసవిలస ద్విశస్వర నిర్వార చమత్కార పవిత్రితా నటాతా భగవత ఇవ తావత్ శిక్షితైరపి వైచిత్ర్య మనాహార్యం"

కడపటిది ఆరభటీ వృత్తి
"ప్రస్తావపాతప్లుతలంఘితాని
చాన్యాని మయా కృతమింద్రజాలమ్
చిత్రాణి యుద్ధాని చ యత్ర నిత్యమ్
తం తాదృశీం ఆరభటీం వదన్తి"

పలువిధములగు గీతములు యుద్ధము నృత్యము ఇంద్రజాలము విత్యాదు లిందు క్రమముగా ప్రయోగింపబడుచున్నవి కథయందలి ఆయా పాత్రముల స్వభావానుగుణముగ ప్రదర్శితములగుటకు రంగ పరికరములు కూడ నాటి కేర్పడియుండి యట్లు "యంత్రవిన్యాస" మను ప్రయోగముచే గమ్యమానమగుచున్నది అనగా జీవితానుగుణ ముగా ఇతివృత్తమును ప్రదర్శించు రంగపరికరములు ఆరభటీవృత్తి నాటి కేర్పడినవని చెప్పవచ్చును

ఇట్లు భరతశాస్త్రమున వర్ణింపబడిన భారతీత్యాది నాలుగు వృత్తులను రూపకపరిణామచరిత్రయందు నాలుగుదశలను సూచించు చున్నవని తోచుచున్నది

రూపక ప్రయోజనమును గూర్చి భరతుడిచ్చిన యభిప్రా యము గమనింపదగినది

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్
విశ్రామజననం లోకే నాట్యమేతద్భవిష్యతి
(వినోదజననం కాలే నాట్యమేతద్భవిష్యతి )

ప్రాపంచికకష్టముల పాలగుచున్న దీనులైయున్న సామాన్యజనులకు విశ్రాంతిని వినోదమును కల్పించి తాత్కాలికముగనైన మనశ్శాం తిని చేకూర్చుట రూపకరచనా ప్రయోజనమని యిందుచే వ్యక్త మగుచున్నది మరియు బహుభావయుతమైన రూపకము సర్వజన ములకును ఉపాదేయమనికూడ వివరింపబడియున్నది

"నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్"
భిన్నాభిరుచులుగల వ్యక్తులందరు నొకచో సమానుభవింపతగినది రూపకప్రదర్శనము విశిష్టమగు రసపోషణ, ఆకర్షణీయములగు సన్నివేశములు అభినయము భావగాంభీర్యము ఉదాత్తేతి వృత్తము చమత్కారములగు సంభాషణలు, ఇత్యాదులతో నొప్పు నాటకప్రదర్శనము ఆనందహేతువని భావుకులు వివరించియున్నారు.

"భూమ్నా రసానాం గహనః ప్రయోగః
సౌహార్దహృద్యాని విచేష్టితాని
ఔద్ధత్యమాయోజితకామసూత్రం
చిత్రా కథా వాచి విదగ్ధతా చ "

సాత్త్వికానందమును గూర్చుటయే రూపకముల పరమార్థమనియు, ఇతిహాసాదులవలన సిద్ధించు వ్యుత్పత్తిని మాత్రమే పేర్కొనుచు ఫలమందియాశించుట బుద్ధిహీనతయనియు ధనంజయుడు కూడ తన దశరూపకమున వివరించినాడు

ఆనందనిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః
యో పీతిహాసాదివదాహ సాధుః
తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ

విజ్ఞానమునుమాత్రమే రూపకప్రయోజనముగ నెన్నువారు అనందానుభూతినెరుగని స్వాదుపరాఙ్ముఖులని అభిప్రాయము రసాస్వాదనానందానుభూతి అనునది నాటకముయొక్క ప్రధానప్రయోజనము అని భరతాదులనుండి సాహిత్యవేత్తలెల్లరును నంగీకరించిన విషయమే మానవజీవితమునందలి వ్యవస్థావైవిధ్యమును మానవప్రకృతిని మనస్తత్త్వమును ప్రదర్శించి తద్ద్వారా రసాస్వాదనానుభవమును ప్రేక్షకులకు కలుగజేయుట రూపకరచనయందు ఏనుసరించబడిన విధానము భారతరామాయణములు మానవజీవితమునకు సమగ్రవాఖ్యానములు రూపకములందును నట్లే జీవితమునకు సంబంధించిన రసవత్తరములగు సన్నివేశములు, ఘట్టములు ఇతివృత్తములైనవి రచనావిధానమునకూడ ప్రాచీన రూపకకర్తలు ముఖ్యవిషయములలో భారతరామాయణములననుసరించియున్నట్లు తోచుచున్నది ఈమహాకావ్యములందుపయుక్తమైన భాష సరళము, సులభమునై సామాన్యప్రజానీకము వ్యవహరించుచుండిన భాషకు సన్నిహితమైయున్నదని చెప్పవచ్చును ఆకావ్యములు ప్రచారమున కుద్దిష్టములగుటచే తత్కాలవ్యక్తిత్వ ప్రజాలోకమునకు వశ్యమగుభాషనే అవలంబించినారు వ్యాసుడు తాను రచించిన ఆయేతిహాసమును శిష్యులగు వైశంపాయనాదులచే ప్రచారము చేయించియుండుటయే యందులకు ప్రబలసాక్ష్యము రామాయణమును కూడ వాల్మీకి కుశలవులచే అయోధ్యావాసులయెదుట పాడించియున్నాడు రూపకరచనకూడ సామాన్యజనుల కుద్దిష్టమగుటచే భాషావిషయమునందట్టి విధానమునే యనుసరించినది తరువాతికాలమున రచితములైన సంస్కృతరూపకములు రాజాస్థానములందలి కవులను పండితులను వినోదింపజేయుట కుద్దేశింపబడినవగుటచే సాంకేత్యమును గోల్పోయినవి కాళిదాసభాసబాణాదుల రచనావిధాన మానాటకకర్తల కాదర్శములైనవి తరువాతనే, భాసుని నాటకములందలి భాషా సారళ్యముకాని, జీవితసన్నిహితత్వముకాని అనర్ఘరాఘవ, రత్నావళీ విద్ధసాలభంజికాది రూపకములందు కానరాదు

రూపకరచనయందు ప్రాకృతములకు గల ప్రాధాన్యము కూడ గమనింపతగినది

"నాట్యయోగేతు కర్తవ్యం కావ్యం భాషాసమాశ్రయమ్"

అని భరతుడు, రూపకములందు తత్తత్ప్రాంతీయవ్యవహార భాషలకు ప్రాధాన్యముండు టవసరమని సూచించినాడు దశరూపకకారుడును నట్లే, రూపకప్రదర్శనమున క్రియావేషభాషాదులన్నియు సంఘమునుండియే గ్రహింపబడవలెనని నిర్ణయించినాడు

"దేశభాషాక్రియావేషా లక్షణాః స్యుః ప్రవృత్తయః
లోకాదేవాధిగమ్యైతాః యథౌచిత్యం ప్రయోజయేత్ "

సంస్కృతనాటకములం దాదికాలమునుండియు ప్రాకృతములకు ప్రాధాన్యమేర్పడినది సంభాషణమంతయు సాధారణముగా ప్రాకృతముననే యున్నది శ్లోకములు—అందును ఉత్తమపాత్రోక్తములైనవి మాత్రమే—సంస్కృతమునందు రచితములైనవి భారతాదిమహాకావ్యములను గాథారూపమున ప్రచారము గావించిన కాలముననే ప్రాకృతము లుపయుక్తములై యుండవలెను కావ్యపఠనముచే మాత్రమే ప్రజల కర్థసిద్ధి సంపూర్ణముగా కలుగజాలదు కావున తద్వ్యవహారము ప్రశ్నోత్తరములు, విశ్వాదులన్నియు ఆయా ప్రాంతీయవ్యవహారభాషలందు జరిగియుండవలెను రూపకములందును నట్లే వివిధ ప్రాకృతములు పాత్రోచితభాషలుగా నుపయుక్తములైనవి నాటకరచనములం దుపయుక్తమైన ప్రాకృతములు—చాలవరకు శౌరసేని భాసుడు మాగధిని,—[స్వల్పముగా అర్ధమాగధిని] కూడ కొద్దిగా నుపయోగించినాడు, భాసునితరువాత మహారాష్ట్రిప్రాకృతమునకుగూడ ప్రవేశము కలిగినది అశ్వఘోషుడు శౌరసేనీ మాగధీ అర్ధమాగధులను వాడినాడు ఇతని ప్రాకృతములు ప్రాచీనములుగ గన్పట్టుచున్నవి సాధారణముగ నాటకములన్నిటియందును ప్రధానముగా శౌరసేనియు, తరువాత మహారాష్ట్రియు ముఖ్యములు

ఏవిధముగ రూపకప్రదర్శనము సాంఘికజీవితమునకు అత్యంతము సన్నిహితమైయుండుట ప్రాచీనుల యాశయమని వ్యక్తమగుచున్నది ఇతివృత్తమును కూడ సాంఘికజీవితమునుండి గ్రహించి రూపకములను రచించినారు భారతాది ఇతిహాసములనుండియే కావ్యవాఙ్మయ నాటకవాఙ్మయములు రెండును ఏర్పడినవనుట నిజము రఘువంశ కుమారసంభవాది కావ్యములు, వాసవదత్తా కాదంబరీ హర్షచరిత్రాది ఆఖ్యాయికాదులు భారతరామాయణాదుల ననుసరించినవి శాకుంతల, ఉత్తరరామచరిత్ర, అనర్ఘరాఘవాది నాటకములును నామార్గమునే యనుసరించినవి ఏనను, [మహా

కావ్యములందువలె] లౌకికాతీత విషయములకును సామాన్య మానవజీవితమున కందరాని విషయములకును రూపకరచనయందు ప్రయోజనములేదు. కావున నట్టివి పరిత్యాజ్యములు. భాసుని నాటకములందు చిత్రితమైన ప్రతివిషయమును ప్రతిసంఘటనయును లోకజీవితమున కెంతయు స్వాభావికమైయుండుట యిందులకు తార్కాణము. శాకుంతలనాటకమందలి దుష్యంతుని దేవలోకగమనము ఉత్తరరామచరిత్రయందలి అలౌకికసన్నివేశములు విశ్వాదుల జీవితమునకు ఏ.రములనుట నిజమే. అద్భుతరసపోషణమునకు, దైవశక్తిని ప్రజలకు ప్రదర్శించుటకును నవి యుపకరించినవి. భారతీయుల మనస్తత్త్వమును బట్టి క్వాచిత్కములగు నా సంఘటనలు అసహజములుగ దోపలేదు. అయినను అట్టి సన్నివేశములకా నాటకములందు ప్రాధాన్యములేదు. అద్భుత విషయప్రధానములగు రూపకము లేవియు ప్రజల నాకర్షింపలేవనుట అతిశయోక్తికాదు. లౌకికజీవితమునకు చక్కని ప్రతిబింబమగు మృచ్ఛకటికవంటి రూపకమునకున్న వ్యాప్తి విక్రమోర్వశీయమువంటి వానికి లేదనుట నిక్కము. భరతుడుకూడ ప్రకరణరచనకే యెక్కువ ప్రాధాన్యమిచ్చెనని తానిచ్చిన ప్రకరణ లక్షణమునుబట్టి యూహింపనగుచున్నది.

"యత్ర కవి రాత్మబుద్ధ్యా వస్తుశరీరంచ నాటకంచైవ
ఔత్పత్తికం ప్రకురుతే ప్రకరణమేతత్ బుధైః జ్ఞేయం
విప్రవణిక్సచివానాం పురోహితామాత్యసార్థవాహానామ్
చరితం యదనేకవిధం తత్ జ్ఞేయం ప్రకరణం నామ
నోదాత్తనాయకకృతం న దివ్యచరితం న రాజసంభోగం
"బాహ్యజనసంప్రయుక్తం విజ్ఞేయం ప్రకరణంతజ్ఞైః"
"సచివశ్రేష్ఠ బ్రాహ్మణ పురోహితామాత్య సార్థవాహానాం
గృహవార్తా యత్ర భవేత్"

ప్రకరణము స్వతంత్రకల్పన. బ్రాహ్మణులు, వర్తకులు పురోహితులు మంత్రులు మున్నగువారి జీవితములందలి సంవృత్తములగు సన్నివేశములే యిందితివృత్తములు. సామాన్యకుటుంబీకుల (బాహ్యజన) గృహచరిత్రమే ప్రధానేతివృత్తముగ ప్రకరణము రచితమైనది. దశరూపకముకూడ ఈ లక్షణమునే వివరించినది. దీనినిబట్టి రూపకరచన సామాన్యప్రజల నుద్దేశించి యారంభమైనదనియు, సామాన్యమానవజీవిత మితివృత్తమగుట ప్రాచీనుల ప్రధానాశయమనియు విదితమగుచున్నది. ఇందు గమనింపవలసిన ముఖ్యవిషయమొకటి కలదు. బ్రహ్మ ఆదేశానుసారము దేవాసుర యుద్ధ అమృతమంథనాది దివ్యవిషయకరూపకములను ప్రదర్శించిన భరతుడు లౌకికవిషయప్రధానములగు ప్రకరణమువంటి రూపకములకు లక్షణ మేల రచించె నను ప్రశ్న కలుగకపోదు. త్రేతాయుగి కాలమునకే, ప్రకరణములందు చిత్రితమైయున్న సాంఘికవ్యవస్థ యేర్పడినదా యను ప్రశ్నకూడ అప్రస్తుతము కాదు. ప్రకరణాది రూపకభేదములు వ్యాప్తికి వచ్చినపిమ్మటనే నాట్యశాస్త్రము రచితమైనదని చెప్పవలయును. లేదా, భరతముని రచితములైన సూత్రములు సంప్రదాయపరంపరగా వచ్చుచుండగా తరువాతికాలమున నెవరో వీనినన్నిటిని క్రోడీకరించి నూతనవిషయములను కూడ చేర్చి గ్రంథరూపమున ప్రకటించియుందురు అనుటయే సమంజసముగ తోచుచున్నది.

నాట్యశాస్త్రమున "భరత" అను శబ్దము నటుడను వర్థమున ప్రయుక్తమై యున్నది. ఏకవచనము గాక నీశబ్దము బహువచనమున ప్రయుక్తమై యుండుటచే నాట్యప్రదర్శనవర్గమువారికి "భరత" శబ్దము వాచకమైనట్లూహింపనగుచున్నది. వేదకాలమునందే భరతశబ్దవాచ్యులగు కొంద ఱుమువారుండిరనికూడ తెలియుచున్నది. వశిష్ఠునివంశమువారు వాసిష్ఠులని వ్యవహరింపబడినట్లే భరతుని వంశమువారు భరతులని వ్యవహరింపబడియుందురు. ఈ వంశమునకు మూలపురుషుడగు భరతుడును, అతని మార్ధురు పుత్రులును మొదట ఆర్యసంతతివారై వేదోక్తకర్మలను పాటించుచుండినను నొకకాలమున నాటకప్రదర్శనము నారంభించి వానిని పోషించియుందురు. కళాభిరుచి కళాభిజ్ఞతయు సహజముగ గల వ్యక్తులు రసప్రధానములగు రూపకప్రదర్శనములు కాలక్షేపములగుటలో నాశ్చర్యములేదు. నృత్యగీతాభినయబహుళమై ప్రజల నాకర్షింపజాలిన నాటకములను రచించియు వానిని ప్రదర్శించియు భరతవంశీయులు సామాన్యప్రజానీకమునకు అభిమానపాత్రులై యుందురు. ఇట్లు వీరిజీవితము లౌకికవిషయప్రధానమగుటచే, వైదికనిష్ఠాపరులగు నార్యులు వీరిని నిరసించి పంక్తిబాహ్యులుగ నొనర్చినారు. అంతటితో భరతులు నాటకప్రదర్శనమునే తమ వృత్తిగ స్వీకరించి జీవింపనారంభించినారు. ప్రజాభిమానమునకు పాత్రులయ్యును రాజాదరణము మాత్రము వీరు కొంతకాలమువరకును పొందినట్లు కనబడదు. వీరు ప్రధానముగ పంచనదీ ప్రాంతమునుండి మధ్యభారతమువైపు ప్రసరించి కాలక్రమమున పశ్చిమోత్తరభారతమువైపు వచ్చినట్లున్నది. వైదికమతావలంబులగు ఆర్యుల సంఘమునుండి బహిష్కృతులైన వీరికి అనార్యులతో సంపర్క మెక్కువైనట్లు తెలియుచున్నది. అనార్యులు వీరి నాటకములను ఆదరించినట్లును నటుని పోషణలో వీరు వర్ధిల్లినట్లును సాక్ష్యమున్నది. దీనినిబట్టి భరతవంశీయు లార్యులేయయ్యును లౌకికములగు కళల నవలంబించిన కారణమున సంఘబాహ్యులై క్రమముగ నాటకప్రదర్శకవర్గముగ నేర్పడిరని వ్యక్తమగుచున్నది. రంగనిర్మాణము మొదలు వేషకల్పనవరకును గల ప్రదర్శనవిషయములన్నియు వంతుల యువనయు నటకులు మాత్రమేకాక ప్రదర్శనకు సంబం

ధించిన వారెల్లరును భరతులనియే వ్యవహరింపబడియున్నారు. వంశచరిత్రకూడ నీ విషయమును ధ్రువపరచుచున్నది చాల కాలమువరకును బ్రాహ్మణులే నాట్యశాస్త్రాధ్యాపకులై యుండినారు. నాట్యశాస్త్రార్థమును ప్రపంచించుట మాత్రమే వీరి కర్తవ్యముకాదు అభినయనృత్యగీతాదులనెల్ల నటులుంచే నభ్యసింపజేసి ప్రదర్శన విషయమున శిక్షణొసంగుట వీరి వృత్తి వీరు పుట్టుకచే బ్రాహ్మణులేయయ్యును విద్యాగరిష్ఠులగు బ్రాహ్మణవర్గమువారిచే గౌరవింపబడలేదు కాలక్రమమున ఈ భరతవంశబ్రాహ్మణులు నటకులకు గాయకులకు వేశ్యలకు వృత్తిగురువులుగ నేర్పడినారు భరతనాట్యము గొల్లకలాపము మున్నగువానియందు నేటికిని బ్రాహ్మణులగు గురువులు పాత్రలకాలంబనముగ నిలిచి తత్ప్రదర్శనముల నడపుచుండుట ప్రసిద్ధమే దీనినిబట్టి నాటకరచన మిక్కిలి ప్రాచీనకాలముననే ఆరంభమైనట్లు చెప్పవచ్చును నాట్యశాస్త్రము బ్రహ్మకల్పితమనుటకు తచ్ఛాస్త్రమునకు గౌరవము నాపాదించుటయే ప్రయోజనము అది ప్రాచీన సంప్రదాయము

వేదాధికారములేని నాలుగవజాతివారికి జ్ఞానోపదేశము చేయుటయు వారిని రజోగుణప్రధానమగు ప్రవృత్తినుండి మరలించి ధర్మమార్గోన్ముఖుల గావించుటయు ప్రయోజనములుగ నాట్యశాస్త్రము రచితమైనది సంస్కారహీనులగువారికి ఆదేశమార్గమున ధర్మన్యాయములను బోధించుట ఫలకారి కాజాలదు చక్కెరతో పొదిగి కటుకౌషధమును సేవింపజేసినట్లు మందును పాలలోచేర్చి పిల్లలచే త్రాగించినట్లు జీవితసన్నిహితమగు ఇతివృత్తము నాధారముగగొని రసమార్గము ననుసరించి జ్ఞానబోధ గావించుటయే పామరుల విషయమున సరియగు విధానము రూపకరచనావిధానమట్టిది మహాభారత రామాయణములందలి యితివృత్తముల యాధారమున సంగీతనృత్యాభినయాహార్యకాది సాధనముల సాహాయ్యమున ప్రజల మనస్సుల నాకర్షించి వారి జీవితములను సంస్కరించుట రూపకముల సాధించు ప్రయోజనము ఋగ్యజుస్సామాథర్వముల వస్తుగీతాభినయరసముల సమకూర్చినవి శివుడు రౌద్రానుభావకమగు తాండవమును పార్వతీదేవి శృంగారరసకాది లలితరసముల కుపకరించు లాస్యమును చేర్చినారు విష్ణువు భారతీత్యాది చతుర్విధవృత్తులు చేర్చి రూపకప్రదర్శనమును సమగ్రముగను సర్వాంగసుందరముగను కావించినారు ప్రదర్శనానుకూలమగు రంగస్థలము విశ్వకర్మచే పరికల్పితమైనది భరతశాస్త్రము నాటకప్రదర్శనమున కిట్టి వ్యుత్పత్తిని ప్రదర్శించుచున్నది బ్రహ్మాది దేవతావిషయకమగు నీవ్యుత్పత్తిని మనము విశ్వసించినను విశ్వసింపకున్నను అతిప్రాచీనకాలముననే భారతదేశమున నాటకప్రదర్శనము సంగీతనృత్యాభినయాదులతో సమగ్రమై విలసిల్లి సామాజికుల కానందమును సంస్కారమును గూర్చుచుండుట మాత్రము నిజము.



నాటకోచితములైన సంభాషణరూపమంత్రములు వేదములందు కలవనియు, నవియే రూపకోత్పత్తికి బీజములనియు కొందరు విమర్శకుల అభిప్రాయము యమయమీ సంవాదము ఊర్వశీపురూరవ సంవాదము, నేమభార్గవ ఇంద్రుల సంవాదము, ఇంద్రాదితివామదేవుల సంభాషణ శరమాపణుల సంవాదము విశ్వామిత్రనదీ సంవాదము ఇంద్రమరుత్సంవాదము ఇత్యాదులు భావప్రేరకములై యుండుట నిజమే కాని వీనినుండియే నాటకసన్నివేశములు రసవత్తరసంభాషణములు కల్పితములయ్యెననియు నవి క్రమవికాసమును గాంచి రూపకరచనకు మూలములయ్యెననియు నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు పైపేర్కొన్న సంభాషణలవంటివి తరువాతికాలపు వేదభాగములలో కానరావు కనుక క్రమపరిణామమును నిరూపించుటకు సాధ్యముకాదు యజ్ఞసమయములలో మంత్రపాఠకులు రెండువర్గములుగా నేర్పడి ఇంద్రమరుత్సంవాదము మున్నగువానిని పఠించుట ఆచారమై యుండునని Max Muller—(మాక్సుముల్లరు) ఊహించినాడు సామవేదమువారికే సంగీతమేర్పడినదనియు యువతులు చక్కగ నలంకరించుకొని నృత్యమొనర్చుచు మంత్రములను గానమొనర్చు నాచారము ఋగ్వేదకాలమున కలదనియు Prof Levi మున్నగువారి యూహ విశ్వసృష్టిని సూచించు మతసంబంధములగు నృత్యములు ప్రాచీనజాతులతో— అందును ముఖ్యముగా ఇండోయూరోపియను వర్గమువారిలో ఆచారముగ నేర్పడినవనియు ఆసంప్రదాయమే భారతీయార్యులలో కూడ నిలిచినదనియు Von schroder పండితుడొక సిద్ధాంతమును ప్రతిపాదించినారు ఇంద్రాదిదేవతలు నృత్యము చేసినట్లు వర్ణితమైయుండుట ఈ సిద్ధాంతమునకు ఆధారము బ్రాహ్మణముల కాలమున జరిగిన యజ్ఞక్రియాకలాపములలో నిట్టి నృత్యములకు సదృశములైనవి కలవు ఈమంత్రపఠనమే రూపకోత్పత్తికి మూలమని Dr Hertel అభిప్రాయపడుటయే కాక, తరువాతి వేదభాగమందలి సుపర్ణాధ్యాయము అట్లు క్రమాభివృద్ధి చెందిన రూపకస్వరూపమని కూడ పేర్కొనియున్నాడు ఈక్రమపరిణామము బెంగాలురాష్ట్రమున వ్యాప్తికి వచ్చెననియు నదియే తరువాత నాటకరచనకు ఆధారమైనదనియు నితని అభిప్రాయము పైవిధమున సంభాషణాత్మక వేదమంత్రములనుండి రూపకోత్పత్తిని నిరూపించుట సుసాధ్యముగనే కన్పట్టును, కాని వేదమంత్రము లన్నియు మతసంబంధములగు క్రియాకలాపములకు చెందినవి కావు లౌకికవిషయసంబంధము గల మంత్రములుకూడ అనేకములు కలవు వసిష్ఠవిశ్వామిత్రుల కలహరూపసంభాషణ లౌకికమే యనుటలో సందేహములేదు వేదమంత్రములనుండి రూపకముల కుత్పత్తిని నిరూపించు ప్రయత్నమున అనేకములగు మంత్రములకు విపరీతార్థములుకూడ నూహింపబడినవి వృషాకపీమంత్రము, ముద్గలమంత్రము, మున్నగువాని కిచ్చిన యర్థములు సందేహాస్పద

ములు మంత్రాకస్తుతికికూడా నిట్టి అపార్థమే ప్రతిపాదితమైనది ఇదికాక, వేదమంత్రములనుండి రూపకరచన యుత్పన్నమైనదని విశ్వసింపవలెనన్నచో సంగీతనృత్యాభినయములుకూడా మంత్ర పఠనమున తోడై యుండెనని నిరూపింపవలసియుండును దాని కాధారములు లేవు ఋగ్వేదమంత్రములు గానముచేయబడినవను నభిప్రాయము కూడ సందేహాస్పదమే సామమంత్రములను పాడి యుండవచ్చును కాని ఋగ్వేదమంత్రము లేవిధమున పఠింపబడి నది కూడ మనకు తెలియదు Dr Hertel పేర్కొనిన ఋగ్వేదసూక్తముల సంవాదములు రూపకములుగ నుద్దిష్టమైనవని యెందును సూచనలేదు సంభాషణాత్మకములను నీవేదమంత్రములు భావావేశముగల కవికి పట్లగు నన్నివేళములకు సూచకములనియు నీనినుండియే గాథా రూపమగు కావ్యరచనయు ప్రదర్శనరూపమగు నాటకరచనయు కూడ ఏర్పడియుండుననియు కూడ నొక విమర్శకాభిప్రాయము కలదు మంత్రములకును మంత్రములకును నడుమ వచనభాగములు కూడ రచితములై యుండెననియు నవి గ్రంథబద్ధములు కాకుండుటచే కాలక్రమమున లోపించినవనియు ఈ విమర్శకుల ప్రతిపాదన ఈ సిద్ధాంతములన్నియు నూహాకల్పితములే కాని హేతుబద్ధముగ నిరూపింపరానివి

వైదికక్రియాకలాపములయందు రూపకబీజములు నిహిత ములై యున్నవనియు ఆకర్మలనుండియే క్రమముగ రూపకము పరిణమించినదనియు కొందరు ప్రాచీనవిమర్శకుల యభిప్రాయము మతసంబంధములు పూజావిషయకములు నగు నృత్యములు, మూకాభినయములు మున్నగునవి నాటక ప్రదర్శనమునకు మూలములని వీరిభావము సోమవిక్రీతమను ఘట్టము అట్టి సన్ని వేశములలో నొకటి కాని ఆనందమును గూర్చుట నాటకము యొక్క ముఖ్య ప్రయోజనము వైదికక్రియాకలాపములు అట్టి ప్రయోజనము నుద్దేశించి రచితములైనవి కావు అవి యజ్ఞసంబంధ ములగు సంప్రదాయములుగను నియమములుగను పరిగణింపబడి నవి ఈ క్రియాకలాపములకు సంకేతార్థములుకూడా కలవని యం దురు కావున వీనినుండి రూపకోత్పత్తి జరిగినదని చెప్పుటకు సాధ్యముకాదు మరియు రూపకమున కెక్కువగ సంబంధించిన పరిభాషాశబ్దము లేవియు ప్రాచీనవేదభాగములందు లేవందురు ప్రవేశములగు వృత్తులను ఆజీవికలను అనుసరించు వర్గములవారిని తెలుపు [ ](వాచక) శబ్దములు యజుర్వేదమున పేర్కొనబడి యున్నవి కాని నట శబ్దము వానియందు లేదు శైలూషశబ్ద మొకటికనబడుచున్నది కాని యీశబ్దము గాయకునకును నర్తకు నకును కూడ సూచకమగుటచే నటశబ్దవాచకముగా దీనిని గ్రహింప వీలులేదు

మహావ్రతసందర్భమునం దగ్నిచుట్టును ప్రదక్షిణము చేయుచు కన్యలు నృత్యముచేయుచుండిరనియు ఫలోత్పత్తి కను కూలించు మవృష్టి కత్ప్రయోజనమనియు తెలియుచున్నది అట్లే, వివాహసందర్భమున తద్వివాహము సుస్థిరము ఫలవంతము నగుట నుద్దేశించి ముత్తైదువలుకూడ నృత్యము చేయుచుండిరని కలదు ఇట్టి నృత్యాదులన్నియు దేవతాప్రీత్యర్థములును ఫలసిద్ధి నాకాంక్షించియు జరిగినవియే కాని నాటకమునందువలె ప్రేక్షకుల రంజనార్థము జరిగినవి కావు కావున మంత్రములనుండి కాని వైదికక్రియలకు సంబంధించిన నృత్యగీతాదులనుండి కాని రూప కోత్పత్తి జరిగినదనుట ఊహామాత్రమే యగును మరియు వేద మంత్రములును యజ్ఞకర్మకలాపములును లౌకికసంబంధము లైనవికావు ఇవి నిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణుల యధీనములు కావున వీనినుండి కేవలము లౌకికములు ఇంద్రియలోలుపతా ప్రధానములు రసోత్పత్తిమూలములు నగు నాటకము లేర్పడిన వనుట పొసగదు వైదికకర్మయంతయు నలౌకికవిషయముగ నాదు పరిగణింపబడినది లోకకల్యాణము నుద్దేశించిన యొక పవిత్ర ప్రయత్నము యజ్ఞకర్మ ఇంద్రియాసక్తికిని వినోదప్రసక్తికిని యజ్ఞకర్మతో సంబంధము కుదురదు ఆత్మసంయమముతో లోక హితము నుద్దేశించి జరుపవలసిన నియమబద్ధమగు కర్మ యజ్ఞము వైదికకర్మకలాపమంతయు నిట్టిదే కనుక నయనశ్రవణేంద్రియ ముల ద్వారా చిత్తవికాస మన్యఃపరనిర్వృతులను గలిగించి జీవిత మును రసమయముగ నొనర్చు నాటకరచన వైదికకర్మకాండ నుండి యుద్భవించినదనుటకు వీలులేదు

గ్రీకురూపకముల యుత్పత్తిని పురస్కరించుకొని పాశ్చాత్యు లీ యభిప్రాయము నిచ్చియుండురని యూహింపవచ్చును ప్రాచీన కాలమున గ్రీకుదేశపూజావిధానములలో మంత్రములు నందరును కలిసి యుచ్చరించుట సంప్రదాయముగ నుండినది తరువాతికాల మున నొకడు మంత్రపాఠములను పాడుటయు తక్కిన వారతని ననుసరించి పలుకుటయు నలవాటుగ నేర్పడినది ప్రజాసమూహ ములవృద్ధియగుకొలది మంత్రపఠనము కొందరియందుమాత్రమే నిలుచుట తప్పదు పూజావిధాన మిట్లు సంభాషణాత్మకరూపమును గైకొన్నది కాలక్రమమున స్తుత్యాత్మకమగు మంత్రమునకు మారుగ దైవసంబంధమగు గాథ పూజానమయమున పఠింప బడుచువచ్చినది అది క్రమముగ భిన్నవ్యక్తులచే ప్రయుక్తమగుచు రూపకరచనకు మార్గము చూపినది ఇది గ్రీకురూపకరచనకు మూలమని విమర్శకాభిప్రాయము

ఆంగ్లదేశమున గూడ పూజావిధానమే రూపకరచనకు మూలమైనదని పండితుల నిర్ణయము రోమన్‌కాథలిక్ చర్చిలో

అరుగు Mass అనెడి పూజావిధానమున సంగీతము ఉదాత్తానుదాత్తస్వరితాది స్వరభేదములతో గూడిన మంత్రపఠనము వేషాలంకరణాద్యాడంబరము—ఇత్యాదులు మిక్కిలి ప్రాధాన్యము వహించుచున్నవి ఈ పూజావిధానమునుండియే క్రమముగ రూపకప్రదర్శనము లేర్పడినవని యూహింపబడుచున్నది ప్రథమాంగ్లరూపక ప్రదర్శనములు మాత్రము దేవగాథాసంబంధము లనుట నిక్కము Mysteries Moralities అను పేరుతో దేవతాసంబంధములగు కథలు ప్రదర్శింపబడుచుండెడివి వీనిని ప్రదర్శింపజేసినవారు కూడ మతప్రచారకులే దేవునిప్రభావమును ప్రదర్శించు క్రైస్తవమత సంబంధములగు గాథలను పామరజనసంఘమున ప్రచారముచేసి తద్ద్వారా వారిని ధర్మబద్ధులుగ చేయు నుద్దేశముతో మతాధికారులు ఈ ప్రదర్శనములను ప్రవర్తింపజేసినారు చర్చికి సంబంధించిన వారే వీనియందు పాత్రధారులు వీరివేషము తమ రంగపరికరములతో నాడ దేశమున పర్యటనము గావించుచు వీరూపకములను ప్రదర్శించుచుండెడివారు ఆరు లేక ఎనిమిది చక్రములచే కూర్పబడిన గొప్ప శకటము ఈ నాటకసంఘమువారికి యానముగను ఆవాసముగను రంగస్థలముగనుకూడ నుపకరించినది కాలక్రమమున సంఘముయొక్క అభిరుచివికాసములను బట్టియు లౌకికజీవిత లౌకికసౌకర్యతాభివృద్ధి ననుసరించియు లౌకికవిషయప్రధానము లగు రూపకము లేర్పడినవి అట్లేర్పడిన ప్రథమరూపకములు సామాన్యసంఘ జీవితమును ప్రతిబింబములై యుండుట గమనింపదగిన విషయము Gammer Gurtons Needle A new way to pay old debts It is a pity she is a whore An honest whore మున్నగు నాటికలపురూపకములు చక్కని యుదాహరణములు ఎలిజబెత్ యుగమునకు పూర్వమిట్టి రూపకములే ప్రచారమునందుండినవి Benjohnson Beaumont and Fletcher మున్నగువారి నాటకములలో కూడ యిట్టివి చాల కలవు చారిత్రకములు ఉదాత్తేతివృత్త ప్రధానములు ఉదాత్తభావపోషకములు నగు నాటకములు Shakespeare కు పిమ్మట కాలమునందే ఏర్పడ నొచ్చినవి భారతదేశమునందువలె అందును సాధారణ ప్రజాజీవిత ప్రదర్శకముగ నారంభించిన నాటకము క్రమముగ రాజాస్థానములకు విద్యావంతులకు మాత్రమే యుపయోగించు సాధనముగ వర్తించినది వాస్తవికజీవిత ప్రవృత్తి ప్రాధాన్యమగుటకు బదులు రూపకములలో మానసికజీవిత ప్రవృత్తికి ప్రాధాన్యమేర్పడినది. పాశ్చాత్యదేశములందు జరిగిన యిట్టి రూపకపరిణామము ననుసరించి పాశ్చాత్యపండితులు భారతీయ రూపకములు కూడ నిట్లే యేర్పడియుండునని యూహించినారు భారతదేశమందలి పరిస్థితులు పాశ్చాత్యదేశపరిస్థితులకు భిన్నములు ఆదేశములలో పూజావిధానమునందు ప్రవేశించుటకు సామాన్యులకు వీలున్నది కులభేదములు లేని కారణమున ఎల్ల విషయిక పూజావిధానము సార్వజనీనమగు విషయము భారతదేశమునం దాదినుండియు వైదికకర్మకలాపము ఋషులయొక్కయు సద్బ్రాహ్మణులయొక్కయు నధీనమై యున్నది లౌకికజీవితము ప్రధానముగాగల బ్రాహ్మణేతరులకుగూడ వేదకర్మల కధికారములేదు బహువిధనియమములకు లోబడియున్న యొక విశిష్టవర్గమువారికి మాత్రమే అధికార మేర్పడినది కావున లౌకికవిషయప్రధానములగు రూపకములు వైదికకర్మలనుండి జనించినవను వాదము సత్యదూరమైనది

ప్రజలయందు విజ్ఞానమును ప్రచారము చేయుటకై రచితములైన భారతరామాయణాది మహాకావ్యములే రూపకరచనకు మార్గదర్శకములైనవని చెప్పవచ్చును కథను ఒకవ్యక్తి పఠించి యర్థమును వివరించుటకంటెను భిన్నవ్యక్తు లాయా కథాపాత్రల వాక్యములనుచ్చరించుటవలన కథాసన్నివేశము బాగుగ గ్రాహ్యము కాగలదు పఠనమునకు వాచికాభినయాంగికాభినయములు కూడ తోడైనపుడు భావము బాగుగ వ్యక్తమగుననుట నిక్కము వీనికి వేషము రంగపరికరములు నృత్యగీతములుకూడ చేరినచో కథాప్రదర్శన మాకర్షణీయమును చిత్తవికాసహేతువును కాగలదు జీవితమునందలి రసవంతములగు సన్నివేశములు మనలను స్వాభావికముగనే యాకర్షించును అట్టి పూర్వేతివృత్తములను కథారూపమున విని యానందించుట ప్రకృతిసహజమగు మానవ ప్రవృత్తి

"ప్రాప్యావన్తీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధా
న్పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీవిశాలాం విశాలామ్"

అని యీ విషయమునే కాళిదాసు మేఘసందేశమున వర్ణించినాడు మానవుని యీ కథాశ్రవణాసక్తియే ఆఖ్యానరచన గాథారచన రూపకరచనలకు హేతువైనది ఇతివృత్తము ఇంద్రియప్రత్యక్షమగునట్లు చేసి రసోత్పత్తిని కలిగించునది రూపకము శ్రవ్యకావ్య పఠనమున కిట్టి శక్తి లేదు రంగస్థలము పాత్రవేషాదికములు మున్నగునవి నయనేంద్రియము నాకర్షించి తద్ద్వారా మనస్సును ఇతరవిషయములనుండి మరలించి రంగముపై కేంద్రీకరింపచేయగలవు సామాజికుని మనస్సునందు వాసనారూపమున సుప్తమైయున్న భావము నుద్బుద్ధము చేయుటకు వాచికాంగికాభినయములు సమర్థములగుచున్నవి సంగీతనృత్యాదు లాభావమును పోషించుటకును సామాజికుని మనస్సును రంగస్థలమందలి పాత్రపై కేంద్రీకరింపజేసి తన్మయతను కలిగించుటకును సహాయపడుచున్నవి ఈవిధమున ప్రేక్షకుడు తన భౌతికపరిసరములను నిజజీవితవ్యవస్థను విస్మరించి భావనాజీవితమున తన్మయుడగుచున్నాడు ఈ పరిస్థితియే రసానుభూతి కవసరమగు నాధారము ఇట్టి శక్తి శ్రవ్యకావ్యమునకు లేదు రూపక ప్రదర్శనమునకుగల యీ వైశిష్ట్యము చాల ప్రాచీన కాలముననే మానవునిచే గుర్తింపబడినది మానవజీవితము భావ

నాత్మకమైనది. సకలకళాసృష్టికిని మానవుని యీ భావనాస్వభావమే కారణమైనది. భగవదంశములగు సౌందర్యాసక్తిస్ఫూర్తులు మానవునకు సంక్రమించినవి. కళాసృష్టియు సారస్వత సృష్టియు ఈ అంశాఫలితములే. రూపక మందొక విశిష్టరచన.

సాలభంజికాప్రదర్శనము రూపకప్రదర్శనమునకు మూలమని మరియొక అభిప్రాయము కలదు. దారుమయములగు బొమ్మలను పాత్రలుగచేసి, వానిని ప్రదర్శించుచు కథను నడపు నలవాటు ప్రాచీనకాలమునుండియు కలదు. చేతులు, కాళ్లు తల మున్నగు స్థూలభాగములు మాత్రమే కాక వ్రేళ్లు మున్నగు సూక్ష్మములగు దేహభాగములు కూడ వేరువేరుగ కల్పించి వానిని కీళ్ళచేకూర్చి యీ బొమ్మలను చేసెడివారు. బొమ్మదేహము బోలుగా నుండుటచే దారములను లోపలినుండి ప్రతియంగమునకును సంధించి వాని సాహాయ్యమున నాయా యంగములను కదలించుట కవకాశము కలదు. ఈ దారములన్నియు బొమ్మవీపులోనుండి వేర్వేరు అంగములకు ప్రసరించునవి యగుటచే ప్రదర్శకుడు వానిని గ్రహించి బొమ్మచే నంగవిక్షేపాదులను చేయింపగలుగుచున్నాడు. ఈ దారములకు సూత్రములని పేరు. ఈ సూత్రముల సాహాయ్యమున బొమ్మలనభినయింపజేయుచు సంభాషణలను తానే ప్రవర్తింపజేయుచు కథను నడపువాడు ప్రదర్శకుడగుటచే వానికి సూత్రధారుడని పేరు కలిగినదని యందురు. ఇట్టి సాలభంజికాప్రదర్శన మొక వృత్తిగా నొకవర్గమువారి కేర్పడినది. తరువాతికాలమున తోలుబొమ్మలాట దీనిననుసరించి యేర్పడినది. స్త్రీపురుషులే ఆయా పాత్రలవలె వేషములు ధరించి నటించుట బొమ్మల ప్రదర్శనముకంటె నాకర్షణీయముగను, సులభముగను తోచుటచే అట్టి రూపక ప్రదర్శనములు ఏర్పడినవని యందురు. సాలభంజికాప్రదర్శనమున కూడ సంభాషణాదులన్నియు బొమ్మల నాడించు వ్యక్తులే ప్రవర్తింపవలసియుండుటచే తామే యా బొమ్మల స్థానమున నిలిచి నటించుట సులభముగ గన్పడినది. అదికాక సన్నివేశానుగుణమగు అనుభవాదిప్రదర్శనకు కూడ నిందవకాశము కలదు.

ఇక వాచికాభినయరహితమై కేవలము అంగికాభినయ ప్రవృత్తమగు మూకాభినయము కూడ పూర్వము వ్యాప్తిలో నుండినట్లు తెలియుచున్నది. నేటికిని, జావా బాలీ ద్వీపములలో ఇట్టి మూకాభినయప్రదర్శనములు వ్యాప్తిలోనున్నవి. 1937 సంవత్సర ప్రాంతములో చీనాదేశపు దర్శకుడొకడు ఇట్టి శైలూషవర్గమును గూర్చికొని, రసవత్తరములగు వివిధకథలను ప్రదర్శించుచు భారతదేశపర్యటనము గావించినాడు. రామాయణమహాభారతాదులందలి సన్నివేశములు మాత్రమేకాక, ప్రజల నిత్యజీవితమందలి సంఘటనలు, సన్నివేశములు కూడ నిట్లు రసవంతములుగ ప్రదర్శితము లగుచున్నవి. ఇట్టి మూకాభినయప్రదర్శనములు ( Dumb Shows) ఆంగ్లదేశమునకూడ వ్యాప్తిలో నొకప్పుడుండినట్లు Shakespeare రచించిన Hamlet నాటకము సాక్ష్యమిచ్చుచున్నది. చాలకాలము మరుగుపడియుండిన యీ ప్రదర్శనములు నేడు సినిమారంగము వారి ప్రోత్సాహమున పునరుజ్జీవితములగుచున్నవి.

సూత్రమనగా నాట్యశాస్త్రసంబంధమగుసంప్రదాయమనియు, దానిని ప్రవర్తింప జేయువాడగుటచే ప్రదర్శకునకు సూత్రధారుడను పేరు కలిగినదనియు కొందరు.

సూత్రధారశబ్దము భారతమున మరియొక యర్థమున ప్రయుక్తమైయున్నది. యజ్ఞభూమి నిర్మాణసందర్భమున

> స్థాపతిః బుద్ధిసంపన్నో వస్తువిద్యావిశారదః
> ఇత్యబ్రవీత్సూత్రధారః సూతః పౌరాణిక స్తథా"

యని గలదు. వస్తువిద్యావిశారదుడు బుద్ధిసంపన్నుడు పౌరాణికుడు సూతుడు నగు సూత్రధారుడు స్థాపతి యని యీ వాక్యముచే వ్యక్తమగుచున్నది.

"యస్మిన్ దేశే కాలే చ మాపనేయం ప్రవర్తితం" అను తరువాతి వాక్యముచే యజ్ఞభూమినిర్మాణమునకై భూమిని కొలుచుట సూత్రధారక ర్తవ్యమని తెలియుచున్నది.

"పుష్యనక్షత్రయోగేషు శుక్లం సూత్రం ప్రసారయేత్"

అను వాక్యముచే యజ్ఞభూమిని కొలుచుటకు పుష్యనక్షత్రయోగము శుభలగ్నమనియు తెల్లనిదారముచే భూమినికొలుచుట ఆచారమనియు నర్థమగుచున్నది. ఈ సందర్భమునుబట్టి సూత్రధారశబ్దమునకు శిల్పాచార్యుడను నర్థము సిద్ధించుచున్నది. పౌరాణికుడగు సూతుడే తరువాతికాలమున యజ్ఞశాలాస్థాపకుడుగ నేర్పడియుండ వచ్చునని ఊహింపవచ్చును. చంద్రగుప్తుని నగరప్రవేశమునకు ముందు చాణక్యుడు పట్టణమందలి సూత్రధారులనెల్ల రావించి పురము నలంకరింపవలసినదిగా వారి నాదేశించినట్లు ముద్రారాక్షస నాటకమున వర్ణితమైయున్నది. దీనినిబట్టి సూత్రధారశబ్దమునకు శిల్పిముఖ్యుడను నర్థమున్నట్లు నిర్ణయింపవచ్చును. పై భారతశ్లోకమున సూతుడే సూత్రధారుడని యుండుటచే గాథాపాఠకుడగు పౌరాణికసూతుడే కాలక్రమమున రూపకప్రదర్శకుడుగా పరిణమించి యుండవచ్చునని తోచుచున్నది. బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునకు జన్మించిన సంతానమును సూతులని వ్యవహరించినట్లు కలదు. విలోమసంతానమేయైనను సున్నతవర్గము వారి సంతానమైన కారణమునను వారి ప్రాపున పెరిగిన కారణమునను నీసూతవర్గమువారు విద్యావంతులు శక్తివంతులు నై వృద్ధికివచ్చియుందురు. స్వశక్తి సామర్థ్యములపై నాధారపడియే వీరు జీవించవలసియుండుటచే ననేకములగు వృత్తుల నవలంబించి యందున్నతస్థానములను సంపాదించుకొనియుందురని తోచుచున్నది. యజ్ఞకర్మ యుద్ధ

వ్యాపారము, పురాణపఠనము, శిల్పము సారస్వతము—మున్నగు వానికి సంబంధించిన విషయములతో సూతుల కధికమగు ప్రసక్తి యున్నట్లు భారతాదులవలన వ్యక్తమగుచున్నది

గాధాపాఠకుడగు సూతుడు తనకు సహాయులుగ గాయకుల నేర్పరచుకొనియుండును వీరికి కుశీలవులను వ్యవహారము కలదు కొంతకాలమునకు స్త్రీలనుగూడ సహాయులుగగొని నృత్య సంగీతాభినయాత్మకముగ కధను వర్ణించుట పరిపాటియైనది [బొమ్మలకధ మున్నగు గాధలను ప్రదర్శించువారు నేడును ఈ పద్ధతినే యవలంబించుచున్నారు] ఈ సూతవర్గమే క్రమముగ కథయందలి ఆయా ప్రధాన పాత్రల వేషములను ధరించి సంభాషణలతో కధను నడపియుందురు సంగీతము నృత్యము అభినయము చేరిన కొంతకాలమునకు సాహిత్యము కూడ సహాయమై యుండును అవగా అభినయాత్మకప్రదర్శనము ప్రజామోదమును బడయుటతో రాజాదరణకూడ కలిగినది ఉత్సాహవంతులు, సరసులు, నగు కవులు రూపకములను రచించి ఈ సూతబృందముచే ప్రదర్శింపజేసియుందురు అంతకుపూర్వము సూతుడే రూపకకర్తయు ప్రదర్శకుడును నటుడును కూడనై యుండెనను టలో సందేహము లేదు అతని రచనలు కవితావిషయమున ఉత్తమములు కాకపోవుటచే శిష్టులగు కవులు తామై రూపకరచనకు పూనుకొనియుందురు సీతాప్రవాసవిషయమును ఇతివృత్తముగాజేసి వాల్మీకి రూపకమును రచించి దానిని ప్రదర్శనార్థమై భరతమునికి పంపించెనన్న ఉత్తరరామచరిత్రయందలి యంశము ఈవిషయమున ననుసంధింపదగును చిత్రనళీయము విషాదసారంగధర ప్రతాపరుద్రీయము కన్యాశుల్కము- మున్నగు శిష్ట రూపకములకు పూర్వ మాంధ్రదేశమున వ్యాప్తియందుండినవి వీధి నాటకములు వీనినే (వీధి) భాగవతములనియు వ్యవహరించెడివారు పంతొమ్మిదవ శతాబ్దపు కడపటిభాగమువరకును వినియే సామాన్యప్రజల కుపాదేయములైనవి రచనవిషయమున నాటకము ఉత్తమములుగా శిష్టులచే పరిగణింపబడలేదు తమిళ కర్ణాటక ప్రాంతములందును, బెంగాలు మహారాష్ట్ర ప్రాంతములందును కూడ రూపకపరిణామమ్మీమార్గముననే జరిగినదని ఆ వాఙ్మయచరిత్రలవలన తెలియుచున్నది దీనినిబట్టి భారతరామాయణాది మహాకావ్యముల ననుసరించిన వీరగాధలతో నారంభమైన లౌకిక సాహిత్యమును దానిని ప్రజలయందు ప్రచారము గావించిన సూతబృందమును రూపకోత్పత్తి రూపకప్రదర్శనలకు మూలములని తోచుచున్నది

భారతమున నటశబ్ద ముపయుక్తమైయున్నది కాని సందర్భమునుబట్టి చూడగా మూకాభినయప్రదర్శకు డను నర్ధముకూడ నందు సరిపోవుచున్నది రామాయణమునకూడ, నట, నర్తక నాటక సమాజ శబ్దములు కనపడుచున్నవి హరివంశ కాలమునాటికి నాటకప్రదర్శనము లుండినట్లు ఆధారములున్నవి భారత రామాయణముల కాలమున నాటకప్రదర్శనము లుండినవని రూఢిగ చెప్పుటకు తగిన యాధారములులేవు నట, నాటక శబ్దములు నర్తక అభినయములకుకూడ వాచకములని చెప్పవచ్చును ఐనను ఈ మహాకావ్యములు రూపకోత్పత్తికి మూలములని చెప్పుటకు అవకాశమున్నది వ్యాసశిష్యులచే వారర్థమైన భారతప్రచారము తరువాత పౌరాణికులచే ననుసరింపబడుచు వచ్చినది రామాయణమును నట్లే ప్రచారమైనది కధకు లనెడివారు వర్గములుగ నేర్పడి యీ గాధలను దేశమున ప్రచారమొనర్చినారు వీరిలో కథాసరళ నెరుగువారు పాఠకులనియు, వాని యర్థమును దేశభాషలలో వివరించువారు ధారకులనియు వ్యవహరింపబడెడివారు పాంచీస్తూపమున నిట్టి విధానము చిత్రితమైయున్నది వీరు సంగీతమును నృత్యమును గూడ సహాయముగగొని అభినయముచే తత్తత్కథాపాత్రల భావములను వ్యక్తీకరించుచుండిరని తెలియుచున్నది కాలక్రమమున వీరికి మహాకావ్యపఠన మొకవృత్తిగా నేర్పడినది [కర్ణాటాంధ్ర మహారాష్ట్ర దేశములందు మొన్నటివరకును వ్యాప్తిలోనున్న హరికథావిధానము గమనింపదగినది కధకులు పండితులు గాయకులునై యుండుట మాత్రమేకాక నృత్యమును గూడ ప్రయోగించుచుండిరి సుప్రసిద్ధాంధ్రకథకులగు నారాయణదాసుగారి కథాప్రదర్శనమును జూచినవారికీ విషయము సువ్యక్తము శ్రీ రామశాస్త్రిగారు మహారాష్ట్రదేశమున ప్రసిద్ధిగాంచిన కథకులు] ఈ వర్గమువారికి భరతులను పేరు కూడ కలిగినది మూకాభినయముచే క్రియారూపమున గాధలను ప్రదర్శించు వర్గమువారు కూడ తరువాతికాలమున నేర్పడినారు వీరికి శౌభికులని పేరు పూర్వగాధలందలి ముఖ్యఘట్టములను అనుక్రమణికగా చిత్రములుగా రచించి వానిని ప్రదర్శించు వర్గమువారు ఏర్పడినారు ఇట్టి చిత్రపట ప్రదర్శకు లిరువదియవ శతాబ్దారంభమువరకును దేశమున నందందు తిరుగుచు పొట్టబోసికొనుచుండినట్లు వినుచున్నాము చిత్రపటములను చుట్టలుగాజేసి పెట్టెలోనిమిడ్చి గాజుకటకము (Lens) సాహాయ్యమున ప్రదర్శించుట నేటికిని గలదు చిత్రపటప్రదర్శనము కొందరికి వృత్తిగా నుండినదని ముద్రారాక్షస నాటకమువలన తెలియుచున్నది అట్టి వేషమును ధరించియే జీవసిద్ధి రాక్షసుని అంగుళీయకమును సంపాదించినాడు కథలను రసవంతముగా వర్ణించి జీవించు వర్గముకూడ నొకప్పుడుండినది వీరు గ్రంధికులని వ్యవహరింపబడినారు ఇట్లు చిత్రపటప్రదర్శనములు మూకాభినయ ప్రదర్శనములు గాధావర్ణనలు మున్నగునవి దేశమున చిరకాలమునుండియు వ్యాపించియున్నవని తెలియుచున్నది పాణిని నటసూత్రములను పేర్కొనినాడు, అనద్యతనభూత విషయవర్ణనయందు వర్తమానక్రియారూప ప్రయోగమునుగూర్చి పతం

జలి విమర్శించియున్నారు జరిగిపోయిన విషయముల ప్రదర్శనము చూచినప్పుడును వాని వర్ణనము వినినప్పుడును మాత్రమే యిట్టి భాషాప్రయోగము సహజమగుచున్నదనియు నాకారణముచే పతంజలినాటికి శౌభికగ్రంథికాదివర్గము లేర్పడి యుండినవనియు Weber మున్నగు పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయము ఈ భాషాప్రయోగమును గూర్చి మొదట వివరించినవాడు కాత్యాయను డగుటచే కాత్యాయనుని నాటికే యిట్టి ప్రదర్శనములు దేశమున వ్యాప్తియందుండినవని చెప్పవలసియున్నది పతంజలినాటికి రూపకప్రదర్శనము సర్వాంగసమగ్రముగ గాకున్నను ప్రాథమికదశ యందైన నుండినదని చెప్పుట కవకాశమున్నది తరువాత కృష్ణ సంబంధములైన గాథలును రామాయణ గాథలును భారత గాథలును ఏదో రూపమున ప్రదర్శితములగుచు వచ్చినవి బౌద్ధమత ప్రచారమునకు రూపకప్రదర్శనము కూడ నొక సాధనమైనది బౌద్ధ మత ప్రాథమికదశలలో రూపకసందర్శనము పరిత్యాజ్యమని భిక్షువులకు ఆదేశముండినది కాని తరువాతికాలమున రూపకములు మతప్రచారసాధనములుగ బౌద్ధులచే నంగీకృతములైనవి బుద్ధుని జీవితగాథలు ప్రదర్శన యోగ్యములగు రూపకములుగ దేశభాషలగు ప్రాకృతములలో రచితములైనవి 'కువలయ' యను స్త్రీ సుప్రసిద్ధనటిగా నాకాలమున పేరు వడసినది బుద్ధభిక్షువు లామె కళాసౌందర్యములకు ముగ్ధులైరనియు, నంత బుద్ధదీక్షను స్వీకరించెననియు నొక నైతిహ్యముకూడ కలదు బింబిసారుని కాలమున నాటకప్రదర్శనము లుండినవని తెలియుచున్నది అశ్వఘోషుని రూపకములు మనకు లభించిన ప్రాచీన బౌద్ధరూపకములు బౌద్ధులు నృత్యగీతాభినయాదికళలను ఎక్కువగ పోషించిరనుటకు అజంతా శిల్పములే సాక్ష్యములు పాపపుణ్యములు సంఘర్షణను ఇతివృత్తముగజేసి బౌద్ధులు రూపకములను రచించి టిబెట్టుదేశమున ప్రదర్శించుచుండిరనియు తెలియుచున్నది జైనులుకూడ లలితకళలకు ప్రథమమున విముఖులే యయ్యును కాలక్రమమున తమ మత వ్యాప్తికి సాధనములుగా వాని నంగీకరించారు

వీనినన్నిటినిబట్టి, క్రీస్తుపూర్వము ద్వితీయశతాబ్ది మధ్య కాలమునాటికి సంస్కృతనాటకము ఏర్పడియుండునని Keith పండితుని అభిప్రాయము నాట్యశాస్త్రమునుబట్టియు సంస్కృత నాటకములనుబట్టియు వ్యవహారప్రాకృతములకు రూపకములలో ప్రాధాన్యమున్నట్లు వ్యక్తమగుచున్నది రూపకములు తొలుత ప్రాకృతభాషలందే రచితములైనవనియు, తరువాతికాలమున, శిష్ట కవులచే సంస్కృతము చేర్పబడెననియు కూడ నొక అభిప్రాయము కలదు రూపకరచన పామరజనుల ప్రయోజనము నుద్దేశించినది యగుటచే అట్లు జరిగియుండుట అసంభావ్యమును కాదు శిష్ట పండితులు రానురాను ఈ ప్రదర్శనములందాసక్తులై సంస్కరించు నుద్దేశముతో నందందు మార్పులను గావించియుందురు ఉత్తమ పాత్రల భాషను సంస్కృతముగ జేసియుండవచ్చును రూపక ప్రదర్శనములలో [పాత్రధారులెల్లరును సాధారణముగ సామాన్య వర్గమువారే యై యుందురు [నటవర్గమువారు గౌరవార్హులుగ పరిగణింపబడకుండుటయే యిందులకు సాక్ష్యము] అట్టిచో వారు తమకు సహజమగు ప్రాకృతములను వ్యవహరించుటయే సమంజసము సులభము కావుననే ఆయాపాత్రల వ్యవస్థనుబట్టి భిన్న ప్రాకృతములు రూపకములలో జేరినవి తరువాతికాలమున నాటకములను రచించిన కాళిదాసాదులు తమనాటకములందలి ఉదాత్త పాత్రలకు గౌరవమును గూర్చుటకై సంస్కృతమును వాడి ఇతర పాత్రలకు దేశభాషలగు ప్రాకృతములనే వాడియుందురు రాజాస్థానగౌరవము లభించునాటికి శిష్టవర్గమువందలివారు కూడ నాటకములలో పాత్రలను ధరించుటకు సాహసించియుండవచ్చును

ప్రాచీనకాలమునుండియు భారతీయులకు మతవిషయములం దాసక్తి యేర్పడినది కనుక కృష్ణరామాది అవతారపురుషులకు సంబంధించిన గాథలు ప్రదర్శనములుగ నేర్పడినవి రూపకసందర్శనముచే భారతీయు లుద్దేశించినది వినోదము మాత్రమే కాదు వినోదము న్యాయధర్మాదిజ్ఞానము ఆత్మికత జీవితసంస్కారము— ఇత్యాదులన్నియు రూపకప్రయోజనములుగ నుద్దిష్టములు కావున పురాణగాథలే యెక్కువగ రూపకములం దితివృత్తములైనవి. సాలభంజికాప్రదర్శనములందు కూడ పురాణగాథలే యితివృత్తములు సాలభంజికా ప్రదర్శనములును, ఛాయానాటకములును కూడ భారతదేశమున ప్రచారమునందుండినవని Konow పండితుని అభిప్రాయము మహాభారత, కథాసరిత్సాగర బృహత్కథ బాలరామాయణాదులను బట్టి సాలభంజికాప్రదర్శనములు వ్యాప్తిలో నుండినవని చెప్పవచ్చును సుభటుడు రచించిన "దూతాంగదము" ప్రాచీన ఛాయానాటకమని విమర్శకాభిప్రాయము కాని యీ ఛాయానాటకములనుండియే నాటకము లేర్పడినవని చెప్పుట కాధారములు లేవు "రూపోపజీవ" "జాయాజీవ" శబ్దములకు Konow పండితుడు కల్పించిన అపార్థములే పై అభిప్రాయమునకు కారణము లగుచున్నవి ఈ శబ్దములు నటులనుగూర్చిన నిందావాచకములు భార్యాసౌందర్యము నాధారముగ జీవించువాడని వీని కర్థము రూపక పరిణామచరిత్రయందు సాలభంజికాప్రదర్శన ఛాయానాటక మూకాభినయాదులు భిన్నశాఖలై యుండుననుటయే సమంజసము సంస్కృతనాటకము పౌరాణికగాథాపఠనము మూలముగ స్వతంత్ర పరిణామమునకులోనై అభివృద్ధిచెందినదని మాత్రమే చెప్పగలము.

అంకవిభజనము అవస్థావిభాగము ప్రవేశనిష్క్రమణ జనాంతికాద్యుపాయములు అంకాస్య అంకావతారాది కార్యోపక్షేపకములు మున్నగువిషయములలో రోమనునాటకమునకును సంస్కృత నాటకమునకును గల సాదృశ్యమునుబట్టి గ్రీకునాటకమునకు

సంస్కృతనాటకముపై ప్రాబల్యము కలదని కొందరందురు "యవనిక" "జవనిక" శబ్దములుకూడ ఈయభిప్రాయమునకు కారణములైనవి కాని, ఈ యవనికాశబ్దమునకు నాటకరంగమందలి తెరతో ప్రత్యేక సంబంధము లేదు వస్త్రియాకు సంబంధించిన వస్త్రవాచక మీశబ్దము సంపన్నుల గృహములందుకూడ నీయవనిక లుపయుక్తములైనవి అట్టి వస్త్రములు భారతదేశమున కతిప్రాచీన కాలముననే వచ్చియుండవచ్చును అదికాక గ్రీకునాటకములలో తెర లుపయోగింపబడెననుట కాధారములును లేవు అట్లే భారతదేశమందలి రాజులదేహరక్షకులుగా చిత్రితులైన యవను లనెడు స్త్రీపాత్రలు (యవనీ—ఏకవచనము) గ్రీకునాటకములలో కానము గ్రీకుదేశపు వర్తకులు సుందరులగు గ్రీకుయువతులను భారతదేశపు రాజులకు కుప్పలుగా విక్రయించినారు వారు రాజులకు దేహరక్షకులుగా నేర్పడినారు ఇక పై పేర్కొనిన అంకవిభజనాదులు నాటకరచనయందు తప్పనివి రత్నావళి మాలతీమాధవ మాళవికాగ్నిమిత్రముల వంటి నాటకములందలి యితివృత్తము గ్రీకుప్రాబల్యముచే నేర్పడినదని యొక్క అభిప్రాయము కలదు సాహిత్యమున ఇతివృత్తవిషయక సాదృశ్యములు తప్పవు ధీరలలితనాయకులను శృంగారసన్నివేశములను భారతీయు లెరువుతెచ్చుకొనవక్కరలేదు ఈవిషయములలో మనదేశపురాజులదే గురుస్థానమని ఖండితముగ చెప్పవచ్చును రామాయణ కథావృత్తాంతమునకును ట్రోజన్ యుద్ధ వృత్తాంతమునకును కొన్ని విషయములలో సాదృశ్యము కలదు భారతకథకు "ఇలియడు" కథతో సామ్యములు లేకపోలేదు అంతమాత్రముచే నన్యోన్యప్రాబల్యమును ప్రతిపాదించుట పొసగదు విదూషక విట, శకారపాత్రలు కూడ గ్రీకునాటకముల నుండి గ్రహింపబడినవను అభిప్రాయమును నిట్టిదియే విటశకారుల వంటి వ్యక్తులు భారతసంఘమున నాడును నేడును కూడ కలరు

ప్రాచీనసాహితీకర్తలు ప్రయత్నపూర్వకముగ గావించిన విశిష్టనిర్మాణము నాటకము కవితారచన నాటకనిర్మాణమునందు పరాకాష్ఠదశ నందినదని పండితాభిప్రాయము ప్రాథమికదశలో రూపకరచన ప్రజానీకమునుద్దేశించి ఆరబ్ధమైనను, రానురానది ఉన్నతవర్గములవారి ప్రయోజనమునకే యుద్దిష్టమైనదని చెప్పక తప్పదు గ్రీకు రోము మొదలగు దేశములలో నాటకములు ప్రజామోదమును బడసినట్లు సంస్కృతనాటకములు ప్రజానీకమున కుపకరింపలేదు అను నభిప్రాయమునందు సత్యము లేకపోలేదు శాకుంతలాది నాటకములు రచితములైన తరువాతికాలమున కూడ పురాణపఠనములకు సారభంజికా ప్రదర్శనములకు, వీరగాథాగానములకు దేశమున గలిగిన వ్యాప్తినిబట్టి సంస్కృతనాటకములు సామాన్యప్రజలకు ఎక్కువ ప్రయోజనకరములు కాలేదనియే చెప్పవలయును నాటకరచన, చాలవరకును రాజాస్థానములనే అంటి పెట్టుకొన్నది నాటకకర్తలు కూడ రాజాస్థానముల నాశ్రయించిన బ్రాహ్మణకవులైయున్నారు వేదాంతాదిశాస్త్రములు బ్రాహ్మణక్షత్రియవర్గములకు మాత్రమే ఉద్దిష్టములైనట్లు నాటకరచనకూడ ఉన్నతవర్గములవారికే యెక్కువ ప్రయోజనకారి యయినది సంస్కృతభాషకు ప్రాధాన్యమేర్పడుటతో రూపకములు ప్రజాసమూహమునకు దూరములైనవి

ఆకాలపు కవులు భారతీయసంస్కృతిని జీర్ణించుకొన్న పండితులు భారతీయతత్త్వశాస్త్రము వారికి శల్యగతము కావున వారి సారస్వతరచనయంతయు చాలవరకు, లౌకికాతీతమగు మార్గమున నడచినది కావ్యరచనయందు ఇతివృత్తము ఆలంబనము మాత్రమే దాని యాధారమున జీవితతత్త్వము, కర్మసిద్ధాంతము ధర్మన్యాయప్రవృత్తి వర్ణాశ్రమవ్యవస్థ మున్నగువానిని వివరించుట వీరు ప్రధానముగా పరిగణించినారు ఈకారణముననే భారతము భారతీయవిజ్ఞానమున కంతకును నిలయమైనది. భారతరామాయణహరివంశాది మహాకావ్యముల రచనావిధానము నాటకములకు ఆదర్శమైనది నాటిరచనయందు కూడ కవులావిధానమునే యనుసరించినారు లోకమందలి వాస్తవస్థితిని పోషించుటకుమారుగ నాటకములను భావనాత్మకవిషయప్రధానముగ చేసినారు మానవప్రకృతిసహజములగు ప్రవృత్తులను యథాతథముగ వీరు నాటకములలో చిత్రింపరు ఆదర్శమున కనుగుణమగున ట్లితివృత్తమును పాత్రల ప్రవృత్తులను చిత్రించుట వీరిపద్ధతి సర్వవిషయములను భారతీయ సంప్రదాయముల కనుగుణముగ నుండునట్లు పోషించుట పరిపాటియైనది ఎట్టిసందర్భమందైనను భార్య భర్త నధిక్షేపించుటకాని, తమ్ము డన్నకు మారాడుటగాని అన్యాసక్తుడగు భర్తకు ప్రతికూలముగ భార్య ప్రవర్తించుటగాని నాటకములలో జరుగుటకు వీలులేదు భారతీయసంప్రదాయ మట్టిది కాని మానవజీవితమందు మనకు గోచరమగువ్యవస్థ తద్భిన్నమనుటలో సందేహములేదు భారతీయసాంఘికవ్యవస్థకంతకును మతమే ఆధారమగుటచే మతసూత్రముల ననుసరించి సాంఘికవ్యవస్థను నడుపుట మన కాచారమైనది తద్విరుద్ధములైన ప్రవృత్తులు సహజములేయైనను అవి సంఘమునందు బహుళములేయైనను వానిని మనవారాదరింపలేదు మతసూత్రములకును వానిననుసరించి రచింపబడిన ధర్మశాస్త్రములకును విరుద్ధములుగ గోచరించు మానవసహజప్రవృత్తులను మనవారు గ్రహింపలేదు ఆకారణముచే నాటకమునందలి ఇతివృత్తము, పాత్రపోషణ మున్నగునవియన్నియు సంప్రదాయబద్ధమగు నొకప్రణాళిక ననుసరించి నడచినవే కాని మానవప్రకృతి ననుసరింపలేదు కావుననే ప్రకృతివైవిధ్యము నాటకములందెక్కువగ కానరాదు మృచ్ఛకటికవంటి ఏ ఒకదానియందో తప్ప సాంఘికసహజప్రవృత్తి కితరనాటకములలో ప్రాధాన్యములేదు పాశ్చాత్యనాటకము

లకును భారతీయనాటకములకును గల ముఖ్యభేదములలో నిది యొకటి ఇతివృత్త మత్యుదాత్తమైనది కావలయుననెడి నిర్ణయముతో నాటకరచనకూడ ఉదాత్తమార్గమున నడవక తప్పదు పోషితములగు భావములు అభిప్రాయములు కూడ సాధారణజీవితమునకు దూరములగుటయు తప్పదు ఈ కారణముంచే శాకుంతల ఉత్తరరామచరిత్ర మహావీరచరిత్ర రత్నావళి నాగానంద విద్ధసాలభంజికాది రూపకములకు సాధారణమానవజీవితముతో సంబంధ మెక్కువగ లేకపోయినది పాశ్చాత్యనాటకములలో కూడ Macbeth, Hamlet Othello మున్నగు నుదాత్తభావప్రధానములగు నాటకములతో సామాన్యజీవితమునకు సంబంధము స్వల్పమనియే చెప్పవలెను కవను ఆనాటకములలో పాత్రల స్వభావములు ప్రవృత్తులు మున్నగునవి వారివారి ప్రకృతుల కనుగుణముగ ప్రకృతిసహజముగ పోషితములైనవి రాజును చంపుటకిష్టపడక వెనుదీయుచున్న భర్తను పిరికివాడని అధిక్షేపించి అతనిని పాపకార్యమునకు పురికొల్పు "మాక్బెత్‌సతి"యందును పాపియగు "క్లాడియసు"కు వశమై కుమారుని హృదయమును గ్రహింపలేని హామ్లెట్ తల్లియందును ఇట్టి మానవప్రకృతి పోషితమైయున్నది భారతీయనాటకములం దట్టిస్వాతంత్ర్యమును కవి వహింపలేడు కావున సంస్కృతనాటకరచన వాస్తవికతకు దూరమైనది

సంస్కృతినాటక రచనయందు కవి ప్రధానోద్దేశము రసపోషణ పాశ్చాత్యనాటకములలో ఇతివృత్తపోషణ పాత్రపోషణలు ప్రధానవిషయములు వస్తువును కార్యరూపమున ప్రవర్తింపజేయుచు తదనుగుణముగ పాత్రల స్వభావాదులను వ్యక్తపరచి నాటకప్రయోజనమును సాధించుట పాశ్చాత్యరూపకకర్తల ఆశయము ఆనుషంగికముగ జరుగు రసపోషణ పీఠికితోడై సామాజికుల చిత్తవికాసమునకు హృదయరంజనమునకు హేతువగుచున్నది ఉద్దిష్టరసము ప్రేక్షకుని హృదయమునం దుద్బుద్ధమగునట్లొనర్చి, తద్వికాసముచే నతనికి తన్మయతను గూర్చుట భారతీయరూపకకర్తల ఆశయము ఇతివృత్తవిభజనము సన్నివేశకల్పన, ప్రతిపాద్యములగు భావములు విశ్వాదులన్నియు రసపోషణ కనుకూలింపవలెను సంగీతనృత్యాదుల ప్రయోజనముకూడ నిదియే వచనమునకు రసపోషకశక్తి తక్కువయగుటచే ఛందోబద్ధములగు శ్లోకములు, గీతములు నుపయుక్తములైనవి. విక్రమోర్వశీయ చతుర్థాంకమును పరిశీలించినచో గీతములెట్లు భావావిష్టుడైన నాయకుని చిత్తవృత్తిని వ్యక్తపరచి విప్రలంభశృంగారమునకు పోషకములగుచున్నవో వ్యక్తముకాగలదు నాటకమునం దితివృత్తమును సంశ్లిష్టముగ నొనర్చుట, అనేకపాత్రప్రయుక్తమొనర్చుట, వివిధభావప్రవృత్తి కాకరమొనర్చుట—మున్నగునవి ప్రేక్షకచిత్తచాంచల్యమునకు హేతువులై, తన్మయతకు విచ్ఛేదమును కలిగించును అది రసపోషణకు భంగకరము కనుకనే ప్రాచీనులు నాటకములను ఏకనాయకేతివృత్తప్రధానములుగ నొనర్చి తక్కినభాగములను దానికంగములుగ పోషించియున్నారు ప్రసిద్ధేతివృత్తమును గ్రహించుటలో కూడ రసోత్పత్తియే యుద్దిష్టమైనది ఇతివృత్తము ప్రసిద్ధమైనదగుచో ప్రేక్షకునిమనస్సు కథపై కేంద్రీకరించుట కెక్కువ అవకాశముండును నాయికానాయకుల భావములను గూర్చిన జ్ఞానము సామాజికుల కున్నకారణమున భావనావ్యాపారమున కవకాశ మేర్పడుచున్నది నాటకసన్నివేశములు అభినయము విశ్వాదులు రసోత్పత్తికి పోషకములగుచున్నవి కవి యితివృత్తమున గావించు మార్పులకుగూడ రసపోషణయే ప్రయోజనమగుచున్నది ఆశ్రమవాసినియగు ముగ్ధశకుంతల నాగరకుడును విటుడు యువకుడు నగు దుష్యంతుని మోహించి, ఇంద్రియవశంవదయై అతనికి లోబడుట ప్రకృతిసహజమగు విషయము ఇట్టి యువతీయువకుల ప్రణయప్రవృత్తి శృంగారరసపోషణకు ఉపాధి కనుకనే కాళిదాసు భారతమునందువలె రాజ్యప్రాప్తివిషయకవరమును శకుంతలచే అడిగింపలేదు లాభాదివిషయకప్రసక్తి యేమాత్రము లేక యువతీయువకులు ప్రణయబద్ధులై ప్రవర్తించుటయే శృంగారరసపోషణకు ఆధారము అట్లే దుర్వాసశాపవిషయము అంగుళీయకవృత్తాంతము అవసరములైనవి ఇవి లేనిచో శకుంతలాదుష్యంతుల పునస్సమాగమము శృంగారరసపోషకము కాజాలదు మనఃపూర్వకముగ ప్రేమించి పరిణయమాడిన దుష్యంతుడు నిష్కారణముగ తన్ను విస్మరించినాడనెడు శల్యము మనస్సున నున్నంతకాలము పునస్సమాగమము సాత్త్వికమగుట కాని రతిభావ ప్రధానమగుటకాని జరుగదు గాఢముగ ప్రేమించుకొన్న శకుంతలా దుష్యంతులు దుర్వాసశాపకారణముచే వియోగమునందెంది శాపావచ్ఛేదముతో పరస్పరసమాగమమునకై పరితపించుచుండి అకస్మాత్తుగ నట్టి సమాగమమును గాంచుట శృంగారరసపోషణకు అవసరము అట్టి సన్నివేశమునే కాళిదాసు కల్పించినాడు భవభూతియు నట్లే రసపోషణకై ఇతివృత్తమున గావించిన కల్పనలు గమనింపదగినవి

కరుణరసమును పోషించు నుద్దేశముతో ఉత్తరరామచరిత్ర తృతీయాంకసన్నివేశము కల్పితమైనది దేహములు భిన్నములైనను ఏకమనస్కులై విరహదుఃఖము ననుభవించుచున్న సీతారాములకు విచిత్రమగు సమాగమమును కల్పించి హృదయవిద్రావకమగు కరుణరససృష్టిని, కవి పోషించినాడు తానై చేతులార పొగొట్టుకొన్న సీతావృత్తాంత మెట్టిదైనదియు తెలియక ఆమెవలని వియోగమును భరింపలేక పూర్వమున తానామె సహచర్యము నందనుభవించిన ఆనందమును చిరపరిచిత జనస్థానదృశ్యములచే స్మరించుకొని హృదయావేగముచే మాటిమాటికి మూర్ఛితులోనగుచున్న

రామునియవస్థ నొకవైపునను—లావణ్యవంతము వలచి వలపించుకొన్న భర్తవలని వియోగమును పండ్రెండేండ్లకాల మనుభవించి అపుడకస్మాత్తుగ కలిగిన భర్తృసందర్శనముచే సంతోషదుఃఖము లొక్కసారిగ నుప్పతిల్లుచుండ ప్రత్యక్షముగ నతని సమీపించుటకు వినయమకారణమున సాహసింపజాలక అతని దీనావస్థనుచూచి భరించలేక పరితపించు సీతయవస్థ నొకవైపునను—వీరిరువురి యవస్థలను చూడలేక దుఃఖమునకు లోనగుచున్న తమసావాసంతుల చిత్తపరిస్థితిని మరియొకవైపునను అసాధారణవిధముగ పోషించి భవభూతి సామాజికుల హృదయములను ద్రవింపజేసినాడు ఇట్లు ఇతివృత్తమున గావింపబడిన మార్పులన్నియు రసపోషణకుద్దిష్టములైనవి

భావములను రసములను పోషించుటయందు కూడ భారతీయరూపకకర్తలకు స్వేచ్ఛ తక్కువ మతసాంప్రదాయముల ననుసరించి అనుగుణములగు భావాదులకు మాత్రమే నాటకములలో ప్రవేశము కలిగినది మరియు భారతీయ కర్మసిద్ధాంతము ననుసరించి మానవుని జీవితపరిస్థితులు నిశ్చితములగుచున్నవి మానవుని ప్రవృత్తికంతకును నిట్లు పూర్వజన్మసంచితప్రాబల్యమే హేతువని అంగీకరించుటతో మానవునకు వ్యక్తిత్వస్వాతంత్ర్యములు తగ్గినవి. మానవప్రవర్తనకు ప్రధానప్రేరకమగు మనస్తత్వమునకు ప్రాధాన్యము లేకపోయినది జీవిప్రవృత్తికిని అతడనుభవించు ఫలమునకును పూర్వజన్మకర్మపరిపాకము కారణమనెడి సిద్ధాంతముతో కొంతవరకు సాహిత్యమున తాత్త్వికదృష్టి ప్రధానమైనది మానవ సహజప్రకృతి మానవజీవితమునకు ప్రకృతిశక్తులతో నేర్పడు సంఘర్షణ మున్నగునవి విస్మృతములైనవి ఈకారణముచే భారతీయ నాటకములలో మానవప్రకృతి సరిగా చిత్రితమైయుండలేదనెడి విమర్శ కవకాశ మేర్పడినది పాత్రల హృదయములందు భావసంఘర్షణ కవకాశమేర్పడినచో ప్రేక్షకుల మనసులందుకూడ నట్టి సంఘర్షణ మేర్పడి రసభంగహేతువు కాగలదు కావున భావసంఘర్షణ (Conflict of emotions) మానవజీవితమున స్వాభావికమేయైనను మన నాటకములలో పోషించుటకు వీలులేకపోయినది ఈకారణమువల్లనే పాత్రపోషణమునకూడ ఉద్దిష్టరసమున కనుగుణమగు మార్గమునే అనుసరింపవలసివచ్చినది ప్రతినాయకుని యం దుదాత్తములగు గుణములెన్నియున్నను వానిని పోషించుట అనుచితమైనది అట్లు పోషించినచో సామాజికుల కతనియందొక విధమగు నాసక్తిగాని లేదా, సానుభూతిగాని కలుగుటయు, తత్కారణమున ఉద్దిష్టరసమునకు భంగముకలుగుటయు జరుగును కావున ప్రతినాయకపాత్రను స్వాభావికస్థితికి కొంత దూరముగ నుండునట్లు పోషింపవలసివచ్చినది ఈ విషయమున భారతరామాయణ కవులు వహించిన స్వాతంత్ర్యముకూడ నాటకకవులు వహింపరైరి రత్నావళి—మున్నగు నాటికలందలి ఇతివృత్తమును గమనించినచో ఈవిషయ మింతయు బాగుగ వ్యక్తముకాగలదు సరసుడగు నాయకుడు బహుపత్నీకుడై యుండియు నాయికాసక్తుడగుట కుటుంబశాంతి భంగమునకు కారణముకాకపోదు నాయకుని ప్రియులు ఈర్ష్యాపరులగుటయు తత్ఫలముగ వారు హృదయక్షోభకు లోనగుటయు తప్పదు ఇట్టి పరిస్థితి కొంతవరకు విక్రమోర్వశీయమాళవికాగ్నిమిత్రములలో సూచితముకూడ నైయున్నది కాని సహజస్థితిననుసరించి వానిని చిత్రించుట శృంగార రససిద్ధికి భంగకరము శృంగారమును పోషించి సామాజికుల నానందింపచేయుటయే కవి సాధింపదలచిన ప్రయోజనమగుటచే ప్రకృతిసహజములగు నిట్టి విషయములను స్పృశింపక, రసానుగుణములగు విషయములను మాత్రమే గ్రహించినాడు

రూపకేతివృత్తములను లోకజీవితమునుండి గ్రహింపక భారతరామాయణాదులనుండిమాత్రమే గ్రహించుటవలన కూడ భారతీయనాటకములు వాస్తవికతకు దూరమైనవి ఉదాత్తభావములను ఉన్నతాదర్శములను ప్రతిపాదింపదలచిన నాటకరచయితలకు రామునివృత్తాంతమును పాండవుల యితివృత్తమును అట్టి సన్నివేశముల నొసంగినవి కాని కథాసమస్తమును నాటకోచిత వస్తువు కాజాలదు కొన్ని ఘట్టములు మాత్రమే రసవత్తరములై ప్రదర్శన యోగ్యములుగ నుండును ఈసంగతి గమనింపనిచో రచనలు ప్రదర్శనయోగ్యములు కాజాలవు అనర్ఘరాఘవ ప్రసన్నరాఘవ మహావీరచరిత్రము- మున్నగు నాటకములన్నియు నీకారణమువనే ప్రదర్శనయోగ్యములు కాలేదు ఇతివృత్తమును లోకజీవితమునుండి గ్రహించిన మృచ్ఛకటికవంటి రచనలకు గల ఆకర్షణశక్తి యితరములకు లేదు నాటకములందు ప్రతిపాదితములైన భావములుకూడ సాధారణజీవితమునకు దూరములైనవి విద్యావంతులు, తాత్త్వికులు నగువారిచే మాత్రము గ్రాహ్యములగు భావములే సర్వత్ర పోషితములైనవి కంచుకి వ్యక్తపరచు భావము లిందులకుదాహరణములు

"సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః"
"మనోరథానా మతటాః ప్రవాహాః"
"లోకోత్తరాణాం హి చేతాంసి కో జ్ఞాతు మర్హతి"
"సేవావృత్తి శ్శ్వవృత్తిః"

మున్నగునవి యనేకముల నిందులకుదాహరణములుగా నీయవచ్చును

భావోన్నతిననుసరించి భాషయు వ్యవహారమునకు దూరమైనది అలంకారములు, వక్రోక్తి ఉక్తిచమత్కృతి వ్యంగ్యార్థస్ఫూర్తి ఇత్యాదులకు ప్రాధాన్యమేర్పడినది రాజాస్థానమందలి

పండితులు విద్యావంతులగు నాగరకులు మాత్రమే యీనాటకముల నాదరించు స్థితి యేర్పడినది ప్రాకృతములమాట యెట్లున్నను నాటకములందలి సంస్కృతము ఆడంబరము కృత్రిమము నైనది భారతరామాయణములందలి భాషాపారశ్యమును తరువాతి శ్రవ్య కావ్య కవులు పాటింపవచ్చే, కాని భాషను తరువాతి నాటకకవు లనుసరింపలేదు మాఘునిశిశుపాలవధ శ్రవ్యకావ్యములకును భవ భూతిరచనలు నాటకకవులకును ఆదర్శములైనవి

రాజులు మంత్రులు, విద్యావంతులగు శ్రీమంతులు సంస్కృతకవులకు పోషకులగుటచే, కవు లట్టివారి జీవితములనే యితివృత్తములుగాజేసి రూపకములను రచించివారు రాజాంతః పురములందలి ప్రణయగాధలు ఉద్యానవనములందలి నాయికా నాయకసమావేశములు, అంతఃపురస్త్రీల పుష్పాపచయ మన్మధా రాధన జలక్రీడాదులు నాయకవిదూషకుల సన్నాగములు, సుషి ర స్తంభాంతరములలో నాయికావిహారములు ప్రేయసీవిముక్తుడైన నాయకు డున్మాదావస్థయందు వనమునచేయు రోదనములు ఇత్యా దులు సామాన్యుల జీవితావధిలోనివి కాకపోవుటచే సంస్కృత నాటకములు ప్రజల కుపకరింపకపోయినవి కావుననే భారత రామాయణాది పురాణములపఠనము వీరగాధాప్రదర్శనములు బొమ్మలాటలు వీధినాటకములు మున్నగునవి ప్రజల కుపాదేయ ములైనవి అట్టి ప్రదర్శనములలో కూడ యితివృత్తములు పురాణ ములందలివే యనుట గమనింపదగిన విషయము భారతీయులకు మతమునందుగల ఆసక్తియే యిందులకు కారణమని పండితమహా శయుల స్వాభిప్రాయము కాని, ఉపజ్ఞకలవారెవ్వరును జీవితసన్ని హితమగు యితివృత్తమును నాటకమున రచింపకపోవుట యిట్టివని స్థితికి కారణమనుటయే నిజము వీరగాధాగానము సాలభంజికా ప్రదర్శనము తోలుబొమ్మలాట - మున్నగునవి విద్యాహీనులగు నౌకవర్గమువారికి వృత్తులుగా నేర్పడినవి వంశపరంపరగా వారికి వచ్చిన కథలను గానముచేయుట ప్రదర్శించుట మాత్రమే వారు చేయగలిగినవారు కాని నూతనవస్తువునుగొని నాటకరచన గావించు శక్తి వారికి లేకపోయినది కాలాంతరమున నట్టి నాటకములు కొన్ని సాహసులగు కొందరు విద్యావంతుల విప్లవప్రయత్న ఫలి తముగ నేర్పడినవి మహారాష్ట్రదేశమున పుండరీక తులసీగాన జ్ఞానదేవ సక్కూబాయి మీరాబాయి మున్నగు భక్తుల కథలు నాటకములుగ ప్రదర్శింపబడజొచ్చినవి అంతటితో పురాణగాధలు వెనుకబడినవి "శివాజీచరిత్ర" "తానాజీ మాలుసురే వీరగాధ" ఇత్యాదులు ప్రజల నాకర్షించునట్లు భారతరామాయణగాధలు ఆకర్షిం చుటలేదు నాటకకర్త నటుడు ప్రదర్శకుడు నగు "వామనరావు" కర్ణాటకభాషయందు రచించి ప్రదర్శించిన "బాజీరావునాటకము" కర్ణాటకదేశమునం దెక్కువగ నాదరింపబడినది ఆంధ్రదేశమున బొబ్బిలికథ రామదాసుచరిత్ర భక్తకబీరు ప్రతాపరుద్రీయము మున్నగునవి పౌరాణికనాటకములను వెనుకకు త్రోక్కినవి పాశ్చాత్యసాహిత్య సాహచర్య కారణమున సృష్టికివచ్చిన కన్యా శుల్కమువంటి నాటకము లెట్లు ప్రజల నాకర్షించినవో విదితమే ఈ విధముననే హిందీ వంగ కర్ణాటాది రాష్ట్రములలోకూడ నవ్యరూపకరచన ప్రజాజీవితమునకు సన్నిహితమై ప్రేక్షకులకు చిత్తవికాసమును సంస్కృతిని కలిగించుచున్నది




## కిన్నెర చందా వివరం

| | | |
|---|---|---|
| విడి కాపీ | 6 | అణాలు |
| అర్ధ సంవత్సరం చందా | 2 | రూపాయలు |
| సంవత్సరం చందా | 4 | రూపాయలు |

మేనేజరు కిన్నెర, 16, జోన్సు వీధి, మదరాసు-1

# పూల తోరణము

## తెలుగు విజ్ఞాన సర్వస్వం

తెలుగు భాషా సమితివారు విజయ ఉగాది పండుగ సందర్భంలో "చరిత్ర—రాజనీతి" సంపుటం ముద్రణ ప్రారంభోత్సవం హిందీ ప్రచార సభ కార్యాలయంలో జరిపారు. శ్రీ వేదేపల్లి నరసింహస్వామిగారు పంచాంగం చదివి వినిపించారు.

ఈ సందర్భంలో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు "ఉగాది—సౌరమాన చాంద్రమానాలు" అనే విషయాన్ని గురించి ప్రసంగించారు. శ్రీ శర్మగారు తమ ప్రసంగంలో సౌరమాన చాంద్రమానాలలు పంచాంగం సౌరమాన చాంద్రమానాలకుగల పరస్పర సంబంధం మొదలగు విషయాలను వివరించారు.

విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకులు డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారు విజ్ఞాన సర్వస్వ ప్రకటనకు తెలుగు భాషా సమితి ఏర్పడిన నాటనుంచి నేటివరకు జరిగిన వృత్తాంతమును ఈ సంపుటాలు ఏ పద్ధతిమీద ప్రకటిస్తున్నదీ వివరంగా చెప్పి "చరిత్ర—రాజనీతి" సంపుటం నేడు ముద్రణకు యివ్వబడుతున్నదన్నారు. తెలుగు భాషా సమితివారు విజ్ఞానసర్వస్వ రచననే గాక సంస్కృతి శాఖ ద్వారాను ఉత్తమ రచనలకు బహుమతులు ఇవ్వడంలోనూ ఏవిధంగా కృషి చేస్తున్నది కూడా సభ్యులకు ఎరుకపరచారు.

శ్రీ టి వి సుబ్బారావుగారు ఉపన్యసిస్తూ ఇటువంటి విజ్ఞాన సర్వస్వం చాలా ముఖ్యమైనదని ఫ్రెంచి విప్లవానికి ముందు ఇటువంటి గ్రంథాలు ప్రకటింపబడడంవల్లనే దేశంలో విజ్ఞానాభివృద్ధికి దారి చక్కగా ఏర్పడిందని చెప్పి తెలుగు భాషాసమితివారు చేస్తున్న కృషిని ప్రశంసించి సమితిని ఆశీర్వదించారు.

తరువాత సమితి కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణ గారు తెలుగు భాషా సమితివారు ప్రచురించిన తెలుగు దేశం పటం గల క్యాలెండరును ప్రకటిస్తూ ఆంధ్రదేశం విస్తీర్ణం జనసంఖ్య వేరువేరు రాష్ట్రాల్లో విడిపోయి ఉన్న ఆంధ్రులు, సరిహద్దు ప్రాంతాల్లో ఆంధ్రులు మొదలైన సంఖ్యలను వివరించి తెలుగు దేశం అంతా ఒకటని చిన్నపిల్లల దగ్గరనుంచి పెద్దవాళ్లవరకూ తెలుగుదేశ పటం దగ్గర వుంచుకొని తమ దేశపు ఎల్లలు, దాని వైశాల్యం గొప్పదనం దాన్ని తెలుసుకొని తాము ఆంధ్రులమనే జాతీయ భావం పెంపొంద చేసికోవాలని ఉద్బోధించారు.

సభకు విచ్చేసిన సభ్యులను సమితివారు చందన తాంబూలాదికంతో సత్కరించారు.

తరువాత కుమారి గిడుగు భారతి శ్రీమతి చెల్లాయిల గానం కుమారి మోటూరి జోత్స్న కుమారి ఉష కుమారి గిరిజల నాట్యం జరిగింది. శ్రీ పందిరి మల్లికార్జునరావుగారి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

## తెలుగు సమితి—బెంగుళూరు

పై సమితి ఆధ్వర్యాన ఉగాద్యుత్సవాలు స్థానిక కన్నడ సాహిత్య పరిషన్మందిరంలో ఇటీవల జరుపబడినవి. సమితి అధ్యక్షులు విద్వాన్ గడియారం సుబ్బయ్య శాస్త్రిగారు స్వాగతవాక్యాలు పలుకుతూ ఆటపాటలతో యిటువంటి సమారంభాలద్వారా నగరంలోని తెలుగు ప్రజానీకమంతా ఒక్కచోట సమావేశించటానికి తెలుగు సమితి ఇతోధికంగా కృషించగలదని అన్నారు. విద్వాన్ కె బి శ్రీకంఠశాస్త్రిలుగారు, శ్రీ ఆర్ శంకరనారాయణ రాజా గారున్నూ ఈ సందర్భానికని ప్రత్యేకంగా అల్లిన "ఉగాది ప్రశస్తి" పద్యాలు చదివారు. ఈ సందర్భంలోనే సమితి ఉద్యమాన్ని ప్రశంసిస్తూ సభ్యులకున్నూ మైసూరు రాష్ట్రాంధ్రులకున్నూ శ్రీ విద్వాన్ రత్న నిడదవోలు వెంకటరావు గారు ఆంధ్ర శేషగిరిరావు గారు పందిరి మల్లికార్జునరావు గారు మొదలైన విద్వత్కవులు సంవత్సరాదికి శుభాశీఃపురస్సరంగా సందేశాలు పంపారు. కుమారి మధ, కుమారి సారనాయకీ నృత్యం చేశారు. సమితి సభ్యులు "మీనా పెళ్లి" అనే ఏకాంకికను ప్రదర్శించారు. ఈ నాటికకు సుప్రసిద్ధ కన్నడ రచయిత శ్రీ "పర్వతవాణి" గారి "మీనా మదువె" తెలుగుసేత, సంగీతం దర్శకత్వం శ్రీ వి టి కుమార్‌గారు. రాష్ట్రగానంతో సభ ముగిసింది. మిస్ సరోజ మిస్ వి కనక, శ్రీ కృష్ణయ్య గారు శెనగ్గి గారు, రామచంద్రన్ గారు కేశవులు గారు శేశవులు గారు కె సూర్యనారాయణ గారు, వి టి కుమార్ గారు నాటకంలో పాల్గొన్నారు.

# స్టాలిన్ జీవితఘట్టాలు



స్టాలిన్

కామ్రేడ్ స్టాలిన్ 1879 డిశంబరు 21 తేదీన టిఫ్లిస్ రాష్ట్రంలో గోరీ అనే గ్రామంలో జన్మించారు ఆయన అసలు పేరు జోసఫ్ విస్సారినోవిచ్ తండ్రి చెప్పులు కుట్టుకుని జీవించే బీద కార్మికుడు స్టాలిన్ తల్లి రైతుబిడ్డ చిన్నప్పటినుండీ ఆమెకు మత ధర్మనిష్ఠలు మెండు తన ముద్దుల కొడుకు పెరిగి పెద్దవాడై ఏ చర్చిలోనో మతగురువౌతాడని ఆమె కలలు కనేది

కాని బాల్యంలో క్రైస్తవ ప్రార్థనామందిరాలకు హాజరవుతున్నా క్రైస్తవమత విరుద్ధ గ్రంథాలను చదవడం ప్రారంభించాడు స్వతంత్ర భావాలతనిలో అంకురించి క్రమంగా దృఢపడ్డాయి 1898 లో కమ్యూనిస్టుపార్టీలో చేరడానికి పూర్వమే ఆయనకు మతంపై విశ్వాసం పోయింది అంతక్రితమే తన జన్మస్థలమైన జార్జియాతో సన్నిహిత సంబంధాలను నెలకొల్పుకుని స్థానిక సంస్కృతి సాంప్రదాయాలను బాగా అవగాహన చేసుకున్నాడు

## ప్రథమ విప్లవ దీక్ష

పదిహేనేళ్ల వయస్సులో ట్రాన్స్ కకేషియా అంతటా వ్యాపించియున్న మార్క్సిస్టు విప్లవోద్యమంతో కామ్రేడ్ స్టాలిన్ పరిచయం కల్పించుకున్నాడు ఈ విప్లవోద్యమం స్టాలిన్‌పైన అమోఘమైన ప్రభావాన్ని ప్రసరించింది 1896—97 లో స్టాలిన్ మార్క్సిస్టు అధ్యయన తరగతులు నడిపించాడు

1898 లో రష్యన్ సోషల్ డిమాక్రాటిక్ లేబరు పార్టీలో సభ్యుడుగా చేరాడు ఈ కాలంలో స్టాలిన్ తన మార్క్సిస్టు విజ్ఞానాన్ని పెంపొందించుకోవడంలో నిరంతర కృషి చేశాడు ఆరోజుల్లోనే లెనిన్ రచనలు చదివిన ఫలితంగా ఆయన్ను కలుసుకోవాలనే అభిలాష అతనిలో కలిగింది మార్క్సిస్టు అధ్యయనం చేస్తూనే ప్రజోద్యమాల్లో నిరంతరం పనిచేస్తుండేవాడు ఆనాటికి స్టాలిన్ మత విద్యాలయంలో విద్యాభ్యాసం చేస్తుండేవాడు ఆయన విప్లవ చర్యలకుగాను మతాధికార్లు 1899 లో అక్కడనుండి వెళ్ళగొట్టారు

1901 లో "ఇస్క్రా" పత్రిక అవతరించిన తర్వాతనుండి లెనిన్ విషయమై స్టాలిన్‌కు యెక్కువగా తెలియవచ్చింది లెనిన్, పార్టీకి కేవలం నాయకుడేకాక స్థాపకుడనికూడా అభిప్రాయపడేవాడు ఆ సంవత్సరమే తీవ్రమైన ఆర్థిక సంక్షోభం దేశాన్ని ముంచెత్తింది స్టాలిన్ ఒక "మేడే" ఉత్సవాన్ని నడపడం విని లెనిన్ దీనికి కకేషియా ప్రాంతమంతటా యెంతో చారిత్రక ప్రాధాన్యముందని తన "ఇస్క్రా" పత్రికలో శ్లాఘించాడు

కకేషియా విప్లవోద్యమం జారు ప్రభుత్వాన్ని కంగారెత్తించింది 1901 మే నెలలో స్టాలిన్ పనిచేసే ఫిజికల్ అబ్జర్వేటరిని జారు పోలీసులు సోదా చేశారు తనపై వారంటు జారీఅయినట్లు తెలుసుకొని స్టాలిన్

సోవియట్ యూనియన్ సోషలిస్టు దశలో అప్పుడే ప్రవేశించింది. నిర్ణీత సమయానికి ముందుగానే ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసింది. పారిశ్రామిక వ్యవసాయక రంగాల్లో బ్రహ్మాండమైన అభివృద్ధి సాధించబడింది.

1934 లో జరిగిన 17 వ పార్టీ మహాసభలో స్టాలిన్ సోవియట్ విజయాలను పేర్కొంటూ నివేదికను సమర్పించాడు. రెండవ పంచవర్ష ప్రణాళిక గూడా అనుకున్న కాలానికి ముందుగానే 1937 లో పూర్తయింది. "స్టకనోవ్ ఉద్యమం" ద్వారా దేశం నలుమూలలా బ్రహ్మాండమైన శక్తితో వాయువేగ మహావేగాలతో కార్మికులు ఉత్పత్తిని పెంపొందించారు. తామింత అనుభవించి యితర దేశాలకు సహాయపడే రీతిగా ఉత్పత్తి అధికమైంది.

స్టాలిన్ రాజ్యాంగం

స్టాలిన్ అధ్యక్షతన యేర్పడ్డ రాజ్యాంగ కమిటీ నూతన రాజ్యాంగాన్ని తయారు చేసింది. సోవియట్‌లో పౌరులు యావన్మందీ యీ రాజ్యాంగాన్ని చర్చించి తమ సూచనలు ప్రభుత్వానికి అందించారు. మానవజాతి కనివిని ఎరుగని మహోత్కృష్ట రాజ్యాంగంగా ప్రపంచ ప్రజలు దీన్ని శ్లాఘించారు.

1938 లో స్టాలిన్ బోల్షివిక్ పార్టీ చరిత్రను రచించాడు. ఈ రచన పార్టీ చరిత్రలోనే ఒక స్వర్ణ ఘట్టం. చారిత్రక భౌతికవాదమనే మహోత్కృష్ట తత్వశాస్త్ర గ్రంథాన్ని తేటమాటలతో వివరించి వ్రాయడం అనన్య సామాన్యమైన కృషి.

1939లో జరిగిన 18 వ పార్టీ మహాసభలో స్టాలిన్ తన నివేదికను సమర్పిస్తూ, పార్టీలో బ్రహ్మాండమైన ఐక్యత నిర్మింపబడ్డదని వెల్లడించాడు. అంతర్జాతీయ పరిస్థితులు ప్రమాదస్థితికి వచ్చాయని హెచ్చరించాడు. యుద్ధోన్మాదంతో శివాలెత్తుతున్న సామ్రాజ్యవాదుల దుష్ట ఎత్తులను బట్టబయలు చేశాడు. మానవుని మానవుడు దోచుకొనే వ్యవస్థను అంతంచేసిన సోవియట్ రష్యాకు అంతిమ విజయం తప్పదని స్టాలిన్ ఉద్ఘాటించాడు.

లెనిన్ సిద్ధాంతానికి స్టాలిన్ వన్నె పెట్టాడు. పెట్టుబడిదారీ రాజ్యాలలోని పరివృతమైనా, ఒక్క రష్యాలోనే సోషలిస్టు నిర్మాణం సాధ్యమని నిరూపించాడు. స్టాలిన్ 60 వ జన్మదినోత్సవం నాటికి "సోషలిస్టు హీరో" బిరుదాన్ని యివ్వాలని సుప్రీం సోవియట్ నిర్ణయించింది. స్టాలిన్ నాయకత్వాన సోవియట్ ప్రజలు కమ్యూనిస్టు ఆశయం వైపు పురోగమిస్తుండగా రెండవ ప్రపంచ యుద్ధచ్ఛాయలు కనిపించాయి. 1939 లో హిట్లరు చెకొస్లోవేకియాను కబళించాడు. వెంటనే తూర్పు యూరపియన్ రాజ్యాలపై విజృంభణ ప్రారంభమైంది. ఇంపీరియలిస్టు జపాన్ గూడా రంగంలో ప్రవేశించింది. 1939 ఆగస్టులో సోవియట్ ప్రభుత్వం స్టాలిన్ నాయకత్వంకింద జర్మనీతో నిరాక్రమణ సంధిచేసుకోవలసి వచ్చింది.

యూరప్‌ను కబళించిన హిట్లరు హఠాత్తుగా 1941 జూన్‌లో సోవియట్ యూనియన్‌పై దండెత్తాడు. 1941 జూన్ 30 వ తేదీన సర్వాధికార సమన్వితమైన రక్షణ సంఘాన్ని సోవియట్ ప్రభుత్వం నియమించింది. స్టాలిన్ దానికి అధ్యక్షునిగా నియమితుడైనాడు. దేశం యావత్తు సాయుధ కేంద్రంగా తయారై శత్రు దుర్భేద్యమయింది. మాస్కో నగరానికి మహా ప్రమాదం సంభవించే పరిస్థితి యేర్పడింది. అనుపమాన వ్యూహరచనతో మాస్కోవద్ద జర్మన్ సైన్యాలను పూర్తిగా ఓడించే పథకంవేసి స్వయంగా యుద్ధరంగంలో నిలిచి యుద్ధం నడిపించాడు స్టాలిన్. అజేయమైన ఎర్ర సైన్యం నాజీ మూకలపైబడి చీల్చి చెండాడాయి. జర్మన్ సైన్యాలు విచ్ఛిన్నమై పలాయనం చిత్తగించారు. హిట్లరు కలలు పగటికలలైనాయి.

పశ్చిమ రాజ్యాలు రెండవ రంగాన్ని ప్రారంభించకుండా నిర్లక్ష్యం చేస్తున్నా సోవియటు సైన్యాలు ఒంటరిగానే నిల్చి శత్రుసైన్యాలను దునుమాడుతున్నాయి. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధ ఘట్టంలో నాజీ జర్మన్ సైనికులు మూడులక్షలు నిహతులైనారు. స్టాలిన్ యుద్ధ వ్యూహరచన ప్రపంచానికి వెల్లడైంది.

సైనిక రీత్యా సోవియటు యూనియన్‌కు స్టాలిన్ చేసిన సేవను ఉగ్గడిస్తూ 1943 మార్చిలో "మార్షల్" బిరుదాన్ని సోవియటు ప్రభుత్వం బహూకరించింది. ఇదే గాక "ఆర్డర్ ఆఫ్ సువరోవ్", "ఆర్డర్ ఆఫ్ విక్టరీ" అనే బిరుదప్రదానాలు గూడా చేయబడ్డాయి. నాజీ సైన్యాలను తరుముతూ మార్గమధ్యంలోని దేశాలను రెడ్ ఆర్మీ శత్రు విముక్తం చేసి బెర్లిన్ ఆక్రమించింది. గత్యంతరంలేక జర్మన్ సైన్యాలు లొంగిపోవలసి వచ్చింది. స్టాలిన్ నాయకత్వాన రెడ్ ఆర్మీ చూపిన అకుంఠిత త్యాగశక్తి, అద్వితీయ పోరాటశక్తి, నైపుణ్యాలు ప్రపంచం వేనోళ్ళ ప్రస్తుతించింది. రష్యా శత్రునిర్ముక్తమైంది. రాజకీయ చతురతలో, యుద్ధ నైపుణ్యంలో స్టాలిన్‌కు స్టాలినే సాటినిపించుకొన్నాడు.

యుద్ధానంతరం పునర్నిర్మాణ కార్యక్రమాలకు స్టాలిన్ అత్యంత ప్రాధాన్యమిచ్చాడు. నాజీ మూకలచే సర్వనాశనం చేయబడ్డ ప్రాంతాల్లో పునర్నిర్మాణ కార్యక్రమం త్వరితగతిని సాగుతోంది. యుద్ధకాలంలో అనుపమాన త్యాగాలొనర్చిన సోవియటు పౌరులు, రెడ్ ఆర్మీ తిరిగి పునర్నిర్మాణ కార్యక్రమంలో నిరాఘాటంగా కృషిచేసి కోల్పోయిన నష్టాన్ని పూడ్చుకోగల్గారు.

1944 జూన్ 27 వ అత్యున్నత సైనిక బిరుదు "జనరలిస్సో" స్టాలిన్‌కివ్వబడింది. సెప్టెంబరు 2 వ తేదీన సోవియటు సైన్యం ధాటికాగలేక జపాన్‌కూడా లొంగిపోయి శత్రువులు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయారు.

రెండవ ప్రపంచ యుద్ధమైన మరునాటి నుంచి సామ్రాజ్యవాదులు సోవియట్‌మీదా తూర్పు యూరప్ దేశాలమీద కుట్రలు పన్నుతూనే ఉన్నారు. యుద్ధ ప్రలాపాలు చేస్తూనే ఉన్నారు. అమెరికా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల యుద్ధోన్మాద ప్రలాపాలకు వ్యతిరేకంగా ప్రపంచమంతటా శాంతి మహోద్యమం వ్యాపించింది. ఈ మహోద్యమం కామ్రేడ్ స్టాలిన్ సారథ్యంక్రింద యింతింతై వటుడింతయై విశ్వమంతా వ్యాపించి నేటి అమెరికా పాలకులకు సింహస్వప్నమైంది.

ప్రపంచ శాంతిరక్షణ భారాన్ని ప్రజలే వహిస్తే శాంతిని సాధించకపోవడమేగాక, దాన్ని సుస్థిరంగా కాపాడుకోగలమని స్టాలిన్ పలికిన వాక్యాలు ప్రపంచ ప్రజల చెవుల్లో శాశ్వతంగా మార్మోగుతూనే ఉంటాయి. ఆ వాక్కు అమరవాక్కు. ఆయన మన కిక లేడు. అయినా మనందరి హృదయాల్లోను ఆయ నెప్పుడూ చిరంజీవే.

(నగారా పౌరుష్యంలో)




(రివ్యూకై రెండు ప్రతులు పంపాలి)

## మైరావణ చరిత్ర

(ద్విపద కావ్యము)

కవి కొచన పరిష్కర్తలు శ్రీ వి సుందరశర్మ శ్రీ అ మహాదేవశాస్త్రి ప్రకాశకులు శ్రీ ఎస్ గోపాలన్ గౌరవ కార్యదర్శి సరస్వతీ మహల్ గ్రంథాలయము, తంజావూరు వెల రు 1-40 పుటలు 76

సుమారు 800 ద్విపదలలో సరళమైన శైలిలో విరచితమైన ఒక దేశికావ్యమిది మైరావణుడు మాయావిభీషణ వేషమున వచ్చి హనుమంతుని మోసగించి అతని "వాలంపు కోట" నుండి రామలక్ష్మణుల నెత్తుకొనిపోవుట జరిగిన మోసము గుర్తించిన హనుమంతుడు ముంగిన రూపమున మైరావణుని పాతాళలంక ప్రవేశించి భయంకర యుద్ధమునో మైరావణునేకాక శతశిరోద్వాదులగు వరువురు ఇతర రాక్షసులనుగూడ మడియించి రామలక్ష్మణులను విడిపించుకొని వచ్చుట—ఇందలి ప్రధానేతివృత్తము హనుమంతుడు నాయకుడుగాగల వీరరస ప్రధానమైన ఈ చిన్న దేశీయ కావ్యములో కొచనకవి ప్రదర్శించిన కథా కథన చాతురి ప్రత్యేకప్రశంసాపాత్రముగ నున్నది

పట్టాభిషేకానంతర మొకనాడు విభీషణ, సుగ్రీవ, హనుమదాది మహాద్భవులకు వీడ్కోలు తెలుపు నిమిత్తము శ్రీరాము కొక సభచేసినాడు సభలో సుగ్రీవాదులను సత్కరించుచు, హనుమంతునియెడ ప్రత్యేకాదరము చూపి "వెంటనే గొలువెల్ల విస్మయంబంద వర్ధాసనంబున నాతని నునిచి" గౌరవించినాడు వశిష్ఠమునితో హనుమంతుడు తన కొనర్చిన వివిధ మహోపకారములను రామునకు వర్ణించి చెప్పినాడు కాని మైరావణుని పాతాళలంకనుండి తమను హనుమంతుడు విముక్తులనుచేసిన వృత్తాంతము మాత్రము చెప్పలేదు అది ఆతడెరుగడు రామ లక్ష్మణులు నిద్రితులై ఉండగా రాత్రిసమయమున ఆ సంఘటన జరిగినది అంతుచే, యోగదృష్టితో సర్వము చూడగలిగిన వసిష్ఠు డావృత్తాంతమును శ్రీరామునికి వినిపించెను ఈవిధముగ వసిష్ఠుని నోట మైరావణ చరిత్రనంతటిని కొచనకవి చెప్పించెను కథలో వేరువేరు సందర్భాలలో వేరువేరు పాత్రలచే కవి చమత్కారముగా పూర్వరామాయణగాథనుకూడ సంగ్రహముగ చెప్పించినాడు మైరావణుని భార్య మాతంగి భర్తను దుర్వ్యాప్తినుండి వారించుచు జననాది పరశురామ గర్వభంగమువరకు నడచిన రామకథను వర్ణించి చెప్పును ఇట్లే మరొక సందర్భములో హనుమంతుడు మిగిలిన రామకథ ఖరదూషణాది సంహారముతో కూడినది వర్ణించి చెప్పును ఈ విధముగా ఔచిత్యము చెడకుండ మధ్యలో పూర్వరామాయణగాథను చెప్పించుట కొచనకవి శిల్పవైదగ్ధ్యమున కొక తార్కాణము

అలంకార విన్యాస చాతురిగాని వర్ణనా వైదగ్ధ్యముగాని, శైలీగాంభీర్యముగాని రసపరిపుష్టిగాని ఈ కావ్యమున విశేషముగ కనిపింపవు సీత సమర్త లక్ష్మణదేవర నూర్పు మొదలైన తెలుగు పాటలవలె కావ్యము సరళముగా నడచిపోవును ఇది లాక్షణిక కావ్యము కాదు వ్యర్థపదములు దుష్టరూపములు లెక్కకు మిక్కిలిగ నున్నవి

"అంగద సుగ్రీవ యాంజనేయులకు"

"కరమర్థినవరత్న గద్దె వేయించి"

"చంచలింపక లాపుపేయంగ వచ్చు"

"కొమరొప్ప వీవింపగృహదేవతలను"

"యమునగంగ మునిపరు యాగంబుకాదె"

"కొమరొప్పచనిబూని ఘటికుండుపోయి

కొమరొప్ప నాసేన దిరిగి రాజూల"

"రావిపోయకోనాకి కుటిలవానిప్పుడు"

తెలుగొప్ప దివాంధ దీవెనలిచ్చె

ఛందో వ్యాకరణ శాస్త్రముల దృష్ట్యా దుష్టములైన ఇట్టి రూపాలు కావ్యమంతట కోకొల్లలుగ నున్నవి ఈ దేశికావ్యమును యథాతథముగ ప్రచురింపక అరమున్నలు మున్నగువని తేర్చి పరిష్కర్తలు దీనిని లాక్షణిక కావ్యముగా వెలయింపజేయుట అవిచారమూలక మనక తప్పదు, ముద్రణ దోషములుకూడ ఈ మరతంనరగ మున్నవి నాలుగు పుటల తప్పొప్పుల పట్టిక ప్రచురించినను ఆ పట్టికలోనికికూడ ఎక్కని తప్పులింకను గ్రంథములో ఇబ్బడిగ నిలిచియున్నవి గ్రంథ పరిష్కరణములోగాని ప్రూపులను సరిచూచుటలోగాని పరిష్కర్తలు మరికొంత జాగరూకతను వహించి ఉండవలసినది

తెలుగు సాహిత్యమునో విశిష్టస్థానము సంపాదించుకొనలేకపోయినను కొచన కవి కృతమైన ఈ మైరావణ చరిత్ర సరళము సర్వజన సుబోధము, కథాకథన చాతురి విలసితము నగుటచే ఆనాదరణ పాత్రము కాగలదనుట సందేహము లేదు

"శ్రీనివాస"

# తెలుగు దేశపు పటము

తెలుగు భాషాసమితి (మద్రాసు) విజయ సంవత్సరపు ఉగాది పండుగనాడు విజ్ఞాన సర్వస్వం "చరిత్ర—రాజనీతి" సంపుట ముద్రణ ప్రారంభోత్సవ సందర్భంలో ప్రకటించిన తెలుగు దేశపు పటముతోనున్న క్యాలెండరు సమీక్షకై పంపించినారు

మద్రాసు హైదరాబాదు మైసూరు రాజ్యాలలోగల సంపూర్ణాంధ్రదేశం వైశాల్యం జన సంఖ్య ఆంధ్రదేశపు సరిహద్దు రాజ్యాలలోని తెలుగుదేశపు విస్తీర్ణం తెలుగువారి జనసంఖ్య ఇరుగుపొరుగు రాజ్యాలలోను ఉన్న తెలుగువారి జనసంఖ్య—ఇవన్నీ ఇందు చూపబడినవి ఇప్పు డేర్పడనున్న ఆంధ్రరాష్ట్రం ముదురు రంగుతోను సంపూర్ణాంధ్రమగుటకు రాబోయే ఆంధ్రరాష్ట్రములో చేరవలసిన పరిసర ప్రదేశం లేత రంగుతోను చూపబడింది మార్చినెల (1953) మొదలు ఫిబ్రవరి (1954) చివరివరకు ఇంగ్లీషు తేదీలు ఉన్నవి ఈ క్యాలెండరు

పదకొండు అంగుళాలు వెడల్పు పదహేను అంగుళాలు పొడవు గలిగిన కాగితంమీద అచ్చువేసి, మూడు నెలలకొక షీటు చొప్పున క్యాలెండరు తేదీలు అతికించబడింది

ఆంధ్రరాష్ట్ర ప్రాప్తికై తెలుగువారు గత నాలుగు దశాబ్దాలుగా ఆందోళన సలుపుతూ వచ్చారు నిర్మాణం కావలసిన ఆంధ్ర దేశపు పటాలను కొన్ని కొన్ని పత్రికలు కొంతమంది పెద్దలూ అప్పుడప్పుడు ప్రకటిస్తూనే వచ్చారు కాని, సమగ్రమైనదీ సంపూర్ణమైనదీ లోపరహితమైనదీ ఇంతవరకూ ఒక్కటి బయిటా రాలేదు ఇప్పుడు తెలుగు భాషా సమితివారు ప్రకటించిన ఈ ఆంధ్రదేశపు పటం ఆలోపం కొంత తీర్చిందని చెప్పవచ్చును. తెలుగు భాషా సమితి ఈ పని ఎప్పుడో చేయవలసినది ఇప్పటికైనా చేసినందుకు సంతోషం

మద్రాసు తెలుగు జిల్లాలలో తెలుగు ప్రదేశాల విస్తీర్ణం 62 326 చదరపు మైళ్లు అని జనసంఖ్య 2 10 34 198 అని అలాగే హైదరాబాదు రాజ్యంలోను మైసూరు రాజ్యంలోను ఉ తెలుగు ప్రదేశాల విస్తీర్ణాన్ని జనసంఖ్యను తెలుపు చేశారు ఇవి సంపూర్ణ తెలుగుదేశంగా మొత్తం విస్తీర్ణం జనసంఖ్య తెలియజేయబడింది

ఈ అంకెలను పరిశీలిస్తే ఇవి 1951 వ సంవత్సరం జనాభా రిపోర్టుననుసరించి తేలిన అంకెలుగా తోస్తుంది ఈ విషయం ఇందులో తెలియజేసి ఉండవలసింది

ఇరుగుపొరుగు రాజ్యాలలోను ఇతర రాజ్యాలలోను ఉన్న తెలుగువారి జనసంఖ్య క్రమశః 44 80 929 అని 5 71 826 అని తెలియజేశారు 1931 సంవత్సరపు జనాభా రిపోర్టు ఆధారంగా 1951 సంవత్సరానికి జనాభా పెరుగుదలలో నిష్పత్తి కట్టి తేల్చిన సంఖ్యలుగా తెలుస్తున్నది. ఈ విషయాలను క్యాలెండరులో సూచించి ఉండవలసినది ఇక్కడే సరిహద్దులలోని తెలుగుదేశం వైశాల్యం 7 000 చదరపు మైళ్లు అని జన సంఖ్య 12 00 000 అని చూపబడిన లెక్కలకు కూడా ఆధారం సూచించి ఉంటే ఎంతో బాగుండేది

ముదురు ఆకుపచ్చ రంగులో చూపబడిన ప్రదేశం కోస్తా జిల్లాలు రాయలసీమలోని కర్నూలు కడప చిత్తూరు అనంతపురం జిల్లాలను బళ్లారి జిల్లాలోని మూడు తాలూకాలను చూపబడినవి హైదరాబాదులోని తెలంగాణా మైసూరులోని కోలారు జిల్లా సేలం జిల్లాలోని హోసూరు కృష్ణగిరి తాలూకాలు చెంగల్పట్టు జిల్లాలోని పొన్నేరి తాలూకా ధరంపురం కోరాపుట్టు దక్షిణ బస్తరు మొదలైనవి లేత ఆకుపచ్చలోను చూపబడినవి మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాల రంగూ ఈ రంగూ ముదురూ లేతరంగుల భేదంతో చూపబడింది కాని ఈ రంగులు ఇంతకంటె స్పష్టంగాను అందంగాను చూపబడి ఉంటే బాగా ఉండేది

మైసూరు రాజ్యంలోని కోలారు జిల్లా మాత్రం సంపూర్ణ ఆంధ్రంతో చేరగల ప్రదేశంగా చూపించారు తుంకూరు చిత్రదుర్గం జిల్లాలలోని కొంత భాగం కూడ ఆంధ్రప్రదేశంలో చేరవలసినట్టుగా లేతరంగుతో చూపినారుగాని ఆ జిల్లాల పేరులైనా ప్రకటించి ఉంటే బాగుండేది

పొరుగు రాజ్యాలను భాగాలను చూపిస్తూ ఒరిస్సా రాష్ట్రం మధ్యప్రదేశం మహారాష్ట్రం మైసూరు రాజ్యం అని ఓఢ్రం హిందీ కన్నడం అని చూపించారు కొందరు హైదరాబాదు రాష్ట్రం పేర్లనుకూడా సూచింపవలసిన అవసరం ఉంది

అక్కడే జిల్లాలు, ప్రదేశాలు పట్టణాల పేర్లను వ్రాయునప్పుడు కూడ క్రమపద్ధతిగాని తెలుగు సంప్రదాయం గాని పాటించలేదు బెంగుళూర్ మహబూబ్ నగర్, ఆదిలాబాద్ నిజామాబాద్ వరంగల్ వేన్‌గంగ అని వ్రాయడం తెలుగు సంప్రదాయానికి విరుద్ధంగాను వినడానికి కఠోరంగాను ఉన్నది బెంగుళూరు మహబూబునగరం ఆదిలాబాదు నిజామాబాదు వరంగల్లు వేనగంగ అని ఉంటే తెలుగు శ్రవణానికి ఇంపుగా ఉంటుంది దక్షిణ బస్తరు ద బస్తరు"అని ఉత్తర ఆర్కాటు జిల్లాను "ఉ ఆర్కాటు జిల్లా" అని వ్రాయడంలో తగినంత జాగరూకత చూపినట్టు కనబడదు

భాషా సమితివారు మరల ప్రకటించు తెలుగు దేశపు పటంలో ఈ తప్పులు లేకుండ చూచెదరు గాక!

తెలుగు భాషా సమితివారు అదనులో తెలుగు దేశపు పటాన్ని ప్రకటించి తెలుగు ప్రజలకు అందజేయడం ప్రశంసనీయం మేము ముందు పేర్కొన్న లోపాలు లేకుండా ఈ పటాన్ని తయారుచేసి ఉంటే ఇంకా బాగా ఉండేదని మా అభిప్రాయం కాని భాషా సమితి కృషిని ప్రయాసను కించపరచడం ఎంతమాత్రం కాదు

తెలుగువారు అందరూ ఇండ్లలో ఈ తెలుగు దేశపు పటాన్ని తప్పక ఉంచుకొని లాభాన్ని పొందాలి తెలుగు దేశపు స్వరూపాన్ని తెలుగు ప్రజల ఆధిక్యాన్ని తెలుపుదు చేయడానికి ఈ పటం చక్కగా ఉపయోగపడగలదు

## యజ్ఞఫలము

రచన శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారు బి ఏ ప్రముఖ గ్రంథకర్త రామారావుపేట కాకినాడ వెల రెండు రూపాయలు

సంస్కృతమున భాసుడు రచించిన యజ్ఞఫలమను నాటకమునకిది యనువాదము ఇందు దశరథుని యజ్ఞఫలముగా రాముడు అవతరించుట మొదలు సీతాకల్యాణము వరకుగల రామచరితము ఇతివృత్తము ఇందు పాత్రపోషణము రసపోషణము సత్యాదాత్తములు అన్నింటికంటె గమనించదగినది విదూషకపాత్ర ఈ విదూషకుని హాస్యము ఇతర నాటకములలోవలె గాక ఉక్తి చమత్కారబుద్ధి కుశలతలకు భాసించుచున్నది.

శ్రీ స్నైల

శ్రీ వేంకటేశ్వరులు గారు తెల నాటకముల నమువదించిన ప్రజ్ఞాశాలురు సంస్కృతమున అపూర్వ ఖ్యాతిగాంచిన శాసనాటకముల నమువదించి యాంధ్రలోకమున కందించిన వీరి యత్నము ప్రశంసనీయము

—అప్పలాచార్యులు

## సౌభాగ్య వార్షిక సంచిక

వెల ఎనిమిది అణాలు సంవత్సర చందా రెండు రూపాయలు ప్రచు. మద్రాసు ప్రభుత్వం శ్రీ జనాభ్యుదయ శాఖ 7 ఆరాముదు గార్డెన్ స్ట్రీట్ మద్రాసు 8

మద్రాసు ప్రభుత్వం శ్రీ జనాభ్యుదయ శాఖ ఎజన తెలుగులో ప్రకటింపబడుతున్న ఈ సౌభాగ్య పత్రిక అచ్చు కూర్పు, అందచందాల లోనే గాక విషయగౌరవంలోకూడ దినదినప్రవృద్ధ మానమవుతున్నట్లు ఈ ప్రత్యేక వార్షిక సంచికే తార్కాణం చక్కని వ్యాసాలతోను మంచి కథలతోను ప్రకటితమవుతున్న ఈ పత్రిక పత్రికా లోకంలో యథోచిత గౌరవస్థానాన్ని పొందుతూ ఉంది పత్రికా నిర్వాహకుల కార్యదీక్ష దక్షత వల్లనే పత్రిక పెంపుసొంపులు చేకూర్చుకుంటూ ఉన్నదని చెప్పవలసి ఉంటుంది ఉత్తమస్థాయిని చేకూర్చుటకు బాధ్యులయిన పత్రికా సంపాదకులను హృదయపూర్వకంగా అభినందించవలసి ఉన్నది శ్రీమతులు పాలంకి మాగ్యప్రకాశమ్మ, ఓటుకూరి లక్ష్మీకాంతమ్మ యశోదాదేవి వేమరాజు సుభద్రాదేవి శ్రీయుతులు దిగుమర్తి సాంబశివరావు గుమ్మలూరి సత్యనారాయణ బి వి నరసింహారావు ఆచార్య వి సాంబమూర్తి ప్రభృతుల ఉత్తమ వ్యాసాలతో ప్రకటితమయినది ఈ వార్షిక సంచిక

ఇంత చౌకగా ఇంత చక్కని వ్యాసాలతో ప్రకటింపబడుతున్న సౌభాగ్య మాస పత్రిక సర్వవిధాలా ఆదరింప తగినది

## సంస్కృతి

రాజమహేంద్రవరంనుండి శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారి సంపాదకత్వాన వెలువడిన మాస పత్రిక ప్రథమసంచిక సమీక్షకై అందినది

శ్రీ వంటూరి బంగారయ్య, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి శ్రీ జి ఎస్ ఆచార్య ఉపదేశికవర్గ పర్యవేక్షణలో వెలువడు ఈ పత్రిక ఉత్తమస్థాయిని వివాదుకొగలదనిభావించవచ్చును

"సాహిత్య విజ్ఞానవిషయములు హృదయంగమమైన భాషలో ప్రజల కందీయవలయు"నను ఉదాత్తాశయంతో బయలుదేరిన సంస్కృతి పత్రిక తన ఉత్తమాదర్శాలను లక్ష్యంలో ఉంచుకొని తెలుగు సారస్వతానికి తెలుగు ప్రజానీకానికి సేవ చేయగలిగితే అందరూ హర్షిస్తారు

తొలి సంచికలో శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి "సంస్కృతి" అనే వ్యాసం శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి "విద్యాప్రవాహిని" అనే పద్యాలు శ్రీ వంటూరి బంగారయ్యగారి "...స్నయ అవతారి" పత్రిక స్థాయిని పెంపొందింప చేకూరుస్తున్నవి

చక్కని గ్లేజు కాగితంపై ముద్రింపబడిన అచ్చుతో ఆకర్షణీయంగా ఉన్నది ఇరవైనాలుగు పేజీలు పత్రిక ఎనిమిది అణాలు అంటే ధర ఎక్కువ అనిపించకమానదు

తెలుగు సంస్కృతికి కాణాచి అయిన రాజమహేంద్రవరంనుంచి వచ్చే ఈ పత్రిక తన ప్రయోజనాన్ని ఇనుమడింపజేసుకొంటూ తెలుగువారికి ఆదరపాత్రం కావాలని వాంఛిస్తాము

విడిప్రతి వెల ఎనిమిది అణాలు సంవత్సర చందా అయిదు రూపాయలు ప్రతినెలా 18 తేదీ వెలువడుతుంది పత్రిక పంపువారు సంస్కృతి రాజమహేంద్రవరం అని వ్రాయవలెను

## జమీన్ రైతు

(ఉగాది సంచిక)

విజయ ఉగాదిసందర్భంలో జమీన్ రైతు పత్రిక ఆంధ్రలోకానికి సమర్పించిన ప్రత్యేక సంచిక డెమ్మీ 1/4 సైజులో 74 పుటలతో వెలువడింది వెల ఎనిమిది అణాలు

శ్రీ రాయప్రోలు సుబ్బారావు శ్రీ జాషువా శ్రీ నార్ల వెంకటేశ్వరరావు మొదలగు వారి పద్యాలతోను శ్రీ బెజవాడ గోపాలరెడ్డి శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య శ్రీ ఏడిద కామేశ్వరరావు ప్రభృతుల వ్యాసాలతోను చిత్రాలతోను ఉన్నది

## గ్రంథ స్వీకారము

1 శ్రీరామాయణము బాల, అయోధ్యా కాండలు (ద్విపద) రచన కట్టా వరదరాజులు వెల ఐదు రూపాయలు

2 శ్రీరామాయణము ఆరణ్య, కిష్కింధా కాండలు (ద్విపద) రచన కట్టా వరదరాజులు వెల ఐదురూపాయలు

3 శ్రీరామాయణము సుందరకాండ (ద్విపద) రచన కట్టా వరదరాజులు వెల నాలుగు రూపాయలు

4 రఘునాథనాయకాభ్యుదయము (ద్విపద కావ్యము) * రఘునాథాభ్యుదయము యక్షగానము) విజయరాఘవ నాయక విరచితము

వెల రెండు రూపాయల పన్నెండు అణాలు

5 రాజగోపాల విలాసము (ప్రబంధము) చెంగల్వ కాళకవి ప్రణీతము

వెల మూడు రూపాయలు

6 పుళిందోపాఖ్యానము (ద్విపద కావ్యము) నివివర రామనార్యవిరచితం

వెల మూడు రూపాయలు

7 తాళదశప్రాణ ప్రదీపిక పోలూరి గోవిందకవి ప్రణీతము

వెల రూపాయిన్నర

8 విప్రనారాయణ చరిత్ర (యక్షగానము) విజయరాఘవ నాయక విరచితము

వెల రూపాయి పావలా

9 ద్విపద భాగవతము (దశమ స్కంధము) మడికి సింగనార్య విరచితము

వెల మూడు రూపాయలు

10 ఆంధ్రకామందకము అక్క-రాజు వెంకటకవి విరచితము

వెల రెండురూపాయ లన్నర

పై పది పుస్తకాలు ప్రచురణ తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయము తంజావూరు

11 ప్రపంచచరిత్ర (రెండవభాగము) రచన జవహర్‌లాల్ నెహ్రూ అనువాదం శ్రీ చింతాదీక్షితులు వెల రెండు రూపాయలు

12 "నా చిన్నప్పుడు" రచన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ ఆంధ్రీకరణము శ్రీ బద్దెపూడి రాధాకృష్ణమూర్తి బి ఏ బి ఎల్ వెల రూపాయి

13 పరస్వర్గము రచన శ్రీ ప్రకాప రామకోటయ్య వెల ఎనిమిది అణాలు

14 సోవియట్ రష్యా రచన జవహర్‌లాల్ నెహ్రూ అనువాదం శ్రీనండిరాజ్యం నాగేశ్వరరావు వెల రూపాయి

15 ప్రపంచ చరిత్ర రచన జవహర్‌లాల్ నెహ్రూ అనువాదం శ్రీ చింతా దీక్షితులు వెల: రెండు రూపాయలు

పై అయిదు గ్రంథాలు ప్రచురణ కల్చరల్ బుక్స్ లిమిటెడ్, 31 మీరాన్ సాహెబు వీధి మౌంటురోడ్డు మద్రాసు 2

16 నృసింహ పురాణము ఎఱ్ఱా ప్రగడ విరచితము

వెల రెండు రూపాయలన్నర

17. భక్తగీతములు రచన: శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ, బి ఏ వెల: మూడు అణాలు

18 జ్యోతిషార్ణవనవనీతము (ఆంధ్ర టీకాతాత్పర్య సహితము) రచయిత పింగళి వేంకటరామ జ్యోతిష్కులు వెల మూడు రూపాయలు

పై మూడు గ్రంథాలు ప్రచురణ మెసర్స్ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ తండయార్పేట మద్రాసు 21

19 ఖండస్మృతి రచన శ్రీ శాస్త్రి వెంకట నరసయ్య ప్రచురణ గ్రంథకర్త చిలకలూరిపేట గుంటూరు జిల్లా వెల ఎనిమిది అణాలు

20 నవగీతాలు రచన శ్రీ శాస్త్రి వెంకటనరసయ్య ప్రచురణ రామమోహన గ్రంథమాల యనమలకుదురు విజయవాడ వెల మూడు అణాలు

2 శ్రీ వేణుగోపాల శతకము రచయిత్రి శ్రీమతి పెమ్మరాజు బల్లి జయ లక్ష్మమ్మ ప్రచురణ రచయిత్రి రావూరు నెల్లూరు జిల్లా వెల తెలియదు

22 యుగసంసారం రచన శ్రీ కోదాటి వేంకటేశ్వరరావు ప్రచురణ రచయిత సూర్యాపేట నల్లగొండ జిల్లా హైద్రాబాదు (దక్కన్) వెల నాలుగు అణాలు

23 శ్రీ మదాంధ్ర గీతగోవింద కావ్యము రచన శతావధాని శ్రీ చెల్లా పిచ్చయ్యశాస్త్రి ప్రచురణ రచయిత సంస్కృత కళాశాల పొన్నూరు పోస్టు బాపట్ల తాలూకా వెల రెండు రూపాయలు

24 పద్మపురాణము (బ్రహ్మ ఖండము) అనువాదం తర్క-వేదాంత విద్యావిశారద శ్రీ మరువాడ శంభుశాస్త్రి ప్రచురణ సాధన గ్రంథమండలి, తెనాలి వెల రూపాయి

25 కథానికాగుచ్ఛము (పది ఉత్తమ పోటీ కథలు) ప్రచురణ హైదరాబాదు పౌర సంబంధ సమాచార శాఖ హైదరాబాదు, (దక్కన్)

26 దక్షిణపవనం రచన ఎల్మర్ గ్రీన్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహన్ వెల నాలుగు రూపాయలన్నర

27 వామపక్ష కమ్యూనిజం బాల్యారిష్టం రచన వి ఐ లెనిన్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహన్ వెల రెండు రూపాయలు

28 కారల్ మార్క్సు ఉపదేశాలు రచన వి ఐ లెనిన్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహనరావు వెల ఒక రూపాయి

29 ఆచరణం రచన మావ్-త్సె-తుంగ్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహనరావు వెల ఆరు అణాలు

పై నాలుగు పుస్తకాలు ప్రచురణ విశ్వసాహిత్యమాల, రాజమంద్రి

30 జైలు లోపల రచన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి ప్రచురణ రచయిత సర్వోదయ ప్రెస్, మహాంకాళి స్ట్రీట్ సికిందరాబాదు వెల పది అణాలు

Printed by V Azizullah at the Deccan Times Press, 137, Broadway, Madras for the Deccan Printing & Publishing Co Ltd., Madras Published by P Mira Bai at 16, Jones Street Madras—1
Editor P MALLIKARJUNA RAO Assistant Editor P MIRA BAI

# కిన్నెర

## సచిత్ర మాసపత్రిక

ఆంధ్రదేశం సర్వతోముఖంగా అభివృద్ధి పొందాలంటే అభ్యుదయం కలగాలంటే ఏయే జాతీయజీవన రంగాలలో ఏయే పనులు జరగవలసింది, ఏయే పథకములు వేయవలసింది, వాటిని యెట్లు నిర్వర్తించవలసింది తెలిపే వ్యాసాలు, ఆంధ్రదేశానికి ప్రత్యేకంగా అనువర్తించే వివిధ సమస్యలను గురించిన వ్యాసాలు కిన్నెరలో ప్రకటింపబడతాయి. ఒక్కొక్క విషయాన్నిగూర్చి సవిమర్శంగా చర్చించి, రచించిన ఉత్తమ వ్యాసాలు ప్రతినెలా ప్రకటింపబడతవి

భాషా సాహిత్యాలు, శిల్పం, కళ, ఆర్థిక రాజకీయ విషయాలు, శాస్త్రవిషయిక వ్యాసాలు, కథలు, నాటికలు మొదలైనవాటితో సర్వాంగ సంపూర్ణంగా ముచ్చటయిన ఆకారంతో ప్రకటింపబడుతుంది

ఆంధ్రాభ్యుదయానికి కంకణం కట్టుకున్న పత్రిక కిన్నెర ఆంధ్రజనానీకం ప్రతిక కిన్నెర ఆంధ్రసేవకై పుట్టిన పత్రిక కిన్నెర మన సంఘం మన ఆర్థికజీవనం ఈ విషమ పరిస్థితులలో వివిధంగా పునర్నిర్మాణం కావలసింది, మన జీవిత సమస్యలూ, వాటిని యెట్లా పరిష్కరించవలసింది చిత్రించే హృదయంగమములైన కథలతోను, వ్యాసాలతోను ఎంతో విజ్ఞానాన్ని చేకూరుస్తుంది కిన్నెర

**విడి కాపీ 6 అణాలు—సంవత్సర చందా నాలుగు రూపాయలు**

మేనేజరు:

**కిన్నెర :: 16, జోన్సు స్ట్రీట్ :: మద్రాసు-1**

